

# వైద్యసహాయం

ఒకనాడు పాపన్న ఏదో పని మీద వీధి వెంబడి పోతూండగా, ఒక ఇంటి ముందు నిలబడి వున్న చిన్న పిల్ల, "అయ్యా, ఒక చిన్న సహాయం చేస్తారా?" అని అడిగింది.

"తప్పకుండా చేస్తానమ్మా! ఏం కావాలి!" అని పరోపకారి పాపన్న ఆ పిల్లను అడిగాడు.

అరుగు మీద ఆ పిల్ల తల్లి పడుకుని ఉన్నది. ఆమెకు జ్వరం. కాళ్ళు నిస్సత్తువగా వుండటం చేత, లేచి లోపలికి వెళ్ళలేని స్థితిలో వుంది. ఎవరైనా సహాయం పట్టి ఆమెను లోపలికి చేర్చాలి.

పాపన్న జబ్బు మనిషిని మెల్లిగా లేవదీసి, లోపలికి తీసుకుపోయి, పక్క మీద పడుకోబెట్టి, "జబ్బుకు మందు తీసుకుంటున్నారా?" అని అడిగాడు.

"లేదు, నాయనా. మా బోటి వాళ్ళం మందులూ, మాకులూ ఎక్కడ కొనగలం? మందు లేకుండానే, జబ్బు దానంతట అది నయం కావాలిసిందే," అన్నది జబ్బుమనిషి.

"మీ నాన్నగా రేరమ్మా?" అని పాపన్న చిన్నపిల్ల నడిగాడు.

"మా నాన్న బస్తీలో వుంటాడు. వారాని కొకసారి వస్తాడు," అన్నది పిల్ల.

"జబ్బుకు మందు లేకపోతే ఎలాగ?" అంటూ పాపన్న అక్కడి నుంచి వైద్యుడి ఇంటికి బయలుదేరి వెళ్ళాడు. ఆ గ్రామానికి ఆయన ఒకడే వైద్యుడు. వైద్యు డింటి తలుపు మూసివున్నది. పాపన్న తలుపు తట్టిన మీదట కుర్రవాడొకడు తలుపు తెరిచి, "ఏం కావాలి?" అని అడిగాడు.

"వైద్యుడుగారు—" అని పాపన్న అంటూండగానే ఆ కుర్రవాడు చెయ్యి ముందుకు చాచాడు.

ఆ అభినయం అర్థంకాక పాపన్న, "ఏం కావాలి?" అని అడిగాడు.







"మీకు తెలీదా? వైద్యుడుగారిని చూడాలంటే నా చేతిలో ఒక పావలా పెట్టాలి. ఆయనతో మాట్లాడాలంటే మరో పావలా ఇవ్వాలి. మందు కూడా కావాలంటే మరి రెండు పావలాలు!" అన్నాడా కుర్రవాడు.

పాపన్న కుర్రవాడి చేతిలో ఒక పావలా పెట్టి లోపలికి ప్రవేశించాడు. అతన్ని చూడగానే వైద్యుడు చెయ్యిచాచాడు. పాపన్న ఆయన చేతిలో ఇంకో పావలా పెట్టాడు. పాపన్న చెప్పినదంతా విని వైద్యుడు, "నేను వచ్చి రోగిని చూడాలంటే ఎనిమిది పావలాలు ఇవ్వవలసి వుంటుంది," అన్నాడు. వైద్యుడికి రెండు రూపాయలిచ్చి, పాపన్న ఆయనను వెంటబెట్టుకుని జబ్బు మనిషి దగ్గిరికి తీసుకువచ్చాడు.

వైద్యుడు రోగిని పరీక్షించి, ఆమెకు ఏదో భస్మమూ, కషాయపు దినుసులూ, మైపూత ఇచ్చి, వాటి కన్నిటికీ డబ్బు పుచ్చుకుని, పథ్యపానాలు చెప్పి వెళ్ళిపోయాడు.

జబ్బుమనిషి పాపన్నతో, "జబ్బు నయం కాక అలాగే వుంటుందా, నాయనా? డబ్బుగల వాళ్ళు తప్ప ఈ వైద్యుణ్ణి భరించలేరు. ఆ సంగతి ఊళ్ళో అందరికీ తెలుసు. ఎందుకు వృథాగా డబ్బు ఖర్చు చేసుకుంటావు?" అన్నది.

"అదేమిటమ్మా? జబ్బుకు మందుపడి తీరాలి. అయే ఖర్చేదో నే నిచ్చుకుంటానులే," అని పాపన్న తాను దగ్గిరే ఉండి కషాయం తయారు చేయించి, రోగి చేత తాగించి, ఆ పని పూర్తి అయినాక తన ఇంటికి వెళ్ళిపోయాడు.

తరవాత పాపన్న తన భార్య మీనాక్షిని తీసుకు వచ్చి రోగికి శుశ్రూష చెయ్యటానికి ఏర్పాటుచేశాడు. మళ్ళీ రెండుసార్లు వచ్చి రోగిని చూసిన వైద్యుడు, పాపన్నా, అతని భార్యా రోగిని గురించి తీసుకునే శ్రద్ధచూసి, "నీకూ ఈ రోగికీ ఏమిటి సంబంధం?" అని అడిగాడు.





"ఆవిడా మనిషి, నేనూ మనిషిని. అంతకుమించి సంబంధ మేమీలేదు," అన్నాడు పావన్న.

పావన్నా, అతని భార్యా అమాయకులనీ, వాళ్ళు ఊళ్ళో వాళ్ళకోసం తమ డబ్బంతా ఇలాగే తగలేసు కుంటారనీ వైద్యుడు అనుకున్నాడు.

నాలుగు రోజులలో రోగికి వ్యాధి నిమ్మళించింది. ఈ సంగతి చెప్పి, పథ్యం మార్పులేమైనా వుంటే తెలుసుకుందామని పావన్న వైద్యుడి ఇంటికి వెళ్ళాడు.

వైద్యుడు తన ఇంటి వద్ద విచారంగా కూర్చుని వున్నాడు. "ఏమండీ, అలా దిగులుగా ఉన్నారు?" అని పావన్న ఆయన నడిగాడు.

"ఈ వూరి వాళ్ళంతా వట్టి పాపిష్టివాళ్ళు! చిన్నమెత్తు సహాయం చెయ్యరు-మందుకు మాత్రం వస్తారు!" అన్నాడు వైద్యుడు.

"ఏం సహాయం కావాలో చెప్పండి, నేను చేస్తాను," అన్నాడు పావన్న.

"నీవేం సహాయం చేస్తావు? ఆవును మోసుకుపోవాలి! మోస్తావా?" అని అడిగాడు వైద్యుడు.

"సాధ్యమైతే మోస్తాను. అసలు సంగతేమిటి? ఆవు ఎక్కడున్నది?" అంటూ పావన్న పై బట్ట తీసి నడుముకు బిగించాడు.






జరిగినదేమంటే, వైద్యుడి ఆవు ఇంటి పక్కన గడ్డి మేస్తూ, పక్కనవున్న పల్లంలో పడిపోయింది. ముందు కాళ్ళకు బాగా దెబ్బ తగిలింది. దాన్ని పక్క గ్రామంలో ఉండే పశువుల వైద్యుడి దగ్గిరికి చేర్చాలి. అది లేచి నిలబడలేదు గనక దాన్ని ఎవరన్నా మోసుకుపోవాలి.

ఆవును మొయ్యటానికి రమ్మని వైద్యుడు ఊళ్లో వాళ్లను పిలిచాడు. డబ్బిస్తానన్నా కూడా ఒక్కరూ రాలేదు.

ఈ విషయమంతా విని పాపన్న వైద్యుడితో, "ఆవును మోసుకుపోయే పని నేను చూస్తాను, మీరేమీ విచారపడకండి," అని చెప్పి, తన భార్య మీనాక్షిని పిలుచుకు వచ్చాడు. ఆవును వెదురుగడల చట్రంపైన పడుకోబెట్టి, దాన్ని పాపన్నా, మీనాక్షీ కలిసి ఎత్త ప్రయత్నించారు.

"మీరు కూడా ఒక చెయ్యి వెయ్యండి," అన్నాడు పాపన్న.

"నేనా!" అని వైద్యుడు దిక్కులు చూశాడు. కాని సహాయం వెళ్ళలేదు. పాపన్నా, మీనాక్షీ కలిసి అమిత ప్రయాసతో ఎలాగో ఆవును పశువుల పాక నుంచి బయటికి తెచ్చారు.

బయట కొందరు నిలబడి జరిగేదంతా చూస్తున్నారు. వారిప్పుడు ముందుకు వచ్చి, "పాపన్నగారూ, మీ రుండండి. మీ బదులు మేమే మోస్తాం. ఈ వైద్యుడుగారి కోసమూ, ఆయన ఇచ్చే డబ్బు కోసమూ అయితే మొయ్యంగాని, మీరు శ్రమపడుతుంటే చూస్తూ ఊరుకుంటామా?" అన్నారు.

వాళ్ళు ఆవును పొరుగూరు పట్టుకుపోయి పశువుల వైద్యుడి చేత దానికి చికిత్స చేయించి మళ్ళీ తీసుకువచ్చారు.

వైద్యుడు వారికి డబ్బివ్వబోయాడు, కాని వారు తీసుకోక, "అయ్యా, డబ్బే ప్రధానం కాదు. ఊరికింత ఉపకారం చెయ్యటం నేర్చుకోండి! అంతేచాలు!" అన్నారు.





# తండ్రి ఆస్తి

పాపన్న భార్య గర్భవతిగా ఉంది. ఆమెను పురిటికి పుట్టింటి దగ్గిర దిగబెట్టి పాపన్న తన గ్రామానికి వెళుతూండగా అతనికి ఒక పూరిగుడిసెలో నుంచి, "ఓరి భగవంతుడా! నాకు దిక్కులేని చావు రాసి పెట్టావా?" అని ఎవరో ఆక్రోశించటం వినిపించింది. పాపన్న వెంటనే ఆ గుడిసెలోకి ప్రవేశించి చూశాడు. ఒక పండు ముసలి, కుక్కి మంచంలో పడుకుని ఆరాటపడుతున్నాడు.

"బాబుగారూ, ఏమిటి మీకు వచ్చిన బాధ?" అని పాపన్న ఆ వృద్ధు నడిగాడు.

"ఎవరవో, నాయనా! దేవుడల్లే వచ్చావు. నా కాలం తీరిపోయింది. కన్ను మూసేలోగా నా కొడుకును ఒక్కసారి చూడాలనుంది," అన్నాడు వృద్ధుడు.

"మీ కొడుకు కాకపోతే నేనున్నాను. ఏం కావాలో చెప్పండి. మీకు అసలు జబ్బేమిటి?" అని పాపన్న అడిగాడు.

"వయస్సు తప్ప నాకు వేరే జబ్బేమీ లేదు. ఆకలిగా ఉన్నది, దాహమవుతున్నది. కాసిని నీళ్ళివ్వు. చచ్చిపోతున్నానని విచారమేమీ లేదు గాని, నా కొడుకును ఒక్కసారి చూడాలి. అది ముఖ్యం," అన్నాడు వృద్ధుడు ఆయాసపడుతూ.

పాపన్న గుడిసె అంతా కలయ చూశాడు. ఎక్కడా చుక్కనీరు లేదు, తినటానికి మెతుకైనా లేదు. అతను చప్పున గ్రామంలోకి వెళ్ళి, నాలుగిళ్ళలోనూ అడిగి వృద్ధుడికింత భోజనమూ, కుండతో నీరూ తెచ్చాడు. ఆ తిండి తిని, నీరు తాగి వృద్ధుడు కొంచెం తేరుకున్నాడు.

"నాయనా, ఈ జన్మలో కాకపోతేనేం, ఏ జన్మలోనో నాకు కొడుకువే అయి ఉంటావు. నా కొడుకును కూడా తీసుకు వచ్చావా, నీకు జన్మజన్మలకూ ఋణపడి ఉంటాను. నా కొడుకు ఫలానా గ్రామంలో







ఉన్నాడు. వాడి పేరు గౌతముడు. నే నీ గ్రామంలో ఉన్నానని, ఇంకో వారం, పది రోజుల కంటె బతకననీ, చచ్చేలోగా వాణ్ణి ఒక్కసారి తప్పకుండా చూడాలని కోరుతున్నాననీ చెప్పి ఎలాగైనా తీసుకు రావాలి!" అన్నాడు వృద్ధుడు.

పాపన్న ఆ వృద్ధుడికి రెండు రోజుల పాటు సరిపోయే తిండీ, నీరూ ఏర్పాటు చేసి, ఆయన చెప్పిన గ్రామానికి వెళ్ళాడు. అక్కడ అతనికి గౌతముడు దొరికాడు.

"మీ తండ్రిగారు ఫలానా గ్రామంలో అవసానదశలో ఉన్నారు. చూసే దిక్కు లేదు. బిచ్చ మెత్తుకుని జీవిస్తున్నారు. ఇప్పుడు మంచాన పడి, మిమ్మల్ని చూడా లంటున్నారు. మీరు వచ్చి ఆయనను ఈ నాలుగు రోజులూ కనిపెట్టి ఉండి మీ కర్తవ్యం మీరు నెరవేర్చండి," అని పాపన్న గౌతముడికి చెప్పాడు.

గౌతము డీ మాటలు విని చీదరించుకుని, "ఛీ, ఛీ! ఆ బిచ్చగా డెవడో నా తండ్రి అంటా వేమిటి? నా తండ్రి ఏనాడో పోయి ఉంటాడు. ఆయన కనిపించకుండా పోయి ముప్పై ఏళ్ళయింది," అన్నాడు.

కాని పాపన్న అతన్ని వదలక రావలిసిం దని నిర్బంధించాడు. నలుగురూ కూడారు. వారిలో ఒక పెద్దమనిషి, "వెళ్ళి చూసి రాగూడదుటయ్యా? ఒకవేళ మీ తండ్రి ఇంతకాలమూ బతికే ఉన్నాడేమో. ఈ పెద్ద మనిషి ఈ వార్త చెప్పటానికి నిన్ను వెతుక్కుంటూ వస్తే మొండితనం చేస్తావేమిటి?" అని గౌతముణ్ణి మందలించాడు.

గౌతముడు అయిష్టంగా పాపన్న వెంట బయలుదేరి వృద్ధుడున్న చోటికి వచ్చాడు. కుక్కిమంచంలో పడి ఉన్న ఆ ముసలి తొక్కునూ, ఆ పూరి గుడిసెనూ చూసి గౌతముడు చాలా అవమానం చెంది, "ఈ ముసలివాడా నా తండ్రి? నన్ను నలుగురిలో అవమానం చెయ్యటానికేనా,





రాను మొర్రో అంటుంటే వెంట లాక్కొచ్చావు?" అని వెనక్కు తిరిగాడు.

"ఒరే, నాయనా, గౌతమా! నేనేరా నీ తండ్రిని! రారా! ఒక్కమాట చెప్పి పోరా!" అని వృద్ధుడు కేకలు పెట్టాడు. కాని గౌతముడు వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు. కేకలుపెట్టిన ఆయాసంలో లేచిన ముసలివాడు కాస్తా మళ్ళీ వెనక్కు పడిపోయాడు. పావన్న ఆయనకు ఉపచారాలు చేస్తూ ఆ గుడిసెలోనే ఉండిపోయాడు. ఆ సమయంలో వృద్ధుడు పావన్నకు తన కథ అంతా చెప్పాడు:



"అప్పుడు నా కొడుకున్న గ్రామంలోనే నేను ఒకప్పుడు గౌరవంగా బతికిన వాణ్ణి. గౌతముడు నా ఒక్కగానొక్క కొడుకు. అందుచేత వాణ్ణి ఎంతో గారాబంగా పెంచి పెద్ద చేసి, పెళ్ళి చేశాను. భార్య కాపరానికి రాగానే వాళ్ళకు నేనంటే కంటక మయింది. ఇద్దరూ కలిసి నన్ను అనరాని మాటలని, బయటికి తరిమేశారు. నేను దూరదేశం వెళ్ళి ఒక జమీందారుగారి దగ్గిర కొలువుకు కుదిరి పని చేస్తూ, పొట్ట పోసుకుంటూ చాలా ఏళ్ళు గడిపాను. తరువాత జమీందారుగారు చనిపోతూ నాకు ఒక బిందెలో వెయ్యి బంగారు కాసులు పోసి ఇచ్చారు. దానితో నేను వూరు వచ్చి, ఈ ఇంటి పెరడులో ఆ బిందెను పాతిపెట్టి, భిక్షాటనతో పొట్ట పోసుకుంటూ వచ్చాను. జరిగిన దానికి నా కొడుకు పశ్చాత్తాపపడి నన్ను ఆదరిస్తాడనీ, అప్పుడు వాడి కా బంగారు కాసులు ఇచ్చేద్దా మనీ కలలు గన్నాను. వాడు నన్ను ఒక్కసారి నోరారా, నాన్నా, అని పిలిచి ఉంటే ఆ బంగారమంతా వాడి కిచ్చి ఉందును. కాని వాడి కది ప్రాప్తం లేదు. ఈ జన్మకు కూడా నీవే నా కొడుకువు. అందుచేత ఆ బిందె నీవే తీసుకో. నేను కళ్ళు మూయగానే ఆ బంగారంలో కొంత నాకు ఉత్తర క్రియలకు ఖర్చుపెట్టి, మిగిలినది నీవే ఉంచుకో!"





ఆయన చెప్పిన గుర్తులను బట్టి పాపన్న పెరట్లో తవ్వించి బిందె పైకి తీయించాడు. తరువాత రెండు రోజులకు వృద్ధుడు కన్ను మూశాడు. పాపన్న ఆయనకు శాస్త్రోక్తంగా ఉత్తర క్రియలు జరిపించాడు.

ఈలోపుగా ఈ బంగారం వార్త అన్ని గ్రామాలకూ కార్చిచ్చులా వ్యాపించింది. ఎవరో బిచ్చగాడు వెయ్యి బంగారు కాసులు దాచి ఉంచి, దారే పొయ్యేవాడి కిచ్చేశాడన్న వార్త గౌతముడి దాకా వెళ్ళింది. అతను భార్యతో సహా బయలుదేరి వచ్చేసరికి పాపన్న పదవరోజు సమారాధన చేస్తున్నాడు. చుట్టుపక్కల గ్రామాల నుంచి ఎందరో బ్రాహ్మణులు వచ్చి భోజనాలు చేశారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క బంగారు కాసు తాంబూలంలో పెట్టి ఇస్తున్నాడు పాపన్న.

పాపన్న గౌతముణ్ణీ, అతని భార్యనూ చూసి, "మీ రిప్పుడు వచ్చారా? ముందు భోజనం చెయ్యండి," అన్నాడు. భోజనం పెట్టించి వారికి తాంబూలాలు ఇచ్చాడు. గౌతముడు పాపన్నతో, "నేను ఇక్కడ నుండి వెళ్ళి పోయిన తరువాత ఆ ముసలి వాడు నా తండ్రే నని రూఢిగా తెలిసింది. ఆయన బంగారు కాసుల బిందె ఏదో దాచా డట. ఏది? కొడుకును గనక అది నాకు చెందవలిసి ఉంటుంది," అన్నాడు.

"మీ కిద్దరికీ తాంబూలాలలో బంగారు కాసు లున్నాయేమో చూసుకోండి. అదుగో ఆ బిందె!" అంటూ పాపన్న ఖాళీ బిందె తెచ్చి గౌతముడి ఎదట పెట్టాడు.

పాపన్న చేయించిన సమారాధన గురించి, భోజనాలు చేసిన వారందరికీ తాంబూలా లతో ఒక్కొక్క బంగారు కాసు దక్షిణ ఇవ్వటం గురించీ పదిమందీ ఘనంగా చెప్పుకుంటున్న మాటలు విని తన తండ్రి దాచి ఉంచిన బంగారు కాసు లన్నీ ఏమయాయో, బిందె ఎందుకు ఖాళీ అయిందో గౌతము డర్థం చేసుకున్నాడు.





# ఆపద్రక్షకుడు

ఒకనాడు పాపన్న, పొరుగూరులో తన బంధువుల ఇంట ఏదో అక్కర అయితే వెళ్ళి, పొద్దుపోయి తిరిగి వస్తూండగా దారిలో ఒక గ్రామంలో అగ్ని ప్రమాదం అతని కంట పడింది. ఆ ఊరి గ్రామాధికారి ఇల్లు అంటుకున్నది. పదిమంది అదావుడిగా కేక లేస్తూ, అటూ ఇటూ పరిగెత్తుతున్నారు. మనుషులు అంచెల మీద కడవలతో నీరు తెచ్చి పోస్తూ, నిప్పు ఆర్ప యత్నిస్తున్నారు.

మరికొందరు కాలుతున్న ఇంటి నుంచి దొరికినన్ని సామాన్లు లాగి బయటికి చేర వేస్తున్నారు.

ఇంటి వెనుక భాగంలో వంటావిడ నిలబడి, "అయ్యో, బిడ్డ! వంట ఇంట్లో చిక్కుకుపోయాడు! ఎవరైనా రండర్రా! వాణ్ణి బయటికి తీసుకు రండర్రా!" అని అరుస్తున్నది. కాని ఆమె కేకలు ఒక్కరూ వినిపించుకో లేదు.

ఆర్తనాదం విని పాపన్న అటుగా వెళ్ళేసరికి, కాలుతున్న ఇంటి వెనుక భాగంనుంచి కుర్రవాడి ఏడుపు వినిపించింది.

వెంటనే పాపన్న మంటల మధ్యగా లోపలికి జొరబడి, కుర్రవాణ్ణి ఎత్తుకుని, బయటికి వచ్చేశాడు.

అతను బయటికి అడుగుపెట్టిన మరు క్షణమే గ్రామాధికారి నౌకరొకడు పాపన్న చేతిలో నుంచి కుర్రాణ్ణి ఎగరేసుకుని తీసుకుపోయి, ఇంటి ముందు నిలబడి ఉన్న తన యజమానికి చూపించి, "బాబూ, అబ్బాయిగారు వంట ఇంట్లో మంటల మధ్య చిక్కుకుపోతే బయటికి తెచ్చాను. ఇంకా నయం! నేను పోయి రక్షించకపోతే బిడ్డ ఏమై ఉండునో!" అన్నాడు.

గ్రామాధికారికి తన నౌకరు పై కృతజ్ఞత పొంగిపొర్లి, "నాకు పుత్రభిక్ష పెట్టావురా! నీ ఋణం ఎన్ని జన్మాలకూ తీరదు,"







అన్నాడు, ఏడుస్తున్న తన కొడుకును గుండెకు అదుముకుంటూ.

ఈలోపల, పాపన్న చీకటిలో పడి అతి ప్రయాసతో తన ఇంటికి చేరుకున్నాడు. అతని బట్టలు కాలాయి, ఒళ్ళు చాలా చోట్ల కాలింది. తల్లి పాపన్నను చూసి దడుచుకుని, "ఏమిట్రా ఈ కాల్పులూ? ఏం జరిగింది?" అని అడిగింది.

పాపన్న జరిగినదంతా తన తల్లికి చెప్పాడు.

"లేనిపోని వాటి కన్నిటికీ సిద్ధమౌతావు దేనికిరా?" అని తల్లి తన కొడుకును గట్టిగా మందలించింది.

"'పరోపకారార్థ మిదం శరీరం,' అని గురువుగారు చెప్పారమ్మా," అని పాపన్న గొణుగుతూ, తన చొక్కా విప్పాడు. ఆ చొక్కా నుంచి ఏదో బరువుగా కింద పడింది. చూస్తే, బంగారు మొలతాడు, గ్రామాధికారి కొడుకుది. అది ఊడి పాపన్న చొక్కాకు తగులుకున్నట్టుంది. అగ్ని ప్రమాదం గొడవలో పాపన్న దాన్ని గమనించనే లేదు.

తన గాయాలకు మందు రాయవచ్చిన తల్లితో పాపన్న, "దీన్ని భద్రంగా ఉంచు. వాళ్ళకు తిరిగి ఇవ్వాలి," అన్నాడు.

కాని ఆ బంగారు మొలతాడు గ్రామాధికారికి వెంటనే తిరిగి ఇవ్వటం పడలేదు. మర్నాటికి పాపన్నకు గాయాల మూలంగా జ్వరం తగిలింది. రెండు మూడు లంఖణాలు చేసిన మీదటగాని పాపన్న కోలుకుని మామూలు మనిషి కాలేదు. చేతుల మీదా, ముఖానా కాలిన మచ్చలింకా పచ్చిగానే కనిపిస్తూ ఉన్నాయి.

అయినప్పటికీ పథ్యం తీసుకున్న మర్నాడే పాపన్న బంగారు మొలతాడుతో సహా గ్రామాధికారి ఇంటికి బయలుదేరి వెళ్ళాడు. కాలిపోయిన ఇల్లు తిరిగి కట్టుతున్నారు. పాపన్న దగ్గిర నుంచి బిడ్డను





ఎత్తుకుపోయి, తానే వాణ్ణి కాపాడినట్టు నటించిన నౌకరు అక్కడే ఉండి, పనివాళ్ళపైన అజమాయిషీ చేస్తున్నాడు.

పాపన్న ఆ మనిషిని సమీపించి, "ఈ ఇంటివాళ్ళు ఎక్కడ ఉంటున్నారు?" అని అడిగాడు.

"అదుగో, ఆ కనబడే పెంకుటింట్లో ఉంటున్నారు. రేపో, ఎల్లుండో ఇల్లు పూర్తి కాగానే వస్తారు. ఎందుకూ?" అన్నాడు పాపన్నతో నౌకరు.

"మరేం లేదు. ఆనాడు ఈ ఇల్లు కాలిపోయేటప్పుడు నే నిటుగా వచ్చాను. ఇంట్లోనుంచి ఒక బిడ్డను బయటికి తెచ్చాను. ఆ బిడ్డను ఇంటివాళ్ళు ఆత్రంగా తీసుకుని వెళ్ళిపోయారు. ఆ సమయంలో వాడి బంగారు మొలతాడు నా చొక్కాలో చిక్కుకుంది. ఆ మొలతాడు సంగతి వాళ్ళూ గమనించ లేదు, ఇంటికి పోయి చొక్కా విప్పినదాకా నేనూ గమనించలేదు. గాయాల వల్ల సుస్తీ చేసి నేను వెంటనే రాలేకపోయాను. దీన్ని ఇంటివారి కిచ్చేద్దామని వచ్చాను," అన్నాడు పాపన్న.

ఈ మాటలు వినగానే నౌకరు గుండెలో రాయి పడింది. పాపన్న ఈ గొలుసు తీసుకుపోయి గ్రామాధికారి కిస్తే, అతని చేతులకూ,



ముఖానికీ ఉండే మచ్చలు చూసి, తన బిడ్డను రక్షించింది నౌకరుకాదనీ, ఈ మనిషేననీ ఆయన తెలుసుకుంటాడు. ఆయన లోగడ నౌకరుకు మంచి బహుమతి ఇచ్చి ఉన్నాడు, ఇప్పుడు అంత కన్న మంచి శిక్ష పడుతుంది!

అందుచేత నౌకరు, "దాన్ని నా కివ్వండి. నేను వారి మనిషినే," అన్నాడు.

"ఎందుకులే, ఇంత దూరం వచ్చి నేనే ఇస్తాను. బంగారు వస్తువు కూడానూ!" అన్నాడు పాపన్న.

నౌకరు పాపన్నను అవతలికి తీసుకుపోయి, "బాబూ, నన్ను తమరు కాపాడాలి.





నేనే బిడ్డను రక్షించినట్టు చెప్పి, మా యజమాని దగ్గిర బహుమానం కూడా పుచ్చుకున్నాను. ఆ మొలతాడు కావలిస్తే మీరే ఉంచుకోండి, లేదా నా కివ్వండి. నేను వారికి ఏదో విధంగా అందజేస్తాను. అంతే గాని మీరుగా దీన్ని ఇవ్వవద్దు! మీ కాళ్ళు పట్టుకుంటాను," అన్నాడు.

వాడి స్థితి చూసి జాలిపడి పాపన్న బంగారు మొలతాడు వాడి కిచ్చి ఇంటికి తిరిగి వచ్చాడు.

నౌకరు దాన్ని తన యజమానికి ఎలా తిరిగి ఇవ్వాలో తెలియక కంసాలి వద్దకు తీసుకుపోయి కరిగించమన్నాడు.

దురదృష్టవశాత్తూ ఆ మొలతాడు చేసినది ఆ కంసాలే. అందుచేత అతను మొలతాడు చూస్తానే, ఫలానా వారిదని గుర్తించి, గ్రామాధికారికి కబురు చేసి, "బాబూ,దీన్ని కరిగించమని మీ నౌకరు చేత పంపారా?" అని అడిగాడు.

ఆ మొలతాడు పోయిందని అప్పుడే అందరూ కనుక్కున్నారు. కాని బిడ్డ ప్రాణం దక్కిందన్న తృప్తిలో, వెధవ మొలతాడు పోతే పోయిందిలే అనుకున్నారు.

తనకు పుత్రభిక్ష పెట్టాడనుకున్న తన నౌకరే మొలతాడు కాజేసి ఇంత కాలమూ తన దగ్గిర దాచుకున్నాడని తెలిసి గ్రామాధికారి మండిపడ్డాడు.

నౌకరును నిలవదీసి అడిగితే నిజం బయటపడింది. బిడ్డను మంటల నుంచి రక్షించిన వాడు నౌకరు కాడు, పక్క ఊరిలో ఉండే పాపన్న!

గ్రామాధికారి తన నౌకరును పనిలో నుంచి తొలగించి, పాపన్న ఇంటికి వచ్చి, తన బిడ్డల్ని కాపాడినందుకు కృతజ్ఞత తెలుపుకుని, పాపన్న వద్దంటున్నా వినకుండా పాపన్నకూ, అతని తల్లికీ మంచి మంచి బట్టలూ ఇతర కానుకలూ ఇచ్చి వెళ్ళిపోయాడు.





# బియ్యం దొంగ

పాపన్న భార్య మీనాక్షి పుట్టింట మగపిల్ల వాణ్ణి ప్రసవించింది. పాపన్న బండి తోలు కుని అత్తవారింటికి వెళ్ళి, పిల్లవాడికి జాత కర్మ, నామకరణమూ చేసి, మంచి రోజు చూసి భార్యా బిడ్డలతో తన బండిలోనే స్వగ్రామానికి బయలుదేరాడు.

వాళ్ళు చీకటిపడే సరికి ఒక బస్తీ చేరు కున్నారు. అక్కడే ఒకటి రెండు రోజు లుండి, కావలిసిన వస్తు సామగ్రి కొను క్కుందామన్నది మీనాక్షి. వారొక సత్రంలో దిగి, అందులో ఖాళీగా ఉన్న గది ఒకటి తీసుకున్నారు.

చీకటిలో పాపన్న సత్రం ముందున్న బావి వద్దకు వెళ్ళి చేతులూ, కాళ్ళూ కడు క్కుంటూండగా ఎవరో పరిగెత్తుకుంటూ వచ్చి, బావికి కొద్ది దూరంలో పడిపోయాడు. అతని భుజాన ఉన్న మూట కింద పడింది. పాపన్న ఆ మనిషిని లేవదీసి, పడిపోయిన మూట చేతపట్టుకుని, సత్రం గదిలోకి తీసుకుపోయాడు. ఆ మనిషి మోకాళ్ళూ, మోచేతులూ దోక్కుపోయి గాయాలయాయి.

"ఎవరు నీవు? ఈ గాయా లేమిటి? ఎందు కలా పరిగెత్తు కుంటూ వచ్చావు? నీకు వచ్చిన భయమేమిటి?" అని పాపన్న ఆ మనిషి నడిగాడు.

అందుకా మనిషి, "అయ్యా, నేని బియ్యం కొనుక్కుని వస్తూండగా రక్షక భటులు, 'దొంగ, దొంగ!' అని కేకలేస్తూ నా వెంట పడ్డారు. వారేం చేసి పోతారోనని సత్తువ కొద్దీ పరిగెత్తాను. రెండుచోట్ల పడి పోవటం వల్ల మోకాళ్ళూ, మోచేతులూ గాయపడ్డాయి. మా ఇల్లు ఎంతో దూరం లేదు. కాని, ఇంటికి పోతే ఆ రక్షకభటులు నా భార్యనూ, పిల్లలనూ పీడిస్తారేమోనని ఇటుగా పరిగెత్తుకొచ్చాను. ఇక నడిచే శక్తి కూడా లేదు. ఉదయం నుంచీ మా వాళ్ళకు







వచ్చి మంచినీళ్ళు తప్ప మరో ఆహారం లేదు. వాళ్ళు ఈ బియ్యం కోసం ఎదురు చూస్తూంటారు. ఏం చెయ్యను ?" అని దీనంగా అన్నాడు.

పాపన్న అతనితో, "విచారించకు. కాస్సేపు ఇక్కడే విశ్రాంతి తీసుకో. నీ ఇల్లు గుర్తు చెప్పావంటే, ఈ మూటను నేనే తీసుకుపోయి మీ ఇంట ఇచ్చి వస్తాను," అని చెప్పాడు.

ఆ మనిషి దణ్ణంపెట్టి, "ఆ పని చేసి పెట్టండి, బాబూ. మీకు పుణ్యం ఉంటుంది," అన్నాడు. అతను తన ఇంటికి దారీ, గుర్తులూ చెప్పాడు.

పాపన్న మీనాక్షిని అవతలికి పిలిచి, "ఆ మనిషి గాయాలకు కాస్త మాని రాచి, పసుపు అద్దు. అతని కోసం ఎవరన్నావస్తే అతని సంగతి మాత్రం చెప్పకు. అతనెవ రంటే, 'మా మనిషే,' అని చెప్పు," అని రహస్యంగా చెప్పాడు. తరువాత అతను మూట తీసుకుని ఆ మనిషి చెప్పిన ఇంటికి బయలుదేరాడు.

అతను బయలుదేరిన కొద్దిసేపటికే రక్షక భటులు అటుగావచ్చి, వసారాలో నిలబడి ఉన్న మీనాక్షిని, "ఇటుగా ఎవరైనా ఎర్రని మూట పట్టుకుని పరిగెత్తుకుంటూ వచ్చారా?" అని అడిగారు.

"ఎవరూ రాలేదు," అన్నది మీనాక్షి.

భటులు గదిలోకి తొంగి చూశారు. ఎర్ర మూట ఎక్కడా కనిపించలేదు గాని, పైబట్ట ముసుగుతన్ని గదిలో ఒక పక్కగా పడుకుని ఉన్న మనిషి కనిపించాడు.

"ఆ మనిషి ఎవరు?" అని రక్షక భటులు మీనాక్షి నడిగారు.

"మా మనిషే. ఒంట్లో బాగాలేదు," అన్నది మీనాక్షి.

వాళ్ళు వెళ్ళిపోయారు. కాని అదే సమయంలో మరి ఇద్దరు రక్షక భటులకు పాపన్న దొరికాడు. వాళ్ళు మూటను





గుర్తించి, పాపన్నే దొంగ అనుకుని, అతన్ని మూటతోసహా, మూటను పోగొట్టుకున్న వాడి దగ్గిరికి తీసుకుపోయారు. ఆ మనిషి తన మూటను గుర్తించాడు గాని పాపన్నను గుర్తించ లేదు. తన బియ్యం మూటను మసక చీకట్లో ఎవరు కాజేసినదీ ఆ మనిషి చూడనైనా లేదు.

"ఎందుకు చేశావీ దొంగతనం?" అని పాపన్నను రక్షకభటు లడిగారు.

"నేనే దొంగతనమూ చెయ్యలేదు," అన్నాడు పాపన్న.

"చేసినదిగాక అబద్ధాలు కూడా ఆడ తావా?" అంటూ రక్షక భటులు పాపన్నను తన్ని సావడికి తీసుకుపోయారు. దారిలో జనం పోగైనారు. వారిలో ఒకడు, "ఈ మనిషి చీకటి పడేవేళ సత్రంలో దిగిన మనిషి కాదూ?" అన్నాడు.

రక్షకభటులు పాపన్నను, "సత్రంలో బస చేశావా?" అని అడిగారు.

లేదని పాపన్న తల అడ్డంగా ఆడించాడు. తనను దొంగ అని పట్టుకున్నారన్న విచారం అతన్ని బాధించలేదు గాని, పొద్దుటి నుంచీ మాడుతున్న వాళ్ళకు బియ్యం మూట అందించలేక పోయానే అన్న బాధ అతన్ని పట్టుకున్నది.



రక్షక భటులు సావడికి తీసుకు పోయే దారిలో సత్రం దగ్గిరికి వచ్చి, వసారాలో నిలబడిన మీనాక్షిని చూసి, పాపన్నను చూపి, "ఈ మనిషి తెలుసునా?" అని అడిగారు.

"దొంగ అని పట్టుకున్నవాళ్ళు మీరు చేసేదేదో చేసుకుపోక, కనిపించిన వారినెల్లా ఆరా లడుగుతా రెందుకు?" అన్నాడు పాపన్న చిరాకుగా.

పాపన్న రక్షక భటుల వశంలో ఉండటం చూసి గతుక్కుమన్న మీనాక్షి భర్త హృదయం కనిపెట్టి, నిబ్బరంగా, "అయ నెవరో నాకు తెలియదు," అన్నది.





రక్షకభటులు పాపన్నతో ముందుకు సాగారు. ఇదంతా గమనిస్తున్న అసలు దొంగ లోపలి నుంచి బయటికి వచ్చాడు. మీనాక్షి అతనితో, "మధ్య నువ్వెక్కడికి? అసలే ఒంట్లో బాగాలేని మనిషివి?" అన్నది.

"తల్లీ, నీవూ నీ భర్తా మనుషులు కారు, దేవతలు. నేనే దొంగను. పెళ్ళాం పిల్లలు ఆకలికి మాడుతుంటే చూడలేక దొంగ తనానికి పాల్పడ్డాను. కాని నా బదులు నీ భర్తవంటి వాణ్ణి శిక్ష పడనిస్తానా? అంత నీచుణ్ణి కాను," అంటూ ఆ మనిషి కూడా పావడి దగ్గిరికి బయలుదేరాడు.

కొత్వాలు పాపన్నను చూసి, "ఎవరు నీవు? నీ పేరేమిటి? ఊరేమిటి? ఎందుకు దొంగతనం చేశావు?" అని అడిగాడు.

"అయ్యా, నేను దొంగను కానని చెబితే మీ భటులు నమ్మలేదు. వారికి దొంగిలించిన నగను దొరికింది, నేను దొరికాను. ఎవరినో ఒకరిని శిక్షించటం మీ కర్తవ్యమైతే నన్ను శిక్షించండి. మిగిలిన వివరాలన్నీ దేనికి?" అన్నాడు పాపన్న.

అంతలో అసలు దొంగ వచ్చి, "అయ్యా, ఆయనను విడవండి! దొంగతనం చేసిన వాణ్ణి నేను," అన్నాడు.

"వీడెవడు?" అని కొత్వాలు రక్షక భటుల్ని అడిగాడు. తమకు తెలియదని వాళ్ళన్నారు.

"నువ్వు దొంగవయితే ఈ మనిషి ఎవరు?" అని కొత్వాలు అడిగాడు.

"ఏమో, బాబూ. నే నీ ఊళ్ళోనే పుట్టి పెరిగాను గాని ఈ మనిషి నెన్నడూ చూడ లేదు. ఈ ఊరివాడు కాడు," అన్నాడు దొంగ.

కొత్వాలు చిరాకుపడి, "మీరిద్దరూ నా ముందు నుంచి పొండి," అని కసిరి, రక్షక భటులతో, "దొంగ వచ్చి తనంతట తాను నేనే దొంగను అని చెప్పుకోవలసివస్తే ఇంక మీరెందుకూ?" అన్నాడు. రక్షకభటులు ఏమీ బదులు చెప్పలేకపోయారు.





# పాము కాటు

పాపన్న కొడుక్కు ఏడోమాసం నిండింది. ఒకనాడు మీనాక్షి బిడ్డకు నీళ్ళుపోసి అరుగు పైన పడుకోబెట్టి, బట్టలు ఆరవేస్తూండగా, పిల్లవాణ్ణి పాము కరిచింది. వాడు కెవ్వున అరిచి మైకంలో పడ్డాడు.

ఆ ప్రాంతాల పాములూ, మండ్ర గబ్బలూ, తేళ్ళూ మొదలైన విష జంతువులు జాస్తి. అందుచేత అవి తరుచు మనుషులను కాటు వేసేవి. అలా కాటు తిన్న మనుషులకు మంత్రం వేసే ఆయన ఒకడు ఒక గ్రామంలో ఆశ్రమం ఏర్పాటు చేసుకుని ఉంటూ ఉండేవాడు. ఆ ఆశ్రమం పేరు నాగాశ్రమం.

పాపన్నా, మీనాక్షీ బిడ్డను తీసుకుని బండి ఎక్కి మంత్రం వేయించటానికి ఆ నాగాశ్రమానికి బయలుదేరారు.

దోవలో ఒక ఆడది బిడ్డను ఎత్తుకుని ఏడుస్తూ నడుస్తున్నది. ఆ ఆడది పాపన్న బండి చూసి ఆగి, "అయ్యా, నా బిడ్డకు పాము కరిచింది. నాగాశ్రమానికి పోవాలి. బండిలో ఎక్కనిస్తావా? త్వరగా పోతే బిడ్డ బతకవచ్చు," అన్నది.

"ఎక్కమ్మా! మేం కూడా అక్కడికే పోతున్నాం," అని పాపన్న ఆమెను కూడా బండిలో ఎక్కించుకున్నాడు. ఆమె స్పృహ లేని తన బిడ్డతో సహా మీనాక్షి పక్కనే కూర్చున్నది.

నాగాశ్రమంలో దయ్యాలు పట్టినవాళ్ళూ, మూర్ఛలవాళ్ళూ, తేళ్ళు కుట్టినవాళ్ళూ, పాములు కరిచినవాళ్ళూ, వాళ్ళను తీసుకు వచ్చినవాళ్ళూ గుంపుగా ఉన్నారు. ఆశ్రమంలో ఉన్న నౌకరు ఒకరి తరవాత ఒకరిని లోపలికి పోనిస్తాడు.

ఆ నౌకరు పాపన్నను బాగా ఎరుగును. అందుచేత అతన్ని చూడగానే పలకరించి కుశల ప్రశ్నలు వేశాడు. వాళ్ళిద్దరూ ఏం





మాట్లాడుతారో విందామని మీనాక్షి, గుడ్డల్లో చుట్టి ఉంచిన తన కొడుకును బండిలోనే ఉంచి ఇవతలికి వచ్చింది.

పాపన్న బండిలో వచ్చిన ఆడమనిషి ఇదంతా చూసి, పాపన్నకు త్వరగా ప్రవేశం కలుగుతుందని గ్రహించుకుని, బిడ్డలను మార్చేసి, తన బిడ్డను మీనాక్షి బిడ్డ బట్టలలో చుట్టి బండిలో పెట్టేసి, మీనాక్షి కొడుకును తన బట్టలలో చుట్టేసి పట్టుకున్నది.

ఆమె అనుకున్నట్టే అయింది. లోపల ఉన్నవారెవరో బయటికి రాగానే నౌకరు పాపన్నను లోపలికి పోనిచ్చాడు. మీనాక్షి బండి దగ్గిరికి పరిగెత్తుకు వచ్చి ఆడమనిషి బిడ్డ ఉన్న బట్టలచుట్టను తీసుకుని ఆ బిడ్డ తన బిడ్డే అనుకుని పాపన్న వెంట ఆశ్రమం లోపలికి వెళ్ళింది.

మంత్రం వేసే ఆయన వాళ్ళు వచ్చిన పని అడిగాడు. పాపన్న తన కొడుక్కు ఉదయం పాము కరిచిందని చెప్పాడు. మంత్రం వేసే ఆయన పాపన్న పేరూ, బిడ్డ పేరూ, వారి జన్మ నక్షత్రాలూ తెలుసుకుని, మంత్రం వేసి, "ఇక మీరు ఇంటికి వెళ్ళ వచ్చు," అన్నాడు.

వాళ్ళు బయటికి రాగానే, వారి వెంట బండిలో ఎక్కి వచ్చిన ఆడమనిషి ఆత్రంగా ఎదురు వచ్చి, "అమ్మా, పొరపాటు జరి



గింది. మీరు లోపలికి నా బిడ్డను ఎత్తుకు వెళ్ళారు. ఏదీ? మంత్రం వేశారా? నా బిడ్డ బతికిందా?" అని అడుగుతూ, తన బిడ్డ కోసం చేతులు చాచి, మీనాక్షి చేతిలోని బిడ్డను తీసుకున్నది.

ఈ మాటలు విని మీనాక్షి కంగారు పడింది. కాని పాపన్న మటుకు, తొందరలో బిడ్డలు మారిపోయారేమో ననుకుని, "మంత్రం వేశారమ్మా. నీ బిడ్డ కేమీ భయం లేదు," అన్నాడు.

"నీ బిడ్డ మా బట్టల్లోకి ఎలా వచ్చింది?" అని మీనాక్షి అడిగింది. ఆమె ఆ ఆడమనిషి చేతిలో నుంచి తన బిడ్డను తీసుకున్నది.

మీనాక్షి ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఆ ఆడమనిషి, "పాపం, మీ బిడ్డకూడా తొందరగా మంత్రం వేయించుకోండమ్మా!" అన్నది, వారి హితం కోరిన దానిలాగా.

"మా బట్టలు మా కిచ్చెయ్యి," అంటూ మీనాక్షి తన బిడ్డకు కప్పి ఉన్న బట్టలు తీసింది. మీనాక్షి బిడ్డ కళ్ళు తెరిచి, కాళ్ళూ చేతులూ ఆడించాడు.

ఆ ఆడమనిషి కూడా తన బిడ్డకు చుట్టి ఉన్న బట్టలు తీసింది. తన బిడ్డ ఇంకా పాముకాటు మగతలోనే ఉండటం చూసి ఆమె గుండె గుభేలుమన్నది.



ఆమె కంగారుతో అమాంతంగా పాపన్న కాళ్ళు పట్టుకుని, "బాబూ, నేను చేసిన పాపానికి మంచి ప్రాయశ్చిత్తం జరిగింది. నా బిడ్డకు త్వరగా మంత్రం పడాలన్న దురుద్దేశంతో బిడ్డలను మార్చాను. మంత్రం వేసినా నా బిడ్డ కోలుకోలేదు. మంత్రం వెయ్యకపోయినా మీ బిడ్డ కోలుకున్నాడు. పాపిష్టిదాన్ని నా బిడ్డ ప్రాణాలు నిలువునా తీశాను!" అని శోకాలుపెట్టి కన్నీరు వరదలయేటట్టు ఏడవసాగింది.

పాపన్న ఆమె నోదార్చుతూ, "ఇలా జరగటాని కేదో కారణం ఉంటుంది. నువు భయపడకు. నీ బిడ్డకు మళ్ళీ మంత్రం వేయింతాం!" అన్నాడు.

అతను తనకు పరిచితుడైన నౌకరుతో చెప్పి ఆ ఆడమనిషి త్వరగా లోపలికి వెళ్ళే ఏర్పాటు చేశాడు.

ఆ నౌకరే పాపన్నతో అసలు రహస్యం చెప్పాడు. మంత్రం ఏ మనిషికని వేస్తే ఆ మనిషికే పని చేస్తుంది. మంత్రం వేసే ఆయన కా మనిషి ఎదురుగా ఉండాలన్న నియమమేమీ లేదు.

ఆ సంగతి ఆ ఆడమనిషికి తెలియదు. అందుకే అనవసరంగా కక్కుర్తి పడి నీచపు పనికి ఒడిగట్టింది.

కొద్ది సేపట్లో ఆ ఆడమనిషి తన బిడ్డకు కూడా మంత్రం వేయించుకుని బయటికి వచ్చింది. ఆమె బిడ్డ కూడా కళ్ళు తెరిచి ఆడుకుంటున్నది. ఆమె ఈ సారి పాపన్నకు తన పశ్చాత్తాపంతోబాటు కృతజ్ఞత కూడా చెప్పుకున్నది. ఎందుకంటే పాపన్న సహాయ పడకపోతే ఆమె త్వరగా లోపలికి వెళ్ళగలిగి ఉండేది కాదు.

పాపన్న తిరుగు ప్రయాణంలో కూడా ఆమెను తన బండిలోనే ఎక్కించుకుని, ఆమెను ఆమె ఉండే గ్రామంలో ఆమె ఇంటి దగ్గర దింపి, మీనాక్షితోనూ, పిల్లవాడితోనూ ఇంటికి వచ్చేశాడు.





# రాళ్ళ వ్యాపారం

ఒకసారి పాపన్న రెండు మూడామడ దూరాన గల తమ దూరపు బంధువు లింటికి వెళ్ళాడు. అది భోజనాలవేళ. ఇంటాయన భోజనం ముందు కూచుని, "అయ్యో, చచ్చా!" అనటమూ, బియ్యంలో రాళ్ళేర కుండా పూట పూటా వండుతున్నదని తన భార్యను తిట్టటమూ, వాకిటి మెట్లెక్కుతున్న పాపన్న చెవులపడింది.

పాపన్నను చూడగానే బంధువులు అతనికి కూడా వడ్డన చేశారు. పాపన్న అన్నం తింటూ, ముద్ద ముద్దకూ పంటి కిందికి రాయి రావటం చూసి, "బియ్యంలో ఇన్ని రాళ్ళెలా వస్తాయమ్మా?" అని ఇంటావిడను అడిగాడు.

"ఏం చెప్పను, నాయనా? ఈ మెట్ట ఊళ్ళలో వరి పండదుగదా. కొట్టు బియ్యమే గతి. వాటినిండా రాళ్ళు. ఏరటానికి కనిపించి చావవు, బియ్యం రంగులోనే ఉంటాయి. ఒక్క బియ్యమేమిటి? అన్ని ధాన్యాల లోనూ, జీలకర్రలోనూ కూడా రాళ్ళే. ఏ రంగు సరుకులో ఆ రంగు రాళ్ళు!" అన్నది ఇంటావిడ.

ఇంటాయన మటుకు, "కొట్టు మంచి తెచ్చుకున్న సరుకు బాగు చేసుకోవటం చాతకాకపోతే ఏమవుతుంది?" అన్నాడు.

ఈ రాళ్ళ అంతు తేల్చుకోవలసిందే ననుకున్నాడు పాపన్న. అతను తన బంధువులకు సరుకులిచ్చే కొట్టువాడి దగ్గిరికి పోయి, "మీ కొట్లో కొనే ప్రతి సరుకులోనూ రాళ్ళుంటాయిట. ఏమిటి కథ?" అని అడిగాడు.

"ఆ సంగతి నాకేం తెలుస్తుంది, బాబూ? నాది చిన్న కొట్టు. ఎలా వచ్చిన సరుకలాగే అమ్మేస్తున్నాను. ఊళ్ళో అన్ని కొట్లకూ సరుకులిచ్చే దానయ్యగారి నడిగితే సంగతి తెలియవచ్చు," అన్నాడు కొట్టువాడు.







పాపన్న దానయ్య వద్దకు వెళ్ళి, "మీరు చిల్లర కొట్టువాళ్ళ కిచ్చే బియ్యం నిండా రాళ్ళు వస్తాయే, దానికి కారణ మేమిటం టారు?" అని అడిగాడు.

"నేనేమన్నా పంట చేస్తున్నానా, నాయనా? నేను వరి పండించే రైతుల దగ్గిర కొంటాను. నువ్వు చెప్పే రాళ్ళ సంగతి వాళ్ళకు తెలియ వచ్చు," అన్నాడు దానయ్య.

పాపన్న వరి పండించే గ్రామానికి వెళ్ళి రైతులను రాళ్ళ మాట అడిగాడు.

"మేమేమన్నా కొండల మీద వరి సాగు చేస్తున్నామా, బాబుగారూ? మేం తయారు చేసే బియ్యంలో ఎక్కడన్నా మట్టి బెడ్డ వస్తుందేమో గాని రాళ్ళెలా వస్తాయండీ?" అన్నారు రైతులు. వాళ్ళు తమ బియ్యం తెచ్చి పాపన్నకు చూపించారుకూడా.

ఒక ముసలి రైతు పాపన్నను రహస్యంగా అవతలికి తీసుకుపోయి, "దానయ్యగారిని గుట్టుగా పరీక్షిస్తేగాని మీ కీ రాళ్ళ వైనం అంతు చిక్కదు. ఆ దానయ్యగారు రంగు రంగుల రాళ్ళు ఒక గదిలో భద్రం చేసి ఉంచాడు. ప్రతి సరుకులోనూ నూరింట ఒకటి రెండు పాళ్ళు రాళ్ళు కలుపుతూ మంచి లాభాలు రాబట్టుతున్నాడు. ఉత్తుత్త బెదిరింపులకు బంకే రకం కాదు. రాళ్ళు కలుపుతూండగా పట్టుకోవాలి," అన్నాడు.

ఆ ముసలి రైతు దానయ్య చేసే మోసం గురించి చాలా వివరాలు చెప్పాడు. దానయ్య తాను ఉండే ఇంటనే ఒక భాగంలో వ్యాపారం జరుపుతాడు. ఇంట్లో అందరూ పడుకున్నాక ఆయన ఒక ప్రత్యేకమైన గదిలో కూర్చుని, అర్ధరాత్రిదాకా రాళ్ళు కలిపేపని సాగిస్తాడు.

పాపన్న ఆ రాత్రి దానయ్య ఇంటివేపు వెళ్ళి ముసలి రైతు చెప్పిన గది కిటికీ పైకి ఎక్కి, తలుపు సందులకుండా లోపల జరిగే దంతా గమనించాడు. దానయ్య రాళ్ళు కొలిచి, బస్తా కింత చొప్పున లెక్కగా బియ్యంలో కలుపుతున్నాడు.



"ఏమండో, దానయ్యగారూ! కలపకండి, కలపకండి, జనం చచ్చిపోతారు. కాస్త తలుపు తెరవండి. ఇదేం పని?" అని పాపన్న పెద్దగా కేక పెట్టాడు.

దానయ్య ఉలిక్కిపడి, "ఓరి, పిడుగా! దొంగతనానికి వచ్చావా?" అన్నాడు.

"దొంగతనానికి వస్తే మిమ్మల్ని పిలుస్తానుటండీ? తలుపు తెరవండి. మీతో ఒక ముఖ్యమైన సంగతి మాట్లాడాలిసి వుంది," అన్నాడు పాపన్న.

దానయ్య ఒక క్షణంపాటు తటపటాయించాడు. తలుపు తెరవకపోతే బయట ఉన్నవాడు కేకలుపెట్టి ఊరంతా లేపేస్తాడని భయపడి, ఆయన తలుపు తెరిచి పాపన్నను చూసి, "ఓహో, మీరా! ఎవరో అనుకున్నాను. లోపలికి రండి," అన్నాడు.

తరవాత దానయ్య పాపన్నతో, "ఈ వ్యవహారంలో మీరేమీ జోక్యం కలిగించుకోకండి. ఇదొక వ్యాపార రహస్యం. మీకి విషయాలు తెలీవు. ఇందులో అబద్ధాలూ, మోసాలూ, కల్తీలూ ఎన్నో ఉంటాయి. ఇవన్నీ చేస్తేగాని లాభసాటిగా వ్యాపారం సాగదు. ఎన్నో దానాలూ, ధర్మాలూ చేస్తానుగదా. లాభాలు రాకపోతే ఎలా చెయ్యగలను? మీరే చెప్పండి," అన్నాడు.

"అయితే ఒకటి చెయ్యండి, దానయ్యగారూ. ఇలా రాళ్ళు కలపటంచేత మీ కెంత లాభం వస్తుందో అంతా నేనిస్తాను. ఈ పని మానండి," అన్నాడు పాపన్న.

దానయ్య నిర్ఘాంతపోయి, "అందువల్ల మీ కేం లాభం?" అన్నాడు.

"నా లాభం దేవుడిస్తాడులే. మీకు కావలిసిన లాభం లెక్కకట్టి చెప్పండి. ఆ మొత్తం రేపు పట్టుకొచ్చి మీ కిస్తాను," అన్నాడు పాపన్న.

దానయ్య ఇదంతా వేళాకోళ మనుకున్నాడు. ఆయన పాపన్నతో, "అయిదు వందల బస్తాల బియ్యం ఉన్నది. యాభై





బస్తాల కొక బస్తా రాళ్ళు కలిపితే నాకు పది బస్తాల బియ్యం ధర లాభం. అది ఇంత అవుతుంది," అని చెప్పాడు.

మర్నాడు పాపన్న తన దగ్గిర ఉన్న డబ్బు లెక్క చూసుకుని, కొంచెం కొరత అయితే ఎరిగిన వారి వద్ద చేబదులు తీసుకుని, ఆ సొమ్మంతా తీసుకుపోయి దానయ్య కిచ్చి, "ఇంద, మీ లాభం! జనానికి కాస్త మంచి సరుకు అందేటట్టు చూస్తూ ఉండండి," అని చెప్పి వెళ్ళిపోయాడు.

"వీడెవడో బంగారు పిచ్చుకలాగున్నాడు. వెర్రివాడు, వీడి డబ్బు ఎవరో ఒకరు కాజేసి తీరుతారు," అనుకున్నాడు దానయ్య.

కొన్నాళ్ళు గడిచాక పాపన్న మళ్ళీ ఆ గ్రామం వచ్చి, బంధువులింట దిగి, "ఇప్పుడు బియ్యం వగైరా మంచివి దొరుకుతున్నాయి కద?" అన్నాడు.

"ఏం మంచి, నాయనా? ఎందు కడుగుతావు? మా కష్టాలకు దరిదాపూ లేనట్టున్నది," అన్నారు అతని బంధువులు.

పాపన్న తిన్నగా దానయ్య ఇంటికి వెళ్ళాడు. కొత్తగా కోడలిని కాపరానికి తీసుకు వచ్చిన దానయ్య ఊళ్ళోని పెద్దలకు విందు చేస్తున్నాడు. ఆయన పాపన్నను చూసి, దగ్గిరకు వచ్చి పలకరించి, "భోజనానికి లేవండి," అన్నాడు.



"భోజనానికేం గాని, మిమ్మల్ని ఒక్క విషయం అడగాలి," అంటూ పాపన్న దానయ్యను ఇవతలికి పిలిచి, "ఊళ్ళో వాళ్ళు ఇంకా బియ్యంలో రాళ్ళు వస్తున్నా యంటున్నారే? ఏం కారణమంటారు?" అని అడిగాడు.

"మీ రెంత అమాయకులండీ? మీ దగ్గిర మాట ఇచ్చాక నేను మళ్ళీ అలాటి పని చేస్తానా? కాని, నేను మానినంత మాత్రాన ఆ పాడు పని చిల్లర కొట్లవాళ్ళు మానవద్దు టండీ? వాళ్ళకూడా లాభాశ ఉంటుంది, గద? వాళ్ళందరి చేతా కల్తీపని మానిపిం చటం మన తరంకాదు గదా. బ్రహ్మతరం కూడా కాదు. అందుచేత ఈ గొడవ వది లెయ్యండి," అన్నాడు దానయ్య.

"అలా అయితే మీరు చిల్లర కొట్ల వాళ్ళకి అమ్మటం మానేసి, మీ సరుకంతా నాకే అమ్మండి. నేను అందరికీ పంచే స్తాను," అన్నాడు పాపన్న.

పాపన్న ఎంత మొండి ఘటమో తెలుసు కుని ఆశ్చర్యపడిన దానయ్య, "ఆ సంగతి తరవాత చూస్తాం. ముందు భోజనానికి లేవండి," అన్నాడు.

అప్పటికి మొదటి పంక్తి భోజనాలయి పోయాయి. మరి కొందరితోబాటు పాపన్న రెండో పంక్తికి కూర్చున్నాడు. అతను ముద్ద



కలిపి నోట్లో పెట్టుకుని, "బాబోయ్, చచ్చాను!" అంటూ అంకిళ్ళు నొక్కుకుని గోడకి చేరగిల బడ్డాడు.

ఆ దుస్థితిలో ఉన్న మిగిలిన వాళ్ళు ధైర్యం తెచ్చుకుని, "ఈ అన్నం తినలేం!" అంటూ విస్తళ్ళ ముందు నుంచి లేచారు. దానయ్యకు కళ్ళ నీళ్ళ పర్యంతమయింది.

జరిగిన దేమంటే మొదటి వార్పు మంచి బియ్యమే వండారు. కాని అన్నం చాల లేదు. వంటవాడు సామాన్ల కొట్టులోకి వెళ్ళి రాళ్ళు కలిపిన బస్తా నుంచి బియ్యం తెచ్చి వండేశాడు.

బియ్యంలో రాళ్ళెందుకు వచ్చాయని ఆరాతీసిన బంధువులు వంటవాడు చెప్పిన కొట్టులోకి వెళ్ళి అక్కడ బియ్యం బస్తాల పై భాగాలలో రాళ్ళు పోసి ఉండటమూ, ఆ గదిలోనే ఒక పక్కగా రంగు రంగుల రాళ్ళుండటమూ చూశారు. దానయ్య దొంగతనం అందరికీ తెలిసిపోయింది.

కాని పాపన్న దానయ్యతో, "దానయ్య గారూ, మీరు మోసం చెయ్యనని నాకు ఇచ్చిన మాట నిలబెట్టుకున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. ఎందుచేతనంటే మీరు స్వయంగా ఇంట్లో వాడుకుంటున్న బియ్యం లాటివే ఊళ్ళో అందరికీ అమ్ముతున్నారు!" అన్నాడు.

ఈ మాట దానయ్యకు శూలంలా గుచ్చుకున్నది. ఆయన పాపన్నను లోపలికి తీసుకుపోయి అతనికి డబ్బు సంచీ ఇస్తూ, "ఇదుగో, మీ డబ్బు! మిమ్మల్ని పరీక్షించటానికి తీసుకున్నానుగాని, ఈ డబ్బు నా కెందుకండీ? ఇంకో పది రోజులాగి నే నమ్మే బియ్యం ఎలాటివో విచారించండి. నిజం మీకే తెలుస్తుంది!" అన్నాడు.

పాపన్న తాను చేసిన చేబదులు తీర్చేసి వెళ్ళిపోయాడు. ఆ తరవాత దానయ్య కల్తీ వ్యాపారం మానేశాడు. ఊళ్ళో వాళ్ళు సుఖపడి పోయారు.





# పేదింటి పెళ్ళి

ఒకసారి పాపన్న పని మీద బస్తీకి బయలుదేరాడు. దారిలో ఒక చిన్న కాలవ ఉన్నది. ఆ కాలవలోకి దిగుతూండగా అతని కాలికేదో మూట తగిలింది. విప్పి చూస్తే దాని నిండా వరహాలున్నాయి. బస్తీ వాళ్ళెవరో దాన్ని పారేసుకుని ఉంటారనీ, అది ఎవరిదయిందీ బస్తీలో తప్పక తెలుస్తుందనీ, వారి మూట వారికి చేర్చవచ్చుననీ అనుకుని పాపన్న ఆ మూట తీసుకున్నాడు.

అతను బస్తీకి వచ్చిన పని త్వరలోనే అయిపోయింది. ఫలాని వారిది వరహాల మూట పోయిందని ఎవరూ అనుకోవటం పాపన్న చెవుల పడలేదు. అతను ఇంటికి పోయే ఉద్దేశంతో తిరిగి వస్తూ, దాహం వేసి మంచి నీళ్ళ కోసం ఒక ఇంటి వసారాలోకి అడుగు పెట్టేసరికి, "ఆ తినే విషమేదో నాకూ, పిల్లలకూ కూడా పెట్టి మరీ తినండి," అని ఇంటావిడ ఏడుపు గొంతుతో అనటం అతని చెవుల పడింది. ఈ మాటలు వింటూనే పాపన్న లోపలికి పోయి, తన దాహం మాట కూడా మరిచి, "అంత పని చెయ్యకండి. ఏమిటి మీకు వచ్చి పడిన కష్టం?" అని అడిగాడు.

ఆ ఇంటి యజమానికి ముగ్గురు కూతుళ్ళున్నారు. ఇద్దరికి పెళ్ళీడు మించి కూడా పోయింది. ముగ్గురికీ పెళ్ళిళ్ళు చెయ్యాలి. మూరేసి వరహాలైనా కట్నం ఇవ్వక పోతే ఎవరూ చేసుకునేటట్టు లేరు. పెళ్ళి ఖర్చులకే లేని వాడు కట్నా లెక్కడ తెచ్చి పోస్తాడు? పిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యక ఎంత కాలం తాత్సారం చేస్తాడు? ఇదీ ఆ గృహస్థు సమస్య.

"ఖర్చు గురించి విచారించకండి. ఈ వరహాల మూట తీసుకుని మీ పిల్లలు ముగ్గురికీ పెళ్ళిళ్ళు చేసెయ్యండి," అన్నాడు పాపన్న. తనకా మూట దొరికింది వీరి కోసమే

అయి ఉంటుందని అతను అనుకున్నాడు. ఇంటావిడ పరమానందంతో, "ఎవరు, బాబూ, నువ్వు? పరోపకారి పాపన్న లాగా ప్రత్యక్షమయావు?" అన్నది.

"ఔనమ్మా, నేను పాపన్ననే!" అంటూ పాపన్న వారి వద్ద సెలవు తీసుకుని తన గ్రామానికి బయలు దేరాడు.

గృహస్థు కూడా తాను ఎన్నుకుని ఉన్న అల్లుళ్ళకు కట్నాలిచ్చేసి ముహూర్తం పెట్టించుకోవటానికి డబ్బు తీసుకుని బయలుదేరాడు.



పాపన్న వరహాల సంచీ దొరికిన కాలవ దగ్గిరికి తిరిగి వచ్చేసరికి ఎక్కడో ఎవరో మూలుగుతున్నట్టు వినిపించింది. అతను రాళ్ళ గుట్టల మధ్య వెతకగా ఒక మనిషి కనిపించాడు. అతను గాయాలు తగిలి ఒళ్ళు తెలిసీ తెలియని స్థితిలో ఉన్నాడు. పాపన్న ఆ మనిషిని ఎత్తుకుపోయి కాలవ నీటితో అతని ముఖం తుడిచి, నీళ్ళు తాగించి, గాయాలు కడిగిన మీదట ఆ మనిషి, తాను వేకువ జామున బస్తీకి పోతుండే గిట్టని వాళ్ళు పైన పడి హత్య చేయ యత్నించారని చెప్పాడు. తన స్వగ్రామం అయిదారు కోసుల దూరం ఉన్నదని ఆ మనిషి చెప్పటం చేత పాపన్న చేసేదిలేక, అతన్ని తన ఇంటికే మోసుకుపోయి, వైద్యుణ్ణి పిలిపించి చికిత్స చేయించాడు.

ఆ మనిషి పాపన్నతో నిజం చెప్పలేదు. ఆ తెల్లవారు జామున ఒక షావుకారు తాను బస్తీలో పనూలు చేసిన బాపతు సొమ్ము నాలు గైదు వేల వరహాలు మూటలు కట్టి ఇద్దరు నౌకర్లతో సహా తీసు కొస్తుంటే, ముగ్గురు దొంగలు కాలవ సమీపంలో ఉన్న రాళ్ళ గుట్టల మాటున ఉండి అమాంతంగా వాళ్ళ మీద పడ్డారు. అయితే షావుకారు వెంట ఉన్న నౌకర్లలో ఒకడు బలాఢ్యుడు. వాడు చేతి కర్ర తిప్పి ఒక దొంగను తల మీదా భుజం మీదా బలంగా కొట్టాడు.







మిగిలిన ఇద్దరు దొంగలూ పిక్క బలం చూపారు. దెబ్బ తిన్న దొంగ ఎలాగో కొంత దూరం రాళ్ళ గుట్టల మధ్యకు దేక్కుంటూ పోయి, అక్కడ స్మృహతప్పి పడిపోయాడు.

ఆ గల్లంతులో ఒక వరహాల మూట పడిపోయి, పాపన్నకు దొరికింది. పాపన్న ఆ మూట ఎత్తుకునే సమయానికి రాళ్ళ గుట్టల మధ్య పడి ఉన్న దొంగకు స్పృహ లేదు. అతను బస్తీ నుంచి తిరిగి వచ్చే సమయానికి కొంచెం స్పృహ వచ్చి, బాధ తెలిసి మూలగటంచేత పాపన్నకు అతను దొరికాడు.

షావుకారు తీరా ఇంటికి వెళ్ళి చూసుకుంటే తాను తెచ్చిన మూటల్లో ఒక వరహాల మూట కనిపించలేదు. ఆయన బస్తీకి తిరిగి వచ్చి, తనను దారిలో ముగ్గురు దొంగలు కొట్టి వరహాల మూట అపహరించినట్టు కొత్వాలుతో ఫిర్యాదు చేశాడు.

ఆ ఉదయమే ఒక పేద గృహస్థు ఒక్కసారిగా తన ముగ్గురు కూతుళ్ళకు పెళ్ళి ప్రయత్నాలు సాగించాడని కొత్వాలుకు తెలియ వచ్చింది. ఆ గృహస్థును కొత్వాలు పిలిపించి అడగగా, తనకు పరోపకారి పాపన్న అనే ఆయన వరహాల సంచీ ఇచ్చాడనీ, సంచీ ఇంకా తన వద్దనే ఉన్నదనీ అన్నాడు. సంచీ తెప్పించి చూస్తే దాని పైన షావుకారు వేసుకున్న గుర్తు కూడా ఉన్నది.

పరోపకారి పాపన్న పేరు కొత్వాలు విని ఉన్నాడు. ఈ పాపన్న అనే వాడు దొంగతనాల మూలాన డబ్బు గడించి పరోపకారి అని పేరు తెచ్చుకుంటున్నాడని ఇప్పుడాయనకు అనుమానం కలిగింది. ఆయన తన భటులను పాపన్న ఉండే గ్రామానికి పంపించి అతణ్ణి పిలిపించాడు.

తనకు దొంగతనం గురించి ఏమీ తెలియదనీ, తన కా సంచీ కాలవ దగ్గిర దొరికిందనీ, అది ఎవరిదని వాకబు చేసేలోగా ఒక కుటుంబం ఆత్మహత్యా యత్నంలో ఉన్నట్టు తెలిసి, వారిని కాపాడటానికి ఆ సంచీ







ఇచ్చేశానని పాపన్న ఉన్నది ఉన్నట్టు కొత్వాలుకు చెప్పాడు.

ఈ మాటలు షావుకారుకు గాని కొత్వాలుకు గాని రుచించలేదు. షావుకారు సొమ్ము 500 వరహాలు ఎవరికో దత్తమయి పోయింది. దొరికిన సొమ్ము తనకు పప్పగించక సొంత డబ్బులాగా పాపన్న వాడుకుని ఉండటం నేరమేనని నిర్ణయించి కొత్వాలు పాపన్నను ఖైదులో పెట్టించాడు. షావుకారు సొమ్ము షావుకారుకు ముట్టేదాకా గృహస్థును కూడా ఖైదులో ఉంచాలని కొత్వాలు యత్నించాడు గాని, పాపన్న ఆయనను బాధించ వద్దని, షావుకారు గారి డబ్బు తిరిగి ఆయనకు ఇవ్వవలసిన పూచీ తనదేనని అన్నాడు.

అతను గృహస్థుతో, "అయ్యా, ఒక్క ఉపకారం చెయ్యండి. 500 వరహాల కోసం నన్ను ఖైదు చేశారనీ, ఆ మొత్తం చెల్లించిన దాకా నేను ఖైదులో ఉండాలనీ నా భార్యకు కబురు చెయ్యండి. మా ఇంట ఒక జబ్బు మనిషి ఉన్నాడు. పాపం అతనికి ఏ ఇబ్బందీ కలగ కుండా చూసుకోమనండి," అన్నాడు.

ఆ గృహస్థు పాపన్నకు పట్టిన దురవస్థకు కంట నీరు పెట్టుకుంటూ తానే బయలుదేరి వెళ్ళి మీనాక్షికి సమాచారమంతా చెప్పాడు. దెబ్బలతో తీసుకుంటున్న మనిషిని చూసి ఆయన, "పాపన్నగారు నిజంగా మనిషి కారండీ! దేవుడండీ! ఇంత ఆపదలోనూ ఈ మనిషి మాట చెప్పి, ఏ లోటూ జరగ కుండా చూడమన్నారండీ!" అన్నాడు.

మీనాక్షి అంతా విని, "సరే, బాబూ! మీరు వెళ్ళి మీ అమ్మాయిల పెళ్ళిళ్ళ పని చూసుకోండి. దేవుడి దయ ఉంటే 500 వరహాలు పుట్టకపోతాయా?" అన్నది.

గృహస్థు మీనాక్షితో, "అమ్మా, నాకు పాపన్నగారిచ్చిన డబ్బులో ఇంకా సగం అలాగే ఉంది. కట్నాలు ముందే ఇచ్చేశాను





గనక పెళ్ళి ఖర్చులు ఎప్పుడు చిక్కితే అప్పుడే చూచుకోవచ్చు. ఇంకొక్క రెండు వందల వరహాలు సంపాదించ గలిగితిమా, పావన్నగారికి బంధ విముక్తి కలుగు తుంది," అన్నాడు.

"అలాటి మాట మనసులో కూడా అను కోకండి. వారి మాట వింటే చాలా బాధ పడతారు. ఆయన ఎంతమందికో సహాయ పడ్డారు. ఎన్నడూ స్వార్థం చూసుకో లేదు," అన్నది మీనాక్షి.

తలవని తలంపుగా మూలుగుతున్న దొంగవాడు గృహస్థుతో, "అయ్యా, బండి ఒకటి మాట్లాడతారా? నే నింటికి పోతాను. నా ప్రాణం కాపాడిన ఆ పెద్దమనిషి జైల్లో ఉండగా నే నాయనకు అతిథిగా ఎలా ఉండను?" అన్నాడు.

మీనాక్షి అతన్ని పోవద్దని వేడుకున్నది.

"గాయాలన్నిటికీ కట్లు కట్టించారు కాదమ్మా? ఇంక మీరు చేసేది మాత్రం ఏమున్నది? నన్ను వెళ్ళ నివ్వండి," అన్నాడు దొంగ.

మీనాక్షి, గృహస్థూ కలిసి దొంగను బండీ లోకి ఎక్కించి పడుకోబెట్టారు. దొంగ గృహస్థును కూడా ఎక్కమన్నాడు. బండి తిన్నగా దొంగలుండే ఊరికి పోయింది. దెబ్బ తిన్న దొంగ తన తోడు దొంగలతో చెప్పి గృహస్థుకు 500 వరహా లిప్పించాడు. గృహస్థు వాటిని తెచ్చి షావుకారు కిప్పించి, పావన్నను ఖైదు విడిపించాడు.

గృహస్థు, "మా ప్రాణాలు కాపాడారు. మా ఇల్లు నిలబెట్టారు!" అనటం విని పావన్న, "మీకు నిజంగా ఉపకారం చేసింది నేను కాదు, ఆ దెబ్బలు తిన్న మనిషి! అటు వంటి వాడికే శత్రువులు జాస్తి!" అని చెప్పి, పిల్లల పెళ్ళిళ్ళు సుఖంగా జరగాలని ఆశీర్వదించి, ఇంటికి తిరిగి వచ్చేశాడు.

అంత త్వరలో తన భర్త తిరిగి రావటం చూసి మీనాక్షి ఆనందబాష్పాలు రాల్చింది.





# ధర్మనిధి

పాపన్న ఉండే ఊరి గ్రామాధికారి తన పెరడులో బావి తవ్వించగోరి ఒక గొప్ప క్షేత్రజ్ఞుణ్ణి పిలిచి, ఆ స్థలంలో బావి తవ్వితే మంచినీరు పడుతుందేమో చెప్పమన్నాడు.

క్షేత్రజ్ఞుడా పెరడు చూసి, "అయ్యా, మీరు మంచి నీటి మాట అడుగుతున్నారేమిటి? అక్కడ నాలుగు నిలువుల లోతున పెన్నిధి ఉన్నది. అయితే అది సులువుగా దొరకదు. గజలక్ష్మి పూజా, నాగ పూజా చెయ్యాలి. ఒక మాసం కఠిన ఉపవాసం చెయ్యాలి," అన్నాడు.

ఈ మాట విని గ్రామాధికారి లోలోపల సంతోషించి, పైకి మాత్రం క్షేత్రజ్ఞుడితో, "అమ్మయ్యో, ఆ వ్రతాలూ, పూజలూ, ఉపవాసాలూ నేనెక్కడ చెయ్యగలను? మీ దయవల్ల దేవుడే లోటూ లేకుండా ఇంత ఇచ్చాడు. అయినా ముందు రాబోయే వాళ్ళకైనా అవసరంపడితే పనికివస్తుంది; అందు చేత మీరీ మాట చెప్పింది మంచిదే అయింది." అని ఆయనకు కొంత డబ్బు ముట్టచెప్పి పంపేశాడు.

తరవాత గ్రామాధికారి పురోహితుణ్ణి పిలిపించి, "ఏమయ్యా, నాకు గ్రహచారం సరిగా లేదనీ, పెద్ద ఉపద్రవాలూ, నష్టాలూ రానున్నాయనీ జ్యోతిష్కులంటున్నారు. గజలక్ష్మి వ్రతమూ, నాగపూజా చేస్తే అవి నివారణ అవుతాయట. అవి ఎలా చెయ్యాలి? వాటి తంతేమిటి? అందు కెంత ఖర్చవుతుంది?" అని అడిగాడు.

"చిత్తం. గజలక్ష్మి వ్రతం చేస్తే సంపద సిద్ధించే మాట నిజం. అందుకుగాను ఒక నెలపాటు నిరాహారంగానూ, నిష్ఠగానూ ఉండాలి. అర్ధరాత్రి వేళ నాగ పూజ చేయాలి. తెల్లవారుజామున మూడు గుక్కలు పాలు తాగి, దంపతీ సహితంగా లక్ష్మి పూజ చెయ్యాలి. చాలా కఠిన వ్రతం.







ఖర్చుదేమున్నది లెండి? ఒక వెయ్యికి మించదు," అన్నాడు పురోహితుడు.

ఈ వివరాలు విని గ్రామాధికారి తెల్ల మొహం వేశాడు. ఆయన ఎన్నడూ ఉపవాసాలు చేసినవాడు కాదు. భోజన ప్రియుడు కూడానూ. మిగిలిన వాళ్ళకు ఉన్నా లేకపోయినా, తన మట్టుకైనా మంచి మంచి వంటకాలు చేయించుకుని, ముప్పూటలా తృప్తిగా భోంచేసేవాడు.

"ఈ వ్రతం మన వల్ల అవుతుందా?" అన్నాడు గ్రామాధికారి.

ఆ మాట వినగానే పురోహితుడికి భయం వేసింది, తనకు వచ్చే డబ్బు కాస్తా పోతుందేమోనని. గ్రామాధికారి ఈ వ్రతం చేసినట్టయితే ఒక్క దెబ్బన పురోహితుడి దారిద్ర్యం తీరిపోతుంది. అందుచేత ఆయన గ్రామాధికారితో, "దీక్ష మీరే పట్టాలన్న నియమం లేదే. ఆ పని మరే దంపతులు చేసి వ్రతం సాగించినా, అందుకయే ఖర్చంతా మీరే భరించే పక్షంలో వ్రతఫలం విధిగా మీకే చెందుతుంది గద!" అన్నాడు.

గ్రామాధికారికి చప్పున పరోపకారి పాపన్నా, అతని భార్యా గుర్తుకొచ్చారు. వాళ్ళు ఫలాపేక్ష లేకుండా ఎవరికి ఏ ఉపకారం చెయ్యమన్నా చేస్తారు. వ్రతం పూర్తి అయాక వారికి తృణమో పణమో ముట్టజెప్పినా తనకు పెద్ద నష్టమేమీ ఉండదు. వ్రతానికి అవసరమైన ఏర్పాట్లు చేస్తానని చెప్పి పురోహితుణ్ణి పంపేసి, గ్రామాధికారి పాపన్న ఇంటికి వెళ్ళి, "పాపన్నా, నీ వల్ల నా కొక ఉపకారం కావలిసి ఉంది. ఏమంటావు?" అన్నాడు.

"ఏమిటో చెప్పండి. తప్పక చేస్తాను," అన్నాడు పాపన్న.

"నీవూ, నీ భార్యా నెల రోజులపాటు మా ఇంట ఉండి ఉపవాసం చేస్తూ గజలక్ష్మి వ్రతమూ, నాగపూజా జరిపించాలి," అన్నాడు గ్రామాధికారి.









పాపన్న సరేనన్నాడు. పురోహితుడు ఏ రోజున వ్రతాచరణ ప్రారంభం కావలిసిందీ నిర్ణయించాడు. పాపన్నా, మీనాక్షీ ఆనాడు గ్రామాధికారి ఇంటికి వెళ్ళి వ్రత దీక్ష పూనారు. వారు నెల రోజులపాటు పురోహితుడు చెప్పిన విధులన్నిటినీ తూచా తప్పకుండా నిర్వర్తిస్తూ, ఉపోషాలు చేసి వ్రతం పూర్తి చేశారు. వ్రతం చేయించిన గ్రామాధికారి సుష్టుగా భోజనం చేసి పిడిరాయిలా గున్నాడు, మంత్రాలు చదివి దక్షిణలు సంగ్రహించిన పురోహితుడు మరింత సుఖంగా నిద్రపోయి సుఖంగా ఉన్నాడు; నిద్రాహారాలు లేక పాపన్నా, మీనాక్షీ మాత్రం చిక్కి శల్యావశిష్టు లైపోయారు. వ్రతం పూర్తి అయిన మీదట గ్రామాధికారి పాపన్నకు పది రూపాయలు తాంబూలంలో పెట్టి ఇచ్చి, పంపేశాడు.

వెంటనే బావి తవ్వకం ప్రారంభమయింది. మూడు నిలువుల లోతు తవ్వే దాకా అవసరమైనంత మంది కూలీలను వినియోగించి, ఆ తరవాత అద్దరిని ఉంచి మిగిలిన వారిని పంపేశాడు గ్రామాధికారి.

బావి నాలుగు నిలువుల లోతు వచ్చాక ఒకనాడు తవ్వేవాడి పలుగుకు ఖంగున ఏదో తగిలింది. వెంటనే గ్రామాధికారి కూలి వాళ్ళతో, "నీరు పడకపోగా రాయి కూడా తగిలింది. ఇక మీరు పని మానెయ్యవచ్చు," అని వాళ్ళను పంపేశాడు. తరవాత తానే కష్టపడి తవ్వి అనప పెట్టె నొకదాన్ని పైకి తీశాడు. దాన్ని ఆయన ఆ రాత్రి శ్రమపడి ఇంట్లోకి చేర్చాడు.

పుట్టెడాశతో ఆయన దాని మూత తెరిచి చూసేసరికి కళ్ళు తిరిగి పోయాయి. దాన్నిండా రాళ్ళే! ఎవరివల్లనో లోపం జరిగి ఉంటుంది. అందుకే బంగారం దొరకటానికి బదులు రాళ్ళు దొరికాయి. లోపం ఎవరు చేసి ఉంటారు? పురోహితుడు చెయ్యాడు. చెయ్యాటం వల్ల అతడికి ఒరిగే దేమీలేదు.





పాపన్నా, కామాక్షీ ఏదో లోపం చేసి ఉంటారు. ఎప్పుడో నిష్ఠాభంగమై ఉంటుంది.

ఈ మాట అనుకుని గ్రామాధికారి పాపన్నను పిలిపించి, "నీ మూలంగా సర్వనాశమయింది. బోలెడంత డబ్బు పోసి వ్రతం చేయిస్తే ఫలితం దక్కకుండా పోయింది. నువ్వూ, నీ భార్యా ఉపవాసాలు సరిగా చెయ్యక దొంగ తిండి తిని ఉంటారు," అని నిష్ఠురాలాడాడు.

"మీరనే దేమిటో నా కర్థం కాలేదు. మేము పురోహితుడు చెప్పినదల్లా వెంట్రుక వాసి పొల్లురాకుండా చేశాం. మీరేం వ్రత ఫలితం ఆశించారు? అది ఎలా దక్కకుండా పోయింది?" అని పాపన్న అడిగాడు.

ఇక ఏమీ దాచకుండా గ్రామాధికారి పాపన్నకు అంతా చెప్పేసి, "ఆ క్షేత్రజ్ఞుడు చెప్పినట్టే నాలుగు నిలువుల లోతున ఈ పెట్టె దొరికింది. దాన్లో నిధి ఉంటుందని ఆయన అన్నాడు. ఏముందో నువే చూడు," అన్నాడు. పాపన్న పెట్టె మూత తెరిచి చూసి, "అందులో ఉన్నది బంగారమే!" అన్నాడు.

గ్రామాధికారి ఆత్రంగా వచ్చి చూశాడు. ఆయనకు పెట్టె నిండా రాళ్ళే కనపడ్డాయి. "చేసిన మోసం చాలక నన్ను భ్రమపెడుతున్నావు కూడానా? బంగారమైతే మీ యింటికి పట్టుకుపో!" అన్నాడాయన.

"మీ కక్కర్లేక పోతే అలాగే ఇప్పించండి," అంటూ పాపన్న ఆ పెట్టెను తన ఇంటికి తీసుకుపోయి, తనకు నిధి దొరికిందనీ దాన్ని ధర్మకార్యాలకు వినియోగించవలసిందనీ రాజుగారికి కబురు చేశాడు. రాజోద్యోగులు వచ్చి ఆ పెట్టెను మోయించుకు పోయారు. తరవాత రాజుగారు పాపన్నకు మంచి బహుమానమూ, యోగ్యతా పత్రమూ పంపాడు.

ఇదంతా తెలిసి గ్రామాధికారి తనకు డబ్బు దొరక్కపోగా, కీర్తి అయినా దొరికిందికాదే అని చాలా విచారించాడు.





# సహాయం కోరిన దయ్యం

పాపన్న ఉండే గ్రామం నుంచి అతని అత్తవారి ఊరికి వెళ్ళే దారిలో కపాలీశ్వర మనే గ్రామం ఉన్నది. ఆ గ్రామంలో ఒక శ్రీమంతుడికి కాంత అనే కూతురుండేది. ఆమెకు పెళ్ళీడు వచ్చింది.

ఆ గ్రామంలోనే జక్కన్న అనే ఒక యువకుడుండే వాడు. అతను బుద్ధి మంతుడూ, రూపసీ, తెలివి తేటలు కల వాడూ అయినప్పటికీ అనాథ, నిరుపేద. ఒకప్పుడు జక్కన్నది ధనిక కుటుంబమే కాని అతని తండ్రి దురభ్యాసాల వల్ల ఉన్న దంతా పోయింది. జక్కన్న చిన్న తనం లోనే తండ్రిని పోగొట్టుకుని, దారిద్ర్యావస్థలో పడి, ఆ గ్రామంలో వారాలు చేసుకుంటూ చదువుకో వలసిన స్థితికి దిగజారాడు.

అయితే ఊళ్ళో వాళ్ళు జక్కన్నను అభిమానించి అతనికి తిండి బాధ లేకుండా చూశారు. తనకు భోజనం పెట్టే ఇళ్ళలో అతను ఏవైనా చిల్లర పనులు కూడా చేసి సహాయంగానూ, చనువుగానూ ఉండేవాడు. అతనికి కాంత తండ్రి ఇంట కూడా వారం ఉండేది. ఆ విధంగా అతనికీ కాంతకూ పరిచయం ఏర్పడి, అది చనువుగానూ, చివరకు ప్రేమగానూ మారింది. కాంత ఎప్పటికైనా జక్కన్న భార్య కావాలని నిశ్చ యించుకున్నది. జక్కన్నకు కూడా ఆమె పైన చాలా అపేక్ష ఉండేది. వారిద్దరూ తమ మనసు లొకరికొకరు తెలుపుకుని, పెళ్ళి ప్రమాణం కూడా చేసుకున్నారు.

తన తల్లి దండ్రులు తన పెళ్ళి గురించి ఆలోచిస్తున్నారని తెలిసి కాంత తన మనస్సు లోని కోరికను తల్లితో చెప్పింది.

కాంత జక్కన్న వంటి పుట్టు దరిద్రుణ్ణి పెళ్ళాడటం ఆమె తల్లి దండ్రులకు ఎంత







మాత్రమూ నచ్చలేదు. అటువంటి వాడి పైన మనసుంచినందుకు వారామెను గట్టిగా చివాట్లు పెట్టి, ఇక ముందు తమ గుమ్మం తొక్కవద్దని జక్కన్నకు ఆంక్ష కూడా పెట్టారు.

వ్యవహారం ఇలా పరిణమించటం కాంతకూ, జక్కన్నకూ కూడా పెద్ద దెబ్బ అయింది. కాని వారి మనసులు మాత్రం మారలేదు. జక్కన్న ఆ గ్రామం వదిలిపెట్టి రాజధానికి వెళ్ళిపోయి రాజుగారి కొలువులో చేరే అవకాశం సంపాదించుకున్నాడు. అతను కపాలీశ్వరానికి తిరిగి వచ్చి, కాంత తండ్రి ఇంట పని చేసే ఒక ముసలి దాసిని కలుసుకుని, "కాంతకు రహస్యంగా ఒక వార్త చెప్పాలి. నాకు ఆస్థానంలో ఉద్యోగం దొరుకుతున్నది. ఇవాళ రాత్రి కాంత రెండు జాముల వేళ సత్రం దగ్గిరికి వచ్చినట్టయితే నే నక్కడ వేచి ఉంటాను. తరవాత మే మిద్దరమూ రాజధానికి వెళ్ళి అక్కడ పెళ్ళి చేసుకుంటాం. ఈ మాట కాంతకు చెబుతావా?" అన్నాడు. దాసీది సరేనన్నది.

దాసీ దాని ద్వారా జక్కన్న సందేశం అందుకుని ఆ రాత్రి కాంత తన నగలూ, కొద్ది బట్టలూ మూట గట్టుకుని సరిగా నడి రాత్రి వేళ బయలుదేరింది. కాని ఆమె ఇంకా ఇంటి అవరలు దాటకముందే తల్లిదండ్రులకు దొరికిపోయింది. తల్లి ఆమెను నానా మాటలూ అన్నది. తండ్రి కొట్టాడు కూడా. ఆమె తమ వంశానికి అపకీర్తి తెస్తున్నదని ఇద్దరూ ఆడిపోశారు. ఆ తరవాత ఆమెకు ఇల్లే చెరసాల అయిపోయింది.

ఆ రాత్రి జక్కన్న సత్రం అరుగు పైన కోడి కూసిన దాకా కాంత కోసం ఎదురు చూసి, నిరాశ చేసుకుని, రాజధానికి బయలుదేరి వెళ్ళిపోయి, కొలువులో చేరాడు. తరవాత కొద్ది రోజులకే ఆ రాజుకు పొరుగు రాజుతో చిన్న యుద్ధం తటస్థించింది. జీవితం









పైనే విరక్తి చెంది ఉన్న జక్కన్న ఆ యుద్ధంలో చావుకు వెరవకుండా పోరాడి తీవ్రంగా గాయపడి చాలా రోజులు మంచములో ఉండి చికిత్స పొందాడు.

ఈ లోపల శాంతకు తల్లి దండ్రులు పెళ్ళి చేసేసి, ఆమె బాధ్యత వదిలించుకోవటానికి విశ్వప్రయత్నాలు చేశారు. కాని అవి ఫలించలేదు. సంబంధాలు రాలేదు. ఆమెకూ, జక్కన్నకూ మధ్య ప్రేమ ఉండిన సంగతి ఎవరికీ తెలియదని వాళ్ళు అనుకున్నారే గాని అది అదివరకే ఊరంతటికీ తెలిసిపోయింది. అందుచేత శాంతను పెళ్ళాడటాని కెవరూ వచ్చారు కారు. "నా కడుపు చెడ పుట్టింది. దీన్నెవ్వరూ పెళ్ళాడరు!" అని తండ్రి కూతుర్ని తిట్టుకున్నాడు. వ్యవహారం ఇంతదాకా వచ్చాక తన కూతుర్ని ఆ జక్కన్నకే ఇచ్చి చేద్దామన్నా అతని జాడ తెలియలేదు. కష్టపడి విచారిస్తే అతను ఏనాడో యుద్ధంలో చచ్చిపోయాడని ఎవరో అన్నారు.

ఆ దుర్వార్త వినగానే శాంత ఆత్మహత్య చేసుకోవటానికి నిశ్చయించుకున్నది. ఆమె ఒక నాటి అపరాహ్ణం వేళ, తండ్రి ఇంట లేక, తల్లి ఏదో పనిలో ఉన్న సమయంలో ఇంటి నుంచి బయలుదేరి నడవసాగింది. సూర్యాస్తమయం వేళకు ఆమె ఒక నిర్జన ప్రదేశంలో ఉన్న ఒక పెద్ద చెరువు వద్దకు వచ్చి, అందులో పడబోయింది.

కాని ఆమెను ఎవరో వెనక్కు తోసినట్టయింది. "అయ్యో!" అంటూ ఆమె చతికిలబడి, చుట్టూ చూసింది. అయితే ఎవరూ కనిపించలేదు. ఆమె మళ్ళీ లేచి చెరువుకేసి పరిగెత్తబోయింది. మళ్ళీ ఎవరో వెనక నుంచి లాగి నట్టయింది. ఆమె మళ్ళీ చతికిలబడి చుట్టూ చూసింది. ఎక్కడా ఎవరూ కనిపించలేదు. మూడోసారి కూడా అలాగే జరిగేసరికి, "అయ్యో, నన్ను చావనీ!" అని గట్టిగా అరిచింది.










ఆదే సమయంలో పాపన్న తన అత్తగారి గ్రామం వెళ్ళి బండి మీద తిరిగి వస్తూ శాంత పెట్టిన కేక విన్నాడు. బండి దగ్గరికి రాగానే అతనికి చెరువు గట్టు మీద చతికిల పడి ఉన్న శాంత కనపడింది.

పాపన్న దారిలో బండి ఆపి, దిగి, ఆమెను సమీపించి, "ఎవరమ్మా నువ్వు? ఇక్కడ ఒంటరిగా ఏం చేస్తున్నావు? ఇప్పుడు గట్టిగా అరిచినట్టున్నావు దేనికి?" అని అడిగాడు. శాంత దాచకుండా తనకు వచ్చిన కష్టమంతా చెప్పుకున్నది.

"అమ్మా, ఆత్మహత్య మహాపాపం. నీకు నీ తల్లిదండ్రుల ఇలు నరకం లాగుంటే మా ఇంటికి వచ్చి ఉండు. నీకే కష్టమూ, బాధా లేకుండా నేను కాపాడతాను," అన్నాడు పాపన్న.

శాంతకు పాపన్నను చూస్తున్న కొద్దీ అతను తప్ప తన కెవరూ ఆప్తులు లేరనిపించింది. ఆమె వాళ్ళ ఇంటికి అతని వెంట వెళ్ళటానికి ఒప్పుకున్నది.

అప్పటికే చీకటి పడుతున్నది. సమీప గ్రామానికి పోవాలన్నా నాలుగైదు మైళ్ళు వెళ్ళాలి. చెరువుకు ఇవతలి పక్కన ఒక పురాతన భవనం ఉన్నది. పాపన్న శాంతను బండిలో ఎక్కించుకుని ఆ భవనం దగ్గిరికి తోలుకు పోయాడు.

అప్పుడే చంద్రోదయ మయింది. భవనం పాడుపెట్టి ఉన్నదేగాని శిథిలం కాలేదు. ఇంటి ముందు అక్కడక్కడా పిచ్చి మొక్కలూ, గడ్డి తుప్పలూ ఉన్నాయి. పాపన్న దీపం వెలిగించి, బండి నుంచి వంట సామగ్రి దింపి, రాళ్ళు పెట్టి పొయి ఏర్పాటు చేసి, చెరువు నుంచి నీరు తెచ్చాడు. ఇద్దరూ చేరి తేలిక వంట చేసేశారు.

ఇంటికి పెడగా ఉన్న దారి వెంట గుర్రం మీద వెళ్ళే ఒక పెద్ద మనిషి, ఆ ఇంట దీపం వెలుగుతూండటం చూసి, "ఎవరండోయ్! ఆ దయ్యాల కొంపలో ఉండకండి!





చచ్చి పోతారు!" అని హెచ్చరించి తన దారిన వెళ్ళిపోయారు.

పావన్నకు దయ్యాల భయంలేదు. శాంత నడిగితే "చావటానికే సిద్ధమైనదాన్ని నాకేం భయం?" అన్నది.

"నిన్ను చెరువులో పడకుండా ఆపినది ఈ ఇంటి దయ్యమే అయి ఉంటుంది. అది మంచి దయ్యమే అయి ఉండాలి," అన్నాడు పావన్న. వాళ్ళిద్దరూ తేలికగా భోజనం చేసి ఇంటి ముందు వసారాలో చెరొకపక్కా నడుములు వాల్చి, పడుకుని నిద్రపోయారు.

అర్ధ రాత్రివేళ ఎవరో మాట్లాడిన అలికిడి అయి పావన్నా, శాంతా కూడా కళ్ళు తెరిచి చూశారు. ఒక తెల్లటి ఆకారం గాలిలో తేలి ఉండటం వారిద్దరికీ కనిపించింది. దాన్ని చూసి శాంత కెవ్వున అరిచింది.

"భయపడకు, తల్లీ. నేను నీ కేమి అపకారం చెయ్యను," అన్నదా ఆకారం.

పావన్న లేచి కూర్చుని, "ఎవరయ్యా నీవు? నీకేం కావాలి?" అని అడిగాడు.

"నా కొక్క ఉపకారం చెయ్యాలి, నాయనా. నేనీ యింటి యజమాని అయిన గోపన్నను. ఇప్పుడు పిశాచంగా ఉన్నాను. ఈ అమ్మాయి నా మనవడి భార్య. ఈమె భర్తను తెచ్చి, ఇద్దరినీ ఈ ఇంట కాపరం పెట్టాలి. అంతదాకా నాకీ పిశాచపు బ్రతుకు





తప్పదు. ఆ పని చేసి నీవు పుణ్యం కట్టుకున్నావంటే నాకు విమోచనం కలుగుతుంది," అన్నదా ఆకారం.

"సహాయం చెయ్యటానికి నేను సిద్ధమే గాని, ఈ ఇంట ఎవరుగాని ఎలా కాపరం ఉంటారు?" అని పాపన్న అడిగాడు.

"నాయనా, ఈ ఇల్లిలా ఉండటానికి నేను తప్ప మరో కారణ మేమీలేదు. ఈ ఇంట అంతులేని ధనమున్నది. నిక్షేప మంటి ఇల్లు. నా కథ చెబుతాను విను," అంటూ పిశాచం తన కథను ఇలా చెప్పింది:

"ముప్పై ఏళ్ళ క్రితం నేనీ ఇంట గోపన్న ప్రభువనే పేరుతో మహా వైభవంగా బతికాను. నా కొడుకు చెడ్డ సహవాసాలు మరిగి, నన్ను తృణీకరించి ధనం నీరులాగా వ్యయం చెయ్యసాగాడు. నేను నా స్వార్జిత మంతా వెండి బంగారాలుగా మార్చి ఈ ఇంటి నట్టింట పాతి పెట్టాను. ఆ రహస్యం నాతోనే పోయింది. నా అనంతరం నా కొడుకు స్థిరాస్తి పైనా, ఈ ఇంటి మీదా దొరికినంత మేరకు అప్పులు చేసి, బాకీదార్ల బాధ పడలేక, తన చిన్న కొడుకును గాలికి వదిలేసి, తను కాస్తా దేశాలమీద పారిపోయి, దిక్కులేని చావు చచ్చాడు. అప్పులవాళ్ళు ఇల్లు ఆక్రమించుకున్నారు. కాని నేనీ రూపంలో ఈ ఇంటిని అంటి పెట్టుకుని ఉండి, ఈ ధనాన్ని కాపాడుతూ, ఇందులో ఎవరూ కాపురం చెయ్యటానికి అస్కారం లేకుండా చేస్తూ వచ్చాను. నా మనవడు జక్కన్న. వాడు వచ్చి ఈ ఇంట కాపరం ఉంటే నా భారం వదిలిపోతుంది. ప్రయాణీకులు ఈ ఇంటి సంగతి తెలియక ఇక్కడికి వచ్చినప్పుడల్లా, నా మనవణ్ణి తీసుకురమ్మని వాళ్ళను అడుగుతూ వచ్చాను. అందరూ దడుచుకుని పారిపోయారు. ఒక్కరూ నాకు సహాయం చెయ్యలేదు. నా అదృష్టం కొద్దీ ఇవాళ నా మనవడి భార్యే ఇటుగా వచ్చింది. ఆమె చెరువులో పడకుండా కాపాడాను."





అంతా విని పాపన్న, "నీ మనవడు జక్కన్న ఎక్కడుంటాడో?" అన్నాడు.

"వాడు రాజధానిలో ఉన్నాడు. చికిత్స పొంది ఇప్పుడు ఆరోగ్యవంతుడుగా కూడా ఉన్నాడు," అన్నది పిశాచం.

"నువే వెళ్ళి నీ మనవడితో ఇదంతా చెప్పలేక పోయావా?" అన్నాడు పాపన్న.

"నేను పాతిపెట్టిన ధనం నా మనవడికి చెందాలన్న దిగులుతోనే కదా నేను పిశాచాన్నయాను? దాన్ని విడిచిపెట్టి పోవటం నాకు సాధ్యంకాదు. అహోరాత్రాలు దాన్ని కాపాడటమే నా పని," అన్నది పిశాచం.

"సరే, నేను నీ మనవణ్ణి వెతికి తెచ్చి ఈ ఇంట కాపరం పెట్టిస్తాను. నీవు నిశ్చింతగా ఉండు," అన్నాడు పాపన్న. పిశాచం అదృశ్యమయింది.

కిందటి రాత్రి గుర్రం మీద వెళ్ళిన మనిషి తిరిగి తెల్లవారి ఆటుగా వస్తూ, కిందటి రాత్రి తాను చూసిన మనుషు లింకా బతికి ఉన్నందుకూ, అక్కడే ఉన్నందుకూ ఆశ్చర్య పోయాడు. ఆ భవనం గోపన్న అనే పిసినిగొట్టు దనీ. ఆ గోపన్నే దయ్యమై ఆ యింట ఉంటున్నట్టు అందరూ చెప్పుకుంటారనీ ఆ మనిషి పాపన్నతో చెప్పాడు.

పాపన్న కాంతను తన బండిలో తీసుకుని రాజధానికి వెళ్ళాడు. అక్కడ అతనికి జక్కన్న జాడ సులువుగానే తెలిసింది. జక్కన్నకు అన్ని విషయాలూ చెప్పి అతన్ని గోపన్న ఇంటికి తీసుకు వచ్చాడు పాపన్న.

పాపన్నా, జక్కన్నా నట్టింటో తవ్వగా, పిశాచం చెప్పినట్టే ఒక పెట్టెలో అంతులేని వెండి నాణాలూ, బంగారు నాణాలూ దొరికాయి. పాపన్న కొన్ని రోజులపాటు అక్కడే ఉండి, భవనానికంతకూ వెల్ల వేయించి, దొడ్డి బాగు చేయించి, జక్కన్నకూ కాంతకూ పెళ్ళి చేయించి, తానే స్వయంగా కన్యాదానం చేసి, వారిద్దరి చేతా ఆ ఇంట కాపరం పెట్టించి, తిరిగి తన ఇల్లు చేరుకున్నాడు.





# పెట్టని పరీక్ష

దేశంలోని గ్రామాధికారు లందరికీ రాజుగారి వద్ద నుంచి ఒక ఫర్మానా వచ్చింది. అదేమిటంటే, ప్రతి గ్రామాధికారీ తన గ్రామంలో ఉండే విశిష్ట వ్యక్తుల పేర్లూ, వివరాలూ రహస్యంగా రాజుగారి దివాణానికి అందజేయాలి. గ్రామంలో ఉండే పండితులూ, కవులూ, గాయకులూ, శిల్పులూ, వీరులూ మొదలైన వారి పేర్లను జాబితాలో చేర్చవచ్చు.

రాజుగారి ఫర్మానా చేత బట్టుకుని దివాణం నుంచి ఒక అధికారి ప్రతి గ్రామమూ తిరుగుతూ పాపన్న ఉండే గ్రామంలోని గ్రామాధికారి వద్దకు కూడా వచ్చాడు. గ్రామాధికారి తమ గ్రామంలో ఉన్న ఒక కవీ, ఒక శిల్పీ, ఒక గాయకుడూ, ఇద్దరు వీరులూ—వీరి పేర్లను జాబితాలో వేసి, ఆఖరున ఆరో పేరు కింద పరోపకారి పాపన్న పేరు కూడా చేర్చాడు.

అధికారి జాబితా తీసుకుని వెళ్ళి పోయిన వారం రోజులకు గ్రామాధికారికి దివాణం నుంచి ఒక తాఖీదు వచ్చింది; జాబితాలో చేర్చిన ఆరుగురికీ గ్రామాధికారి నిరూపణ పత్రాలిచ్చి, వచ్చే నవమి మధ్యాహ్నం లోపుగా వారిని ఆస్థానానికి పంపాలి.

గ్రామాధికారి ఆరుగురినీ పిలిపించి, రాజుగారి తాఖీదు వినిపించి, "మీ కందరికీ రాజుగారేదో సన్మానం చేసేటట్టు కనబడుతుంది. కనక మీరందరూ బయలుదేరి వెళ్ళండి," అన్నాడు.

"వాళ్ళంతా ప్రత్యేకతలు గల వాళ్ళు. నన్నెందుకు పొమ్మంటారు, స్వామీ? నేను ఎందులోనూ ప్రముఖుణ్ణి కానే! నామూలంగా గ్రామానికి అప్రతిష్ఠ వస్తుందో ఏమో!" అన్నాడు పాపన్న.

"అదేమీ ఉండదు. నిన్ను గురించి నిజం తెలుసుకునే రాజుగారు ఆహ్వానిం







వారు. ఆహ్వానాన్ని తిరస్కరించటం నేర మవుతుంది. వెళ్ళిరా," అన్నాడు గ్రామాధికారి. పాపన్న విధిలేక ఒప్పుకున్నాడు.

గ్రామం నుంచి రాజధానికి నాలుగు రోజుల ప్రయాణం. ఆరుగురూ వీలును బట్టి మజిలీలు చేస్తూ, నవమినాటి ఉదయానికి రాజధాని సమీపాన గల గ్రామానికి చేరుకున్నారు. అవాంతరాలు రాకుండా ఉంటే మధ్యాహ్నం లోపల రాజుగారి ఇంటికి చేరుకోవచ్చు.

వాళ్ళు కొంత దూరం వచ్చేసరికి ఒక కాలవ అడ్డొచ్చింది. కాలవను దాటటానికి ఒక తాటి బొంతు గట్లకు అడ్డంగా వేసి ఉన్నది. వాళ్ళక్కడికి వచ్చేసరికి, దాని మీదుగా దాటటం చేతగాక ఒక ముసలిది ముగ్గురు పిల్లలూ చిక్కున పడి ఉన్నారు.

ఆటుగా వచ్చిన ఆరుగురినీ చూసి ముసలిది, "బాబూ, నన్నూ, ఈ పసి వాళ్ళనూ అవతలికి దాటింతురూ! తాటి బొందు మీదుగా నడవటానికి భయంగా ఉన్నది. కాలవ చూడబోతే లోతు," అన్నది.

పాపన్న ముఠాలో వాళ్ళు, "వెనక నుంచి ఇంకెవరైనా వచ్చి దాటిస్తారులే. మేం తొందరగా వెళ్ళాలి," అంటూ ఒకరొకరే తాటిబొందు మీదుగా కాలవ దాటి అవతలికి వెళ్ళారు. ఒక్క పాపన్న మటుకు ఇవతలే ఉండిపోయి, "నిన్నూ, నీ పిల్లలనూ నేను దాటిస్తాలే, భయపడకు," అన్నాడు.

కాస్త ఆలోచించిన మీదట అది కూడా అంత తేలికపని కాదని పాపన్నకు తోచింది. ముసలిది మరీ వృద్ధు, పిల్లలు మరీ పసి వాళ్ళు. ఆ తాటి బొందు మీదుగా ఆ ముసలి దాన్నీ, ఆ పసి పిల్లలనూ చెయ్యి పట్టి నడిపించటం అంత తేలిక పనికాదు. మధ్య దారిలో వాళ్ళు తనను కూడా నీటిలో పడెయ్యవచ్చు. అందుచేత పాపన్న కాలవ మీదుగా పట్టుతాడు ఏర్పాటు చేయ నిశ్చ





యించారు. తాను స్వయంగా ఒక రిద్దరిని నడిపించి ప్రయోజన మేమిటి? పట్టుతాడు ఏర్పాటు చేస్తే ప్రతి ఒక్కరూ దాని సహాయంతో తాటిబొందు మీదుగా దాట గలుగుతారు. ఈ మాట అనుకుని పాపన్న తన మూట ఒడ్డున పెట్టి, అక్కడ పాతటానికి గుంజకర్ర కోసం వెతకసాగాడు.

అప్పటికే అవతలి ఒడ్డుకు చేరిన అయిదుగురూ, "పాపన్నా, రావేం? ఇంకా ఏం చేస్తున్నా వక్కడ? పొద్దెక్కి పోతున్నది!" అని కేకలు పెట్టారు.

"మీరు నడుస్తూండండి. నేను వచ్చి కలుసుకుంటాను," అన్నాడు పాపన్న.

"ఏ దెప్పుడూ ఇంతేలే. ఇంత దూరం మనతో కలిసి వచ్చాడు, అదే విశేషం," అనుకుని మిగతా అయిదుగురూ గబగబా ముందుకు సాగారు.

కాలవ దగ్గిర దిగబడి పోయిన పాపన్న ఆరేసి అడుగుల నిడుపు గల రెండు కర్రలు గట్టివి సంపాదించి, కాలవ ఈ ఒడ్డునా, ఆ ఒడ్డునా బాగా లోతుగా, గట్టిగా పాతాడు. బలమైన మర్రిఊడలు తెచ్చి, వాటిని తాడుగా అమర్చి, రెండు గుంజలకూ కట్టాడు. ఇప్పుడెంత ఎరికి వాళ్ళయినా ఆ తాడు పట్టుకుని తాటి బొందు మీదుగా కాలవను దాటి వెళ్ళవచ్చు.







పరికరాలేవీ లేని కారణంచేత ఈ పని పూర్తి కావటానికి రెండు మూడు గడియలు పట్టింది. ముసలిదీ, దాని మనమలూ చివరకు కాలవ దాటారు.

"బతికించావు, బాబూ. ఇంక మేం దివాణానికి నిశ్చింతగా పోవచ్చు," అన్నది ముసలిది.

"మీరు రాజుగారింటికా పోతున్నారు?" అన్నాడు పాపన్న ఆశ్చర్యంతో.

"అవును, నాయనా. రాజుగారి పుట్టిన రోజు పండుగ కదా! బీద సాదలకు అన్నాలు పెడుతున్నారు. దానికే నా మనవళ్ళతో సహా పోతున్నా," అన్నది ముసలిది.

"నేనూ అక్కడికే పోతున్నా. అందరమూ కలిసే పోదాం," అన్నాడు పాపన్న.

అయితే నడక చురుకుగా సాగలేదు. అందరి కన్న చిన్న పిల్లవాడు కాళ్ళు నొప్పి పెడుతున్నాయనీ, నడవలేననీ అన్నాడు. ముసలిది వాళ్లెత్తుకుని బొత్తిగా నడవలేక పోయింది. అందుచేత పాపన్న వాళ్ల తానే ఎత్తుకుని నడిచాడు.

పాపన్న దివాణానికి చేరుకునే సరికి మధ్యాహ్నం కొంచెం దాటనే దాటింది. పాపన్న భోజనశాల దగ్గిర ముసలిదాన్నీ, పిల్లలనూ వదిలి, అతిథులు ప్రవేశించే ద్వారం వద్దకు వెళ్ళాడు.

అతనితో వచ్చిన అయిదుగురూ మధ్యాహ్నానికి ముందే చేరుకున్నప్పటికీ వారికి ప్రవేశం దొరకలేదు. వారింకా బయటే ఉన్నారు. మంత్రిగారు వాళ్ళనడిగి, ఫలాని గ్రామం నుంచి వస్తున్నట్టు తెలుసుకుని, "జాబితా ప్రకారం మీరు ఆరుగురు కద. ఆరోవాడేడి?" అన్నారు.

"అతను దారిలో లేనిపోని పనులేవో మీద వేసుకుని వెనకపడి పోయాడు," అన్నారు వాళ్ళు.

"అతన్ని కూడా రానివ్వండి. అందరూ లోపలికి పోవచ్చు," అన్నాడు మంత్రి.

పాపన్న కనిపించగానే వాళ్ళయిదుగురూ అతని పైన విరుచుకు పడ్డారు. "నీ మూలంగా మేం బయటే ఉండి పోయాం. మా కన్న ఎంతో ఆలస్యంగా వచ్చిన బళ్ళన్నీ లోపలికి వెళ్ళి పోయాయి. నువ్వు మన గ్రామాని కున్న పరువు కాస్తా తీసేశావు," అన్నారు వాళ్ళు.

"అందుకే నేను రాను మొర్రో అన్నాను," అన్నాడు పాపన్న.

ఆరుగురూ కలిసి మంత్రిగారి వద్దకు వెళ్ళారు. మంత్రిగారు వాళ్ళు తెచ్చిన నిరూపణ పత్రాలు పరిశీలించి, వారు ఆలస్యంగా రావటానికి కారణ మడిగాడు.

"అయ్యా, తప్పు నాదే. వీరయిదుగురూ సమయానికే వచ్చారు. ఇక్కడి కొక మైలు దూరాన కాలవ మీద పట్టుతాడు అమర్చుతూ నేనే ఆలస్యం చేశాను," అంటూ పాపన్న తాటి బొందు పైన కాలవ దాటటంలో ముసలివాళ్ళకూ పిల్లలకూ గల అసౌకర్యం గురించి చెప్పాడు. ముసలిదాన్ని గురించీ, దాని మనమలను గురించీ కూడా మంత్రి గారికి చెప్పాడు.

"ఇప్పుడా వంతెన సౌకర్యంగా ఉన్నదా?" అని మంత్రి అడిగాడు.

"చిత్తం. చిన్న పిల్లలు కూడా దాట వచ్చునండి," అన్నాడు పాపన్న.





"అది మరమ్మతు చెయ్యటాని కెంత కాలం వృథా అయింది?" అని ప్రశ్నించాడు మంత్రి.

"మేం వచ్చి చేరి మూడు ఘడియలయిందండి," అన్నారు మిగిలిన అయిదుగురు.

"ఇప్పుడు మధ్యాహ్నం దాటి ఘడియే అయింది. మీరు అయిదుగురున్నారు. మీరు కూడా అతనికి సహాయపడి ఉంటే అందరూ మధ్యాహ్నం లోపలే వచ్చి ఉండరూ?" అన్నాడు మంత్రి.

ఎవరూ జవా బివ్వలేదు.

"సరే, మీరు ముందు వెళ్ళి భోజనాలు చెయ్యండి," అన్నాడు మంత్రి.

రాజుగారి పుట్టినరోజు ఉత్సవాల సందర్భంలో మూడు రోజులపాటు సదస్సు జరిగింది. వివిధ గ్రామాల నుంచి వచ్చిన ప్రముఖులకు వారి వారి విద్యలలో పరీక్షలు పెట్టి, వారి వారి ప్రతిభకు తగ్గట్టుగా బహుమానా లిచ్చారు.

తనకు కూడా ఏదో పరీక్ష పెడతారని, తన పని అభాసవుతుందని పాపన్న భయపడ్డాడు, కాని అలాటి దేమీ జరగలేదు. ఆఖరు రోజు పరీక్షలు ముగిశాయి. ఒక్కొక్కరి పేరే చదివి బహుమానాలు పంచసాగారు. పాపన్నకు పరీక్ష జరగలేదు, అందుచేత అతని కేమీ బహుమానం ఉండదని, అతని వెంట వచ్చిన వాళ్ళనుకున్నారు. కాని రాజుగారు పాపన్నను కూడా బహుమతి ప్రదానానికి పిలిచాడు.

"ఈయన పేరు పాపన్న. పరోపకారి. ఈయనకు పరీక్ష పెట్టలేదు. ఎందు కంటే ఈయన ఇక్కడికి వచ్చే దారిలోనే ఈయన పరీక్ష జరిగి పోయింది. ప్రతిఫలం ఏమీ కోరకుండా, తాను నష్టపడి అయినా తోటి మానవులకు ఎల్లప్పుడూ ఉపకారం చేసే పాపన్నకు పదివేల బంగారు కాసులు ప్రత్యేక బహుమానంగా ఇస్తున్నాం," అని రాజుగారు నిండు సభలో ప్రకటించాడు.







# కరువు కాటకాలు

ఒకసారి పాపన్న నివసించే దేశంలో పెద్ద కరువు ఏర్పడింది. వానలు కురవలేదు. పంటలు పండలేదు. కరువు నివారణ కోసమై రాజుగారు బావులను మరింత లోతుగా తవ్వించాడు. అందువల్ల లాభం లేకపోయింది. బొక్కసంలో ధనం ఉన్న మేరకు దూరదేశాల నుంచి ఆహార ధాన్యాలు తెప్పించి ప్రజలకు పంచి పెట్టించాడు. బొక్కసం కూడా ఖాళీ అయింది.

ఈ సమయంలో ఒకనాటి తెల్లవారు జామున పాపన్న కొక చిత్రమైన కల వచ్చింది. అందులో పాపన్నకు రాజుగారు కనిపించి, తూర్పుగా కనబడే కొండలను చూపిస్తూ, "ఆ కొండలలో ఎక్కడో ధనరాసులున్నాయని మా కులదేవత చెప్పింది. ఆ ధనం గురించి తెలుసుకు రమ్మని భటులను పంపితే ఒక్కరూ తిరిగి రాలేదు. ప్రజలు మాడి చస్తూంటే ఏమీ చెయ్యలేకుండా చూస్తూ కూర్చోవటం బాధగా ఉన్నది. ఆ ధనం సంగతి తెలుసుకుని వచ్చే వారెవరూ కనిపించరు. కాస్త నీవా పని చేస్తావా?" అని అడిగాడు.

"అంతకంటేనా, ప్రభూ. ఇప్పుడే బయలుదేరుతాను," అని పాపన్న అంటుండగా పాపన్నకు మెలకువ వచ్చింది.

తనకు వచ్చిన కలను తలుచుకుని పాపన్న చాలా ఆశ్చర్యపడ్డాడు. అది ఇంకా కళ్ళకు కట్టినట్టే ఉన్నది. పాపన్న రాజు వద్దకు వెళ్ళి స్వప్న వృత్తాంతం చెబుదామనుకున్నాడు గాని, కల వాస్తవమో, కాదో ముందుగా తెల్సుకోవటం మంచిదని అతనికి అనిపించింది.

అందుచేత పాపన్న ఎవరికీ చెప్పకుండా ఇంటి నుంచి బయలుదేరి తూర్పుగా ప్రయాణమయాడు. అతను తూర్పు కొండల ఇవతల అరణ్యప్రదేశం కుండా పోయే



టప్పుడు అక్కడ గ్రామాలలో నివసించే వారు, ఆ కొండలలోకి ఎవరూ వెళ్ళరనీ, వెళ్ళిన వారెవరూ తిరిగిరారనీ, ఒకప్పుడు కొందరు రాజభటులు అటుగా వెళ్ళి మరి తిరిగి రాలేదనీ చెప్పారు. ఈ మాటలు విన్న మీదట పాపన్నకు తన కలలో కొంత నిజం ఉన్నట్టు తోచి, ముందుకు వెళ్ళాలనే నిశ్చయం మరింత దృఢమయింది.

ముందుకు పోతున్న కొద్దీ అరణ్యం కీకారణ్యమయింది. అటువంటి ప్రాంతంలో నడుస్తూండగా, హఠాత్తుగా ఒక మనిషి పాపన్న దారిలో అడ్డంగా ప్రత్యక్షమై, "మీరా, పాపన్నగారూ? ఇంకెవరో అనుకున్నాను. ఏమిటిలా అరణ్యంలోకి వస్తున్నారు?" అని అడిగాడు.

పాపన్న ఆ మనిషిని గుర్తు పట్టాడు. ఆ మనిషి ఒక దొంగ; లోగడ పాపన్న ద్వారా చికిత్సపొంది, రక్షించబడిన వాడు. పాపన్న అతనితో తన కల గురించి చెప్పి, "జనం తిండికి అల్లాడిపోతున్నారు. కొండల్లో ఆ ధనం ఎక్కడ ఉన్నదీ వెతకటానికి నువ్వు సహాయం చేస్తావా?" అని అడిగాడు.

"అది సాధ్యమయే పని కాదే! అది భయంకరమైన ప్రదేశం. అక్కడి కెవరూ రాకూడదు. నా పైన దయ వుంచి మీరు తిరిగి వెళ్ళండి," అన్నాడా దొంగ.

"ఒక వంక ప్రజలు తిండిలేక కటకట పడుతూంటే, అక్కడ ధనం ఉన్నదని తెలిసి ఎలా వెనక్కుపోను?" అని పాపన్న అడిగాడు.

"బాబూ, అలాటి దయాదాక్షిణ్యాలకిక్కడ చోటులేదు. మీరు దయచేసి వెళ్ళిపొండి," అన్నాడు దొంగ.

ఇంతలో మరొక మనిషి ఎటునుంచో వచ్చి, "ఎవడు వీడు? ఇక్కడికేం పని మీద వచ్చాడు? చేతులూ, కాళ్ళూ కట్టి ఈడ్చుకుపోక నిలబడి వీడితో మాట్లాడు







తున్నావేమిటి?" అని దొంగతో అన్నాడు. వాడు కూడా దొంగల ముఠాకు చెందినవాడే.

వాడితో మొదటి దొంగ రహస్యంగా పావన్న గురించి చెప్పి, "ఏం చేద్దాం?" అని సలహా అడిగాడు.

"మన నాయకుడి దగ్గిరికి తీసుకు పోదాం," అన్నాడు రెండో దొంగ.

ఇద్దరూ కలిసి పావన్నను దొంగల నాయకుడి వద్దకు తీసుకుపోయారు. మొదటి దొంగ తమ నాయకుడి చెవిలో రహస్యంగా, పావన్న ఒకప్పుడు తనకు చేసిన ఉపకారం గురించి చెప్పాడు.

అంతా విని దొంగల నాయకుడు పావన్నతో, "మా ప్రాంతానికి వచ్చినవాళ్ళను ప్రాణాలతో పోనిచ్చే అలవాటు మాకులేదు. అయినా నీవు మాకు ఉపకారం చేసి ఉన్నవాడివి కనక నిన్ను నిరపాయంగా తిరిగి వెళ్ళిపోనిస్తాము. సరేనా?" అన్నాడు.

"మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి. కాని నాకు ఒక్క ఉపకారం చేయించండి. ఈ కొండలలో ఉండే ధనరాసులు నాకు చూపించినట్టయితే నేను తిరిగివెళ్ళి వాటి వివరాలు రాజుగారితో చెప్పి, ఆ తరవాత జరగవలిసిన ఏర్పాట్లు చేయిస్తాను," అన్నాడు పావన్న.

"ఇంకా నయం! ఇంతవరకు నీవు చూసినది ఎవరికీ చెప్పనని మా కాళికామ్మవారి ఎదట ప్రమాణం చేస్తేనే నిన్ను ప్రాణాలతో తిరిగిపోనిచ్చేది," అన్నాడు దొంగల నాయకుడు.

"నాకు చూపటం ఇష్టంలేకపోతే ఇక్కడ ఉండే ధనాన్ని మీరే తిన్నగా రాజుగారి వద్దకు పంపండి," అన్నాడు పావన్న.

దొంగల నాయకుడు మండిపడి, "మా కష్టార్జితాన్ని మేము ఎవరికీ ఇవ్వము. మా సంగతి ఎవరికీ చెప్పనని కాళిక ముందు ప్రమాణం చెయ్యకపోతే నిన్ను కాళికకు బలి ఇచ్చేస్తాము," అన్నాడు.





"నే నలాటి ప్రమాణం చెయ్యలేను," అన్నాడు పాపన్న.

మరుక్షణమే దొంగలు పాపన్నను చెరొక రెక్కా పట్టుకుని కాళికావిగ్రహం వద్దకు తీసుకుపోయారు. అది రెండు నిలువుల ఎత్తుగల భయంకరమైన విగ్రహం.

"ఇప్పుడైనా కాళిక ముందు ప్రమాణం చెయ్యి, ప్రాణాలతో బయట పడతావు," అన్నాడు దొంగల నాయకుడు.

"నే నిక్కడికి దబ్బుకోసం వచ్చాను, మీ రహస్యాన్ని కాపాడటానికి కాదు," అన్నాడు పాపన్న దృఢంగా.

పాపన్న తల తెగయ్యటానికి దొంగల నాయకుడు కత్తి ఎత్తాడు. ఆ క్షణంలోనే కాళికావిగ్రహం, ఎవరో తోసినట్టుగా, మొద లంటా విరుచుకుని, పక్కకు ఒరిగి, దొంగల నాయకుడి పైన పడింది. దొంగల నాయ కుడు దాని కిందపడి ఒక్క మూలుగుతో ప్రాణాలు వదిలాడు.

"చూశారా? నన్ను దేవే ఇలా పంపింది. మీ కింక మీ నాయకుడితో పనిలేదని చెప్ప టానికి అతణ్ణి బలి పుచ్చుకున్నది. ప్రజలు కరువుబాధ నుండి బయటపడటానికి మీ ధనం అవసరం. ఈ మాట కలలో దేవి చెప్పిన మీదటనే నే నిలా వచ్చాను. నా వెంట రండి. రాజుగారు మిమ్మల్ని శిక్షించ కుండా నేను చూస్తాను. మీరంతా మామూలు ప్రజలతో కలిసి జీవించటం ప్రారంభిస్తే దేవి సంతోషిస్తుంది," అని పాపన్న దొంగలకు నచ్చ చెప్పాడు.

పాపన్న ధైర్యం కళ్ళారా చూసిన దొంగ లకు అతని మాటలలో సులువుగా గురి కుదిరింది. వాళ్ళు తమ ధన మంతా మోసు కుని రాజుగారి వద్దకు పాపన్న వెంట వెళ్ళారు. రాజుగారు దొంగలందరినీ క్షమించి, వాళ్ళకు జీవనోపాధులు ఏర్పాటు చేసి, వారి ధనంతో కరువు నివారణ యత్నాలు చేశాడు.





# దారిలో దాహం

ఒకసారి పాపన్న నివసించే ఊళ్ళో ఒక విచిత్రమైన, భయంకరమైన పిల్లల రోగం ప్రారంభమయింది. రెండు రోజులపాటు పిల్లలు తిండి తినక, ఆటలాడక, నీరసంగా ఏడుస్తూ ఉంటారు. మూడో రోజున జ్వరం పట్టుకుంటుంది. మూడు రోజులు జ్వరంతో బాధపడి పిల్లలు చచ్చిపోతారు.

ఆ జ్వరానికి చికిత్స చెయ్యగల వైద్యు లెవరూ ఆ ఊళ్ళో లేరు. పది మైళ్ళ దూరాన శివపురంలో ఉండే చక్రవైద్యు డనే ఆయన ఆ జ్వరానికి తగిన చికిత్స చేసి నయం చెయ్యగలిగాడు. ఆ వైద్యుణ్ణి తీసుకు రావాలంటే ఖర్చు ఎక్కువ. అది భరించుకో లేని వాళ్ళు, పిల్లలను శివ పురానికే తీసుకుపోయి, వైద్యుడికి చూపించి, మందు తీసుకుని వచ్చేసేవాళ్ళు. బిడ్డను చూసి పరీక్ష చెయ్యకుండా వైద్యుడు మందిచ్చే వాడు కాడు. జ్వరం తగలక ముందే చికిత్స చెయ్యాలి. జ్వరం తగిలాక ఏ మందూ పని చెయ్యదు. జ్వరం తగలక ముందే చికిత్స ప్రారంభించిన వాళ్ళు వైద్యు డిచ్చిన మందుతోనూ, ఆయన చెప్పిన పథ్యపానాలతోనూ జ్వరం రాకుండా చేసుకో గలిగేవారు.

ఒకనాటి ఉదయం పాపన్న బిడ్డకు జ్వరం రాబోతున్న సూచనలు కనిపించాయి. వెంటనే బిడ్డను చక్రవైద్యుడి వద్దకు తీసుకుపొమ్మని పాపన్న భార్య అన్నది. అయితే సమయానికి పాపన్న సొంత బండి లేదు. ఇంకెవరి బిడ్డనో వైద్యు డింటికి తీసుకు పోవలసి వస్తే, పాపన్న తన బండి నిచ్చాడు. అందుచేత వైద్యుణ్ణి తన ఇంటికి పిలుచుకు వచ్చి బిడ్డను చూపించా లనుకున్నాడు పాపన్న.

ఇంతలో పొరుగింటి సోమన్న ఆత్రంగా వచ్చి, "పాపన్నగారూ, మా బిడ్డకు



ఆ పూట జ్వరం వచ్చేటట్టున్నది. చక్ర వైద్యుడి వద్దకు తీసుకుపోయి చూపించాలి. మీ బండి కాస్త ఇస్తారా?" అని అడిగాడు.

పాపన్న తనకు కూడా అదే సమస్య వచ్చిందన్నాడు. "పదండి. పోయి వైద్యుణ్ణి తీసుకు వద్దాం," అన్నాడు సోమన్న.

తనకు తోడు దొరికినందుకు పాపన్న కూడా సంతోషించాడు.

ఇద్దరూ శివపురానికి బయలుదేరారు. కొంత దూరం వెళ్ళినాక సోమన్న, "మనం రోడ్డు వెంబడే పోతే పది మైళ్ళ దూరం. అటు కొండ పక్కగా అడ్డదారిన వెళితే రెండు మైళ్ళు తగ్గుతుంది," అన్నాడు.

"అయితే అడ్డ దారినే పోదాం," అన్నాడు పాపన్న.

ఇంతలోనే రహదారి వెంబడి ఒక గుర్రపు బండి వేగంగా వారిని దాటి వెళ్ళింది. దాన్ని ఒక యువకుడు తోలుతున్నాడు. ఒక యువతి బండిలో కూర్చుని ఉన్నది.

బండి ఎంతో దూరం వెళ్ళకుండానే ఆగిపోయింది. బండిలో ఉన్న స్త్రీ, "అయ్యో సహాయం రండి! సహాయం!" అని ఆర్తనాదం చేసింది.

ఆర్తనాదం వింటూనే పాపన్న బండికేసి పరిగెత్తాడు. సోమన్న వెనుకున్నాడు.

పాపన్న వెళ్ళి చూసే సరికి, బండి తోలుతూ ఉండిన యువకుడు కళ్ళెం వదిలేసి, బండిలో ఒరిగిపోయి, ఛాతి పట్టుకుని మూలుగుతూ, "దాహం! మంట!" అంటున్నాడు.

"ఈయన నా భర్త. ఉన్నట్టుండి సుస్తీ చేసింది. బయలుదేరేటప్పుడు చేసిన భోజనంలో ఏదో వికటించింది. కడుపు నొప్పి, దాహం అన్నాడు. చెంబులో నీళ్ళు అందించాను. బండి కుదుపుకు చెంబు దొర్లి నీరంతా ఒలికిపోయింది. గ్రహచారం చాలక బండి వాడితో పాట్లాడి, తానే







తోలుతూ వచ్చారు. వా డున్నా కానిని నీరు తెచ్చి పెట్టును. మీరు ఈ చెంబుతో కాస్త నీరు తెచ్చి పెట్టి పుణ్యం కట్టుకోండి. మీ మేలు మరిచిపోం," అని బండిలో వున్న ఆడది పాపన్నను బతిమాలింది.

"మనం తొందరగా పోవాలి," అని సోమన్న జ్ఞాపకం చేశాడు. కాని పాపన్న వినిపించుకోకుండా చెంబు తీసుకుని దూరాన కనపడే గుడి కేసి పరిగెత్తాడు.

"ఈ మనిషితో పెట్టుకుంటే అంతే!" అనుకుని సోమన్న, "నేను పోతున్నా నయ్యోయ్!" అని కేకపెట్టి అడ్డ దారిన కాలు సాగించాడు.

పాపన్న శరవేగంతో గుడి చేరుకుని, అక్కడి పూజారి ఇంటినుంచి నీరు తీసుకుని బండి వద్దకు తిరిగి వచ్చాడు. యువకుడు నీరు తాగి కొంచెం తేరుకున్నాడు. కాని అతని కడుపునొప్పి తగ్గలేదు. అతను బండిలో పడుకుని, "నేనింక బండి తోలలేను," అన్నాడు. అతను శివపురం జమీందారు కొడుకు, తన భార్యను ఆమె పుట్టింటి నుంచి తన ఇంటికి తీసుకు పోతున్నాడు.

"మీరు విశ్రాంతి తీసుకోండి. నేను బండి తోలి మిమ్మల్ని ఇంటి దగ్గిర దిగవిడిచి ఆ తరవాత నా పని చూసుకుంటాను," అన్నాడు పాపన్న.

"అందువల్ల మీ పని పాడుకాదు గద?" అన్నది చిన్న జమీందారు భార్య.

"నేను శివపురంలో ఉండే చక్ర వైద్యుడింటికి పోతున్నాను. మా బిడ్డకు విషజ్వరం తగిలి నట్టున్నది," అని చెప్పాడు పాపన్న.

"మేమూ శివపురమే పోతున్నాం గనక మీ కేమీ ఇబ్బంది ఉండదు," అన్నదామె.

పాపన్న బండిని వాయువేగంతో తోలి శివపురం జమీందారుగారింటి ముందు ఆపాడు. జమీందారు కొడుకు భార్యతోసహ





బండి దిగి, ఒక నౌకరును పిలిచి, "వీరిని చక్రవైద్యుడింటికి తీసుకుపో. వైద్యుణ్ణి వీరి వెంట వీరి ఊరికి తీసుకుపోయి, అక్కడి పని పూర్తి అయినాక తిరిగి వైద్యుణ్ణి ఇంటి దగ్గిర దించి రా!" అని పురమాయించాడు.

ఆ బండిలోనే పాపన్న చక్రవైద్యుడింటికి వెళ్ళాడు. జమీందారుగారి బండీ తన ఇంటి ముందాగగానే వైద్యుడు పరిగెత్తు కుంటూ వచ్చి, పాపన్న వచ్చినపని తెలుసు కుని, తనకోసం వేచి ఉన్న రోగులనందరినీ ఉండమని చెప్పి, బండిలో ఎక్కి పాపన్న ఊరికి బయలు దేరాడు. వైద్యుడు వెళ్ళిన కొంత సేపటికి, కాళ్ళు తీపులు పెడుతూ సోమన్న వైద్యుడింటికి చేరు కున్నాడు. అడ్డదారిలో అతనికి ఎదురు దెబ్బలు తగిలాయి, ముళ్ళు గుచ్చుకున్నాయి. ఇంతా శ్రమపడి వస్తే వైద్యుడు బండిలో ఎటో వెళ్ళినట్టు తెలిసింది. ఆయన రాక కెదురు చూస్తూ సోమన్న అక్కడే కూర్చున్నాడు.

ఈ లోపల వైద్యుడు పాపన్న ఇల్లు చేరుకుని, పాపన్న బిడ్డను పరీక్షించి, మందిచ్చి, పథ్య పానాలు చెప్పాడు. తరవాత పాపన్న వైద్యుణ్ణి సోమన్న ఇంటికి తీసుకుపోయి, అతని బిడ్డకూడా మందిప్పించాడు.

వచ్చిన పని అయిపోగానే వైద్యుడు జమీందారుగారి బండిలో తన ఇంటికి తిరిగి వెళ్ళి, బండిని పంపేశాడు.

సోమన్న ఆయనను చూసి తన ఊరూ, పేరూ, తను వచ్చిన పనీ చెప్పాడు.

"నే నిప్పుడు మీ ఊరి నుంచే వస్తు న్నాను. వారి బిడ్డకూ, మీ బిడ్డకూ కూడా మందిచ్చాను," అన్నాడు వైద్యుడు.

పాపన్నను వదిలేసి బయలుదేరి నందుకు తనకు మంచి శాస్తి జరిగిం దనుకుని సోమన్న కాళ్ళీడ్చుకుంటూ దారంతా నడిచి అర్ధ రాత్రి వేళకు ఇల్లు చేరుకున్నాడు.





# గాలివాన

పాపన్న నివసించే ప్రాంతంలో ఆ యేడు వరదలు వచ్చి, నది పక్కన ఉన్న పల్లపు భూములు మునిగిపోయాయి.

పాపన్న ఉండే వీధిలోనే ఉండే వీరన్న అనేవాడు వచ్చి, "ఇదేమిటి పాపన్నా? అందరికీ ఉపకారం చేసేవాడివి, ఇంట్లోనే ఉన్నావేం? గ్రామాలు మునిగిపోయాయట. జనం ప్రాణాలు దక్కించుకుని మెరక ప్రాంతాలకు పోయారట. నువు అక్కడికి పోయి ఉంటా వనుకున్నాను," అన్నాడు.

"ఊళ్ళకు ఊళ్ళే మునిగిపోతే నేనొక్కణ్ణి వెళ్ళి ఏం సహాయం చెయ్యగలను వీరన్నా?" అన్నాడు పాపన్న.

"ఇదేనా నీ పరోపకారం? పోదాం పద. ఏ ఒక్క రిద్దరికైనా చేతనైన సహాయం చేద్దాం," అన్నాడు వీరన్న.

ఇద్దరూ కలిసి వరద ప్రాంతం లోని ఒక గ్రామానికి వెళ్ళారు. ఆ గ్రామం నీటి మధ్య లంక లాగా ఉన్నది. ఆ గ్రామానికి సంబంధించిన వాళ్ళు పడవలలో తమ ఇళ్ళ నుంచి సామాన్లు మెరక ప్రాంతానికి తెచ్చుకుంటున్నారు.

గ్రామం నుంచి బయటపడి మెరక ప్రాంతానికి వచ్చి చేరినవారి కలకలం కూడా జాస్తిగానే ఉన్నది. వారిలో ఒక ఆడదీ, పిల్లలూ పాపన్న కంట పడ్డారు. వాళ్ళు కనిపించిన వాళ్ళ నందరినీ పిలుస్తున్నారు. కాని ఎవరూ వాళ్ళ మాట వినిపించుకోవటం లేదు. పాపన్నా, వీరన్నా వాళ్ళను సమీపించి, "మీకు వచ్చిన కష్ట మేమిటి?" అని అడిగారు.

"అదుగోనండీ, ఆ కనిపించే ఇంటి కప్పు పైన మా తాత చిక్కుకు పోయాడు. నిన్న రాత్రి వర్షం ప్రారంభం కాగానే మమ్మల్ని ముందు పంపేసి, వెనకగా తాను ముఖ్యమైన సామాన్లు తెస్తానని ఉండి





చెంబును ఒంచే సరికి, రంధ్రంలో నుంచి, రంగురంగుల ఇసుకా, చిన్న చిన్న గవ్వలూ బయటికి వచ్చాయి. వా డది చూసి మండి పడి, చెంబును వీరన్న నెత్తి కేసి గురిగా విసిరాడు. వీరన్న ఒక్క కేక పెట్టి పడి పోయాడు. దొంగవా డతన్ని సమీపించి, సోదా చేసి, అతని ఉంగరమూ, చిల్లర డబ్బులూ కాజేసి పారిపోయాడు.

అక్కడ పాపన్న తెచ్చిన చెంబును చూడగానే ముసలాడికి ప్రాణం లేచి వచ్చింది. "ఈ చెంబు మాకు నీటిలో దొరికింది," అన్నాడు పాపన్న.

"మా ఇల్లు నిలబెట్టావు, నాయనా. నా కొడుకు పొరుగూరిలో ఉన్నాడు. ఇల్లు చాలా పాతది. కొత్త ఇల్లు కట్టుకుందా మని, ఈ చెంబులో డబ్బులూ, నగలూ దాచి ఉంచాను. గాలి వాన రావటం చూసి, ఏ మవుతుందో నని భయపడి, నిన్ననే ఈ చెంబుకు మూత పెట్టి సీలు వేశాను. ఇది దొరకటం చాలా మేలయింది. ఇలాటిదే ఇంకో చెంబు కూడా ఉండాలి. అందులో కన్యాకుమారి నుంచి తెచ్చిన రంగుల ఇసుకా, పూసలు, శంఖాలు అవీ, ఉండాలి. అది నేను పూజ చేసుకునే చెంబు," అన్నాడు ముసలివాడు.

పాపన్న వాళ్ళను వదిలి తిరిగి వస్తూం డగా దారిలో వీరన్న కనిపించాడు. అతను లేచి కూర్చుని, తల పట్టుకుని మూలుగు తున్నాడు. అతని పక్కన చెంబున్నది.

"ఈ చెంబు కూడా ఆ ముసలాడిదే!" అంటూ పాపన్న చెంబు తీసుకోవటానికి వంగే సరికి, దొంగవాడి చేతి నుంచి జారి పడిన ముక్కుపుడక కూడా దొరికింది. పాపన్న వాటిని తీసుకుపోయి వృద్ధుడి కిచ్చేసి, తిరిగి వచ్చి, వీరన్నను గ్రామానికి నడిపించుకుపోయి, అతని తలకు తగిలిన గాయానికి మందు వేయించి సూర్యాస్త మయాని కల్లా ఇల్లు చేరుకున్నాడు.





# ఇంటి మహిమ

పాపన్న ఉండే గ్రామంలో గోపన్న అని ఒక గృహస్థు ఉండేవాడు. వారిద్దరూ ఇంచుమించు ఒకే వయసువాళ్ళు. ఒకరి నొకరు చిన్నతనం నుంచీ బాగా ఎరుగుదురు.

వారిద్దరికీ ముఖ్యమైన తేడా ఏమంటే గోపన్నది భారీ అయిన కుటుంబం. అయితే అతని ఆస్తి అంత కుటుంబాన్ని భరించగలది కాదు. అయినప్పటికీ గోపన్న చెయ్యి చాచి ఒకరిని అర్థించకుండా, ఏమీ లోటు లేకుండా సంసారం ఈదుతూ వస్తున్నాడు.

పాపన్న గోపన్న ఇంటికి వెళ్ళినప్పుడల్లా గోపన్న పిల్లలు, "మామయ్యా! మామయ్యా!" అంటూ అతని చుట్టూ మూగేవారు. పాపన్న పళ్ళుగానీ, బంతికలుగానీ, మిఠాయిగానీ ఏదో ఒకటి తీసుకుని మరీ వెళ్ళేవాడు, వాటిని గోపన్న పిల్లలకు పంచిపెట్టేవాడు.

ఒకనాడు పాపన్న గోపన్న ఇంటికి వెళ్ళేసరికి అక్కడ చాలా గొడవగా ఉన్నది. కొన్ని ఏళ్ళ క్రితం గోపన్న బస్తీలో ఉండే ఒక షావుకారు వద్ద పత్రం రాసి వెయ్యి రూపాయలు అప్పు చేశాడు. ఆ బాకీలో ఏ మాత్రమూ చెల్లుబడకపోగా, వడ్డీ మీద వడ్డీ అయి పాపం లాగా పెరిగి, గోపన్న ఇవ్వదేలిన మొత్తం రెండు వేలై కూర్చుంది. గోపన్న బాకీ తీర్చలేడనీ, ఇంక ఆలస్యం చేస్తే గోపన్న హామీ పెట్టిన ఆస్తి కన్న బాకీ ఎక్కువవుతుందనీ అనుకుని షావుకారు గోపన్న ఆస్తికి జప్తు తెచ్చాడు. ఈ రోజు అతను గ్రామాధికారి మొదలైన వాళ్ళను వెంటబెట్టుకుని గోపన్న ఆస్తి స్వాధీనం చేసుకోవటానికి వచ్చాడు.

పాపన్న వచ్చేసరికి గోపన్నా, అతని భార్యా, తల్లీ, పిల్లలూ ఇంటి వెలపలే వున్నారు. "ఎవరికీ తెలియకుండా ఎంత పని చేశావురా?" అని గోపన్నను తల్లి తిట్టిపోస్తున్నది.







ఉన్నాడు. అదీగాక అతనికి గ్రామంలో కొంత ఆస్తి సంపాదించి, గ్రామ జీవితం గడపాలని ఉన్నది. బస్తీలో వాళ్ళ వ్యవహారాలన్నీ చూడటానికి షావుకారు తండ్రి ఉన్నాడు, తమ్ముడు కూడా ఉన్నాడు.

పాపన్న షావుకారుతో చెప్పవలిసిన మాట ఒకటి చెప్పి, గోపన్న వద్దకు వచ్చి, "ఇల్లు వదిలి ఎక్కడ ఉంటావు? పదండి ఇంట్లోకి. నే నుండగానే పంచ లేకుండా పోదా మను కున్నావా?" అన్నాడు. అతను గోపన్న పిల్లలను దగ్గిరికి పిలిచి, వారందరికీ తాను తెచ్చిన తినుబండారాలు పంచి ఇచ్చి, "హాయిగా వెళ్ళి ఆడుకోండి," అన్నాడు.

గోపన్న కళ్ళనీళ్ళ పర్యంతమై, "పాపన్నా, పూర్తిగా మునిగిపోయిన వాణ్ణి నువేం కాపాడగలవు? జరిగేదేదో జరగనీ! ఈ అప్పు తీరేది కాదు. ఇవాళ కాకపోతే రేపైనా నా యిల్లూ, పొలమూ అప్పులవాళ్ళ పాలు కావలిసిందే!" అన్నాడు.

"అదంతా నువు నాకు చెప్ప నవసరం లేదు. నువి ఇల్లు విడిచి పెడితే నా పైన ఒట్టే!" అన్నాడు పాపన్న గోపన్నతో.

అతను షావుకారునూ, మిగిలినవాళ్ళనూ వెంటబెట్టుకుని తన యింటికి వచ్చాడు. అతను వాళ్ళతో గోపన్న బాకీ తాను చెల్లు

షావుకారు, "ఇంకెంత కాలమని ఆగేది? ఎన్ని సార్లో బాకీ మాట జ్ఞాపకం చేశాను. పోయినకొద్దీ వడ్డీ పెరిగిపోతూండె. ముందు ఇల్లు ఖాళీ చేసెయ్యండి," అంటున్నాడు.

పాపన్న ఈ సమయంలో రావటం గోపన్న కేమీ ఇష్టం లేదు. ఎందుకంటే పాపన్న ఏదో విధంగా అడ్డుపడకుండా ఉండడు. అలా సహాయం పొందటం గోపన్న కిష్టం లేదు.

పాపన్న షావుకారునూ, గ్రామాధికారినీ అవతలకు తీసుకుపోయి మాట్లాడి విషయమంతా తెలుసుకున్నాడు. తన బాకీ వసూలు చేసుకోవాలని షావుకారు చాలా పట్టుదలగా





వేస్తానని అన్నాడు. కాని అతని వద్ద అంత డబ్బు లేదు. అతనికి అప్పు లిచ్చేవాళ్ళు కూడా లేరు. ముందు వెనకలు చూడకుండా దగ్గిర ఉన్నదంతా తుడిచిపెట్టి ముక్కూ మొహమూ ఎరగని వాళ్ళకు సైతం ఇచ్చేసే పాపన్నకు అప్పు ఎవరిస్తారు? అందుచేత పాపన్నకు కీర్తి తప్ప పరపతి ఏమీ లేదు.

షావుకారు కూడా పాపన్నతో, "మీ రెలా చేసినా నా ఇష్టమే. కాని ఈ ఋణం ఇవాళ తీరిపోవాలి. రొక్కమయినా ఇవ్వండి, లేక పోతే, అదే విలువ గల ఆస్తయినా ఇవ్వండి," అన్నాడు.

"అలాగే కానివ్వండి. నా ఇల్లూ, పొలమూ రాసి ఇచ్చేస్తాను. నా ఆస్తి గోపన్న ఆస్తికి ఒక్క పిసరు హెచ్చే ఉంటుంది. అది తీసుకుని గోపన్న ఋణ పత్రం రద్దు చేసి ఇచ్చెయ్యండి," అన్నాడు పాపన్న.

షావుకారు అందుకు సంతోషంగా సమ్మతించాడు. నిజానికి గోపన్న ఆస్తి కన్న పాపన్న ఆస్తే కాస్త హెచ్చు విలువ గలది.

పాపన్న ఇల్లూ, పొలమూ తన పేర రాయించుకుని షావుకారు అతనికి అదనంగా ఒక వందరూపాయలు రొక్కం ఇచ్చాడు.

ఈ తతంగం పూర్తి కాగానే పాపన్న సకుటుంబంగా తన అత్తవారి ఊరు వెళ్ళి



పోయాడు. అతని భార్య మీనాక్షి తల్లిదండ్రులకు ఒకే బిడ్డ. అందుచేత పుట్టింటి తాలూకు ఆస్తి అంతా ఆమెదే. వారికి కూడా ఒక ఇల్లూ, కొంత పొలమూ ఉన్నాయి.

ఇల్లు వదిలి పోయేటప్పుడు పాపన్నతో అతని తల్లి, "ఒకనాడు ఈ గతి తెచ్చి పెడతావని నే ననుకుంటూనే ఉన్నానురా!" అన్నది.

"ఇప్పుడేం మునిగిపోయిందమ్మా? ఒకరికి మేలు చేస్తే మనకూ మేలే జరుగుతుంది," అన్నాడు పాపన్న.

షావుకారు తన భార్యతోనూ బిడ్డలతోనూ వచ్చి పాపన్న ఇంట ప్రవేశించాడు. అది







మొదలు షావుకారు వైఖరిలో మార్పు కలిగింది. అతను పాపన్న ఇంటికి మరమ్మత్తు చేయించి, కొత్త గదులూ, వసారా కట్టించి, కూలి వాళ్ళకు ఇవ్వవలిసిన దాని కన్న బాగా హెచ్చు కూలి ఇచ్చాడు. అదిమొదలు అతను నిత్యమూ దాన ధర్మాలు చేస్తూ, ఎరగని వాళ్ళను సైతం ఆదుకుంటూ దాన కర్ణుడని త్వరలోనే కీర్తి పొందాడు. ఆ గ్రామంలో వాళ్ళు ఈ షావుకారు గురించి ఒట్టి పిసినారి అనీ, డబ్బు కోసం నానా గడ్డి తింటాడనీ విని ఉన్నారు. అందుచేత అతని దాతృత్వాన్ని కళ్ళారా చూసి వాళ్ళు చాలా ఆశ్చర్యపడ్డారు.

పాపన్న వెళ్ళిపోతున్నాడంటే పరోపకారమే వెళ్ళిపోతున్నదని విచారించిన వాళ్ళకు ఈ షావుకారు పాపన్న కన్న కూడా మెరుగనిపించాడు. ఎందుకంటే, ఇద్దరూ పరోపకార పారీణులే అయినా, పాపన్న ధనికుడు కాడు, హెచ్చుగా శ్రమదానం చేసేవాడు. ఈ షావుకారు దగ్గిర పుష్కలంగా డబ్బున్నది, ధన సహాయం చెయ్యటానికి వెనకాడడు.

అయితే కొద్ది రోజుల కల్లా ఒక పుకారు బయలుదేరింది. ఈ షావుకారు స్వతః దాతృత్వం కలవాడు కాడనీ, పాపన్న ఇంట ప్రవేశించిన తరవాతనే అతనిలో ఈ దాతృత్వం పుట్టుకొచ్చిందనీ, దానికి అసలు కారణం పాపన్న ఇల్లేననీ, అందులో ఏదో మహిమ ఉన్నదనీ జనం చెప్పుకోసాగారు.

బస్తీలో ఉంటున్న షావుకారు తండ్రికి తన కొడుకు కీర్తి గురించీ, అందుకు జనం చెప్పుకుంటున్న కారణం గురించీ ఒక్కసారిగానే తెలియ వచ్చింది. తన కొడుకు పల్లెటూరు చేరి ఎర్రపైగాని సంపాదించక పోగా, ఉన్నదంతా ఎడాపెడా దానధర్మాల కింద ఖర్చు చేసి దానకర్ణుడని పేరు సంపాదించుకుంటున్నాడని విని ఆ పెద్దమనిషికి మతి పోయినట్టయింది. తన కొడుకలా మారి





పాపటానికి కారణం అతను ఉంటున్న ఇల్లే నని విని, ఆయన తన కొడుకు వద్దకు వెళ్ళి, "నువ్వు తక్షణం ఈ ఇల్లు అమ్మేసి బస్తీకి వచ్చెయ్యి. లేకపోతే ఉన్నదంతా ఊడ్చిపెట్టుకు పోతుంది," అన్నాడు.

ఆ ఇల్లు తనకు చాలా సుఖంగా ఉన్న దని, పరోపకారం చెయ్యటం ద్వారా తనకు అంతులేని ఆనందం కలుగుతున్నదని షావుకారు తండ్రికి చెప్పి చూశాడు. అత నలా అనటం వల్ల తండ్రి ఆదుర్దా మరింత హెచ్చింది. తన కొడుకు ఆ గ్రామంలో ఒక్క క్షణం కూడా ఉండటానికి వీల్లేదని చెప్పి ఆయన అతన్ని అప్పటి కప్పుడే పెళ్ళాం బిడ్డలతో సహా బస్తీకి ప్రయాణం కట్టించాడు.

షావుకారు స్వాధీన పరుచుకున్న పాపన్న ఇల్లూ, పొలమూ అమ్మటానికి చేసిన ప్రయత్న మంతా వృథా అయింది. ఎందు కంటే ఆ ఇంట అడుగు పెట్టిన వాళ్ళు త్వరలోనే ముష్టి చెంబు పట్టుకుంటారని ప్రవాదు పడిపోయింది. ఆ కారణం చేత దాన్ని కొనటాని కెవరూ సాహసించి ముందుకు రాలేకపోయారు.

"ఆ ఇల్లు మర్యాదగా పాపన్నకే తిరిగి ఇచ్చెయ్యండి. దాన్ని మరెవరూ కొనరు. అందులో ఊరికే ఉండమన్నా ఎవరూ ఉండరు," అని గ్రామాధికారి షావుకారు తండ్రికి సలహా ఇచ్చాడు. షావుకారు తండ్రి గ్రామాధికారిని వెంటబెట్టుకుని పాపన్న అత్తవారి ఊరు వెళ్ళి, "బాబూ, నీకూ నీ ఆస్తికీ ఒక నమస్కారం. అదంతా నువే తిరిగి పుచ్చుకో. అది మాకు అచ్చిరాలేదు," అని చెప్పాడు.

పాపన్న తిరిగి తన గ్రామం చేరుకుని తన ఇంట్లో ప్రవేశించాడు. అతనికి కలిగిన నష్టమేమీ లేదు; ఇల్లు చక్కగా మరమ్మతు కావటమేగాక మరింత పెద్దదికూడా అయి, ఉండటానికి మహా సుఖంగా ఉన్నది!





# రథోత్సవం

పాపన్న ఉండే గ్రామంలో ఏటా శివరాత్రికి రథోత్సవం జరుగుతుంది. ఆ ఉత్సవంలో ఊళ్ళో ప్రతి ఒక్కరూ పాల్గొనటమే కాకుండా పొరుగు గ్రామాల నుంచి కూడా విశేషంగా జనం వస్తారు. రథోత్సవం చాలా వైభవంగా జరుగుతుంది.

ఈ ఉత్సవ కార్యాలలో మామూలుగా పాపన్న కూడా పాల్గొంటూ ఉండే వాడు. కాని ఈ యేడు దేవాలయ నిర్వాహకులు ఆతన్ని దూరంగా ఉంచారు. వారికి పాపన్న చర్యలు కొన్ని నచ్చలేదు.

ఆ ఊళ్ళో బండయ్య అనే భ్రష్టు డొకడున్నాడు. వాడు సంఘ నియమాలను ఖాతరు చెయ్యక, చెయ్యరాని పనులన్నీ చేసి, తన బంధువులకు కూడా వెలి అయ్యాడు. వాడంటే ఊళ్ళో చాలా మందికి భయం, అందరికీ అసహ్యం. వాణ్ణి అందరూ పాపిష్టి బండయ్య అనే వారు. లోకానికి వెలి అయినాక వాడు కేవలమూ పాపకార్యాలు చేసే బతక వలిసి వచ్చింది. దేవుడు కూడా వాణ్ణి బహిష్కరించినట్టే ప్రజలు భావించారు; ఎందుకంటే, వాడికి కలిగిన సంతానంలో ఏ ఒక్క బిడ్డా ఏడాది నిండే దాకా బతకలేదు.

బండయ్య కిప్పుడు అరవై ఏళ్ళు. శక్తులన్నీ ఉడిగిపోయాక వాడు తన గత జీవితాన్ని పొరబానుకుని, తన కిక భగవంతుడు తప్ప మరే దిక్కూ లేదని విశ్వయించుకున్నాడు. వాడు ఆలయానికి వెళ్ళి దేవుడికి దణ్ణం పెట్టుకుని ధ్యానం చేస్తూండగా, ఊళ్ళోవాళ్ళు చూసి, "దొంగముండా కొడుకు! దేవుడి సొమ్ము మీద మళ్ళీ వీడి కన్ను పడింది!" అంటూ వాణ్ణి గుడిలో నుంచి బయటికి తరిమి, గట్టిగా తన్నారు.

బండయ్య భక్తిని ఊళ్ళోవాళ్ళు ఎలా నమ్ముతారు? వాడు అదివర కొకసారి







భక్తుడి లాగా నటించి దేవుడి సొత్తు కాజేసి దొరికిపోయాడు.

తన్నులు తిని వీధిలో పడిపోయి, "ఓయి, దేవుడా! నువే దిక్కు!" అని మూలుగుతున్న బండయ్యా పాపన్న కంట పడ్డాడు. పాపన్న బండయ్యాను లేవదీసి, అతని ఇంటికి చేర్చి, కొంత డబ్బిచ్చి, "నీ కెప్పుడన్నా సహాయం కావలిస్తే నన్ను అడుగు, బండయ్యా!" అన్నాడు. అయితే బండయ్యా ఎన్నడూ పాపన్నను సహాయం అడిగాడు కాడు.

ఊరు ఊరంతా మహాపాపిగా ఎంచే బండయ్యాను పాపన్న ఆదుకోవటం ఊళ్ళో పెద్దలకు నచ్చలేదు. తన్నులు తిన్నవాణ్ణి ఆదరించి తీసుకుపోవటం ఒక విధంగా తన్నిన వాళ్ళను పాపన్న విమర్శించినట్టే గద! ఈ పని చేసిన పాపన్నను రథోత్సవ కార్యక్రమాలలో చొరనివ్వరాదనీ, చివరకు అతను రథం తాడు పట్టినా దేవుడు మైల పడిపోతాడనీ దేవాలయ నిర్వాహకులు నిశ్చయించుకున్నారు.

ఇది చూసి పాపన్న చాలా నొచ్చుకున్నాడు. అతను తాను చేసిన తప్పేమిటని ఆలయ నిర్వాహకుల నడిగి తెలుసుకుని, "నే చేసినది తప్పయితే ప్రాయశ్చిత్తం చెప్పండి. అంతేగాని నన్ను దేవ కార్యం నుంచి వెలి వెయ్యవద్దు," అన్నాడు.

అపరాధం కింద కొంత సొమ్ము చెల్లిస్తే చేసిన పాపానికి ప్రాయశ్చిత్త మవుతుందని పెద్దలు నిర్ణయించారు. పాపన్న ప్రాయశ్చిత్తం చేసుకుని రథం తాడుపట్టే అర్హత సంపాదించుకున్నాడు.

శివరాత్రి నాడు ఆలయం నుంచి రథం బయలుదేరింది. అది నాలుగు వీధులూ చుట్టి తిరిగి ఆలయానికి వచ్చేస్తుంది. దారి పొడుగునా ఇళ్ళ ముందు వీధి ఊడ్చి, నీళ్ళు చల్లి, ముగ్గులుపెట్టారు, తోరణాలు కట్టారు. రథం కొద్దిదూరం వచ్చిందో లేదో,





"ఆగండి! ఆగండి!" అన్న కేకలు మిన్ను ముట్టాయి. రథం ఆగిపోయింది.

జరిగిన దేమంటే రథం అంత దూరంలో ఉండగానే ఒక ముసలివాడు నడి వీధిలోకి వచ్చి, భక్తి పారవశ్యంలో రథం మీది దేవుణ్ణి చూస్తూ స్తంభంలా నిలబడి, తీరా రథం దగ్గిరికి వచ్చేసరికి చాపచుట్టలా సాష్టాంగం పడిపోయాడు. పడిపోయేదాకా ఆ మనిషి నెవరూ గమనించనే లేదు. పడిపోయాక ఒక్కసారిగా గొల్లున అరిచారు.

పడిపోయిన మనిషిని తాకటానికి, ఎత్తి ఒక పక్కకు తీసుకుపోయి రథానికి దారి చెయ్యటానికి సాహసించిన వారు లేక పోయారు. పాపన్న మటుకు, ఎవరో పడి పోయారన్న కేకలు వింటూనే రథం మోకు వదిలేసి ముందుకు వచ్చి, పడిపోయిన ముసలివాణ్ణి లేవనెత్తి నిలబెట్టబోయామని ప్రయత్నించాడు. కాని, పాపన్న ఎత్తినది శవాన్ని! బండయ్య శవాన్ని!

రథం ముందు పడిపోయినది బండయ్య అని తెలియగానే రథోత్సవం సాగిస్తున్న పెద్దలు, "ఈ పాపిష్ఠి వెధవ ఇక్కడ మళ్ళీ దాపరించాడా? ఎంత ఘోరం! వీడి శవాన్ని దూరంగా తీసుకుపోయి అవతల పారేసి, వాడు పడిపోయిన చోటు పవిత్రం చేయించండి," అన్నారు.





'' అందరూ పుణ్యకార్యంలో నిమగ్నులై ఉన్నవారే. నే నెలాగూ శవాన్ని తాకి మైల పడనే పడ్డాను. నేనే బండయ్య కళేబరాన్ని వా రింటికి చేరుస్తాను. ఈ లోపల మీరు పుణ్యాహ వాచనమూ అదీ జరపండి. రథాన్ని కదిలించే లోపుగా నేను మైల స్నానం చేసి వచ్చి కలుసుకుంటాను,'' అన్నాడు పాపన్న.

ఆలయ నిర్వాహకులైన పెద్ద లీ మాట విని, '' పాపన్నా, ఇప్పటికి నువు చేసినది చాలు. నిన్ను రథం తాడు పట్టనివ్వటం వల్లనే దేవు డిలా చేశాడు; ఈ అశౌచ మంతా జరిగింది! ఈసారి నువు ఘోర ప్రాయశ్చిత్తం చేసుకున్నా నిన్ను దైవకార్యంలో వేలుపెట్టనివ్వం. నీ దారిన నువు వెళ్ళు, మా తిప్పలు మేం పడతాం,'' అన్నారు.

పాపన్న చాలా బాధపడుతూ నిట్టూర్చి, బండయ్య శవాన్ని భుజాన వేసుకుని బండయ్య ఇంటికి వెళ్ళాడు. బండయ్య భార్య తన భర్త శవాన్ని చూసి, కన్నీరు కారుస్తూ, ''పుణ్యాత్ముడు దేవుడిలో ఐక్యం అయిపోయాడు!'' అన్నది.

ఆమె పాపన్న కొక వింత విషయం చెప్పింది. బండయ్య కిందటేడు దేవుడికి మొక్కుకున్నాడట; తనకు కలిగిన ఆఖరు బిడ్డ ఏడాది దాటి బతికితే తాను రథోత్సవం నాడు రథం కిందపడి బలి అవుతానన్నాడట. ఆ బిడ్డ ఏడాదిలోపు చావక బతికింది. అప్పుడు బండయ్య తన భార్యతో తన మొక్కు గురించి చెప్పేశాడు.

'' అదేం మొక్కుబడి? రథం కిందపడి చచ్చి ఉత్సవమంతా పాడుచేస్తావా?'' అని భార్య మందలించింది.

'' నిజమేనే! నాకా సంగతి తట్టలేదు. తెలీక మొక్కుకున్నానని దేవుడికి అపరాధం చెప్పివస్తాను,'' అని భార్యతో అని బండయ్య రథోత్సవం జరిగేచోటికి బయలుదేరి వెళ్ళాడు. అతని శవం ఇంటి కొచ్చింది.



"నా మొగుడు దేవుడికి ప్రాణం అర్పింతా మనుకున్నాడు. అర్పించాడు! ఎవరాపగలరు?" అన్నది బండయ్య భార్య.

"అమ్మా, బండయ్యను గురించి నాకు నిజం తెలుసు. లోకం ఆ మహానుభావుణ్ణి గురించి తప్పుగా అనుకుంటున్నది. ఎవరే మనుకుంటేనేం? నిజం తెలుసుకునే దేవుడు లేడా? బండయ్యకు ఉత్తరక్రియలు నేనే జరిపిస్తాను," అని బండయ్య భార్యకు చెప్పి, రథోత్సవం మాటే మరిచిపోయి, పావన్న ఆ పనిలో నిమగ్నుడయిపోయాడు.

ఈ లోపల రథం ఆగినచోట బ్రాహ్మలు పెద్ద తతంగం జరిపి, బండయ్య పడి పోయిన చోటు శుద్ధి చేసి, ప్రోక్షించి, మంత్రాలు చదివి, ఇక రథాన్ని ముందుకు నడవనివ్వమన్నారు.

"హరహరా!" అంటూ భక్తులు రథం తాళ్ళు పట్టుకు లాగారు. కాని ఏ కారణం చేతనో రథం ఒక్క అరంగుళమైనా కద లక భూమికి అంటుకు పోయినట్టు కన బడింది.

ఒక గంట గడిచింది. రెండు గంటలు గడిచాయి. రథం కదలదు!

"దేవుడాగ్రహించాడు! ఆగ్రహించకేం చేస్తాడు? ఆ పావన్నని తాడు పట్టనిచ్చాం. ఆ పాపిష్టివాడు రథాని కెదురుగా వచ్చి చచ్చాడు, ఉత్సవం అన్ని విధాలా అపవిత్రమైపోయింది!" అన్నారు దేవుడి పెద్దలు. ఇంతలో రథం ముందు హారతి పళ్ళెం పట్టుకున్న పూజారికి పూనకం వచ్చింది. దేవుడు పలుకుతాడని అందరూ ఆత్రంగా ఉన్నారు. పూజారి చుట్టూ జనం గుమికూడి తోసుకో సాగారు.

"ఆ పావన్నను పిలుచుకు రండి! పావన్న తాడు పట్టితేగాని రథం కదలదు," అన్నాడు పూజారి పూనిన ఆవేశంలో.

పెద్దలు నోరు తెరుచుకుని ఒకరి నొకరు చూసుకున్నారు.





"పాపన్నను పిలుచుకు రండి. వెంటనే పిలుచుకు రండి!" అని పూజారి కేకలు పెడుతున్నాడు.

రథోత్సవ నిర్వాహకులైన పెద్దలు అందరూ కలిసి పాపన్న కోసం అతని ఇంటికి వెళ్ళారు.

పాపన్న రథోత్సవం దగ్గిరే ఉన్నాడని పాపన్న భార్య అన్నది. వాళ్ళు బండయ్య ఇంటికి వెళ్ళారు. బండయ్య భార్య కళ్ళు తుడుచుకుంటూ, "పాపన్నగారు శ్మశానంలో ఉన్నారు. నా మొగుడికి దహనం జరిపిస్తున్నారు," అన్నది.

పెద్దలు శ్మశానానికి వెళ్ళారు. పాపన్న శ్మశానంలో చితి దగ్గిర నిలబడి ఏదో ధ్యానంలో ఉన్నాడు.

"పాపన్నా, మా వల్ల అపరాధం జరిగిపోయింది. నువ్వు వెంటనే వచ్చి తాడు పట్టుకోవాలి, 'ఇవాళ రథం కదలాలి," అన్నారు దేవుడి పెద్దలు.

రథం కదలని సంగతి పాపన్న ఎరగడు. వాళ్ళకు తన పైన దురభిప్రాయం పోయి అనుగ్రహం కలిగిందనుకుని అతను, "ఇంకా మైల స్నానం చెయ్యనే లేదు. ప్రాయశ్చిత్తం చేసుకోలేదు. ఈ సారికి నన్ను వదిలెయ్యండి. దేవు డనుగ్రహిస్తే పై రథోత్సవంలో నాకు చేతనైన కైంకర్యం చేస్తాను," అన్నాడు.

పెద్దలు అతనికి రథం గురించీ, పూజారి పూనకం గురించీ చెప్పి అతన్ని ఉన్న పాళంగానే రమ్మని బతిమాలారు.

పాపన్న పరిస్థితి అర్థంచేసుకుని, ఆశ్చర్య పడి, బండయ్య చితికి ప్రదక్షిణ చేసి, తన కోసం వచ్చినవారి వెంట వెళ్ళాడు. బండయ్య పడిపోయినప్పు డెక్కడ ఉన్నదో రథం ఇంకా అక్కడే ఉన్నది.

పాపన్న వచ్చి ఆ మైల బట్టలతోనే రథం తాడు పట్టుకున్నాడు. వెంటనే రథం కదిలింది.





# కుక్క బుద్ధి - మనిషి బుద్ధి

పొరుగూరి జమీందారు ఇంట పెళ్ళి వచ్చింది. పాపన్న ఉండే ఊరి కరణం పెళ్ళికి వెళుతూ పాపన్నను కూడా తోడుగా వెంట తీసుకుపోయాడు.

పెళ్ళికి మరొక గ్రామం నుంచి ఒక పండితుడు కూడా వచ్చాడు. నిజాని కాయనది మిడిమిడి పాండిత్యం. అయితే వాళ్ళ ఊరు చుట్టు పక్కల ఆ మాత్రం తెలిసిన వాడు కూడా లేకపోవటంచేత గొప్ప పండితుడుగా చెలామణీ అవుతున్నాడు. ఆయన పెళ్ళి జరుగుతున్న చోట తన పాండిత్యం ప్రదర్శించటానికి విశ్వప్రయత్నాలు చేశాడు, కాని అతడి ఎత్తులు ఎవరి పైనా పారలేదు.

పెళ్ళి పూర్తి అయాక జమీందారు అనేక మందికి ఖరీదైన ఉన్ని శాలువలు బహూకరించాడు. వాటి పైన జమీందారు పేరు కుట్టి ఉన్నది. లోగడ రాజసన్మానం పొంది ఉన్నవాడు కావటంచేత పాపన్నకు కూడా ఒక శాలువ ముట్టింది. కాని మిడిమిడి పండితుడికి శాలువ రాలేదు. అనేకమంది పండితులకు శాలువలు ముట్టటం చూసి ఈ పెద్దమనిషి ఆశాభంగం పొందాడు.

పాపన్న శాలువ పుచ్చుకుని కరణం వద్దకు వచ్చి కూర్చుని, "నీతో రావటం మేలే అయింది. ఆరోజు కారోజు చలి ముదురుతున్నది. ఒక శాలువ కొందామా అనుకుంటున్నాను. ఆ బాధ తప్పిపోయింది," అన్నాడు.

ఆ సమీపంలోనే కూర్చుని ఉన్న మిడిమిడి పండితుడు, పాపన్న ఆహ్వానం కూడా లేకుండా వచ్చిన వాడనీ, అతనికి ఆ శాలువ అక్రమంగా వచ్చిందనీ అనుకున్నాడు. పాపన్న తీసుకున్నది ఆఖరు శాలువ. అది పాపన్న కివ్వని పక్షంలో తనకు వచ్చేదని కూడా ఆయన అనుకున్నాడు. ఎందుకంటే



తాను పండితుడనే ఉద్దేశంతోనే తనను పెళ్ళికి ఆహ్వానించారు.

పాపన్నది ఏ ఊరు, ఏం పని అన్న విషయాలు పక్కవారి నుంచి అడిగి తెలును కుని ఆ పండితుడు, పాపన్న శాలువ కాజేసి తన పరువు నిలబెట్టుకోవాలనే ఉద్దేశంతో, అతన్ని కాస్సేపు పొగడి, తమ గ్రామానికి రావలసిందిగా ఆహ్వానించాడు.

"నేను కరణంగారికి తోడుగా వచ్చాను. అందుచేత ఇప్పుడు రాలేను. మరొకసారి చూద్దాం," అన్నాడు పాపన్న పండితుడితో.

"అలా అయితే వచ్చే దశమినాటికి రండి. ఆ రోజు మా ఇంట సమారాధన చేసుకుంటున్నాం," అన్నాడు పండితుడు. పాపన్న సరేనన్న మీదట పండితుడు తన గ్రామం పేరూ, పాపన్న గ్రామం నుంచి దగ్గిర దారి వివరించి చెప్పాడు.

పండితుడు తన గ్రామం చేరగానే, జమీందారుగారు ఏమిచ్చారని ఊళ్ళో వాళ్ళంతా అడిగారు. జమీందారుగారు తనను చాలా మెచ్చుకున్నారనీ, తన కొక ఉన్ని శాలువ బహూకరించారనీ, దాన్ని ఒక స్నేహితుడికి అరువిచ్చాననీ, దశమి నాటి కతను దాన్ని తెచ్చి ఇస్తానన్నాడనీ బొంకి, పండితుడు ఊరి వాళ్ళ దగ్గిర తన పరువు నిలబెట్టుకున్నాడు.

అష్టమినాడే పాపన్న పండితుడి ఊరికి బయలుదేరాడు. ఎందుచేతనంటే ప్రయాణం ఒక్క రోజులో పూర్తికాదు. దారిలో తిండి కూడా సరిగా అమరదు. రాత్రి వేళ చలి మరీ జాస్తిగా ఉంటున్నది. అందుచేత పాపన్న జమీందారిచ్చిన శాలువ మీద కప్పుకుని, ఇన్ని అటుకులూ పెరుగూ కలిపి మూట కట్టుకుని వేకువజామునే ప్రయాణమైనాడు.

ఆ రోజల్లా ప్రయాణం చేసి పాపన్న ఆ రాత్రికి ఒక గ్రామం చేరుకుని, అక్కడ సత్రంలో పడుకున్నాడు. అక్కడి నుంచి





అతను ఇంకా జాము రాత్రి ఉండనగా బయలుదేరి కొద్ది దూరం వచ్చేసరికి ఒక చోట మనిషి మూలుగుతూ ఉండటం విన పడింది. ఆ సమయంలోనే కుక్క కూడా అరిచింది.

పాపన్న దగ్గిరగా వెళ్ళి చూసేసరికి ఒక మనిషి బాగా దెబ్బలు తిని పడి ఉన్నాడు. పక్కనే అతని కుక్క కుంయి, కుంయి మంటున్నది. పడి ఉన్న మనిషి ఒంటిన అంగవస్త్రం తప్ప ఏమీ లేదు. అతను చలికి బిగుసుకుపోయి వణుకుతున్నాడు.

పాపన్న ఆ మనిషిని లేపి కూర్చోబెట్టి, తాను కప్పుకున్న శాలువ తీసి ఆ మనిషికి కప్పాడు. కొద్ది సేపటికి ఆ మనిషికి కాస్త ప్రాణం వచ్చినట్టయింది; "ఆకలి," అన్నాడు.

తాను తెచ్చుకున్న అటుకుల చద్దిలో సగం కిందటి రోజు ప్రయాణంలో పాపన్న తినేశాడు. ఈ రోజు ప్రయాణానికి సరిపడేది అతని వద్ద ఇంకా ఉన్నది. పాపన్న అది తీసి ఆ మనిషికి పెడుతూ, అందులో కొంచెం కుక్కకు కూడా వేశాడు. తరవాత అతను ఆ మనిషిని, "ఏం జరిగింది? ఎందు కిక్కడ ఇలా పడి ఉన్నారు?" అని అడిగాడు.

"ఏం చెప్పేది, బాబూ? నా తల రాత!" అన్నాడా మనిషి.



పాపన్న ఆ మనిషి సమాధానానికి ఆశ్చర్యపోయి, ఇంకేమీ అడగకుండా, తాను సాయంపట్టి అతన్ని వాళ్ళ ఇంటి దాకా తీసుకుపోయాడు. ఆ ఇల్లు పాపన్న విడిచి వచ్చిన గ్రామంలోనే ఉన్నది.

పాపన్న తలుపు తట్టితే ఆ మనిషి భార్య తలుపు తెరిచింది. "మీరు మళ్ళీ ఇటే వస్తారుగా?" అంటూ ఆ మనిషి లోపలికి పోయి తలుపు వేసుకున్నాడు.

ఆ మనిషి ప్రవర్తన పాపన్నకు వింతగా కనపడిందే గాని, అతనికి ఒకరిని విమర్శించే అలవాటు లేదు. అందుచేత అతను ముందుకు సాగి వెళ్ళాడు.







దారిలో పాపన్నకు తిండి లేదు. సూర్యాస్తమయం కాగానే చలి హెచ్చింది. కొంచెం పొద్దుపోయి అతను పండితుడి గ్రామం చేరి, ఇల్లు కనుక్కుని వారింటికి వెళ్ళాడు. శాలువ లేకుండా వచ్చిన పాపన్నను చూసి పండితుడు, "ఇదేమిటి? ఇంత చలిలో శాలువ అయినా కప్పుకోకుండా ప్రయాణం చేశారా?" అన్నాడు.

"శాలువ తెచ్చుకున్నాను. కాని దారిలో అది ఒకందుకు వినియోగమయింది లెండి. సమారాధన రేపే గాబోలు. ఏవైనా పనులుంటే చెప్పండి, చేసిపెడతాను," అన్నాడు పాపన్న.

"సమారాధనా? అది ఒక నెల వాయిదా పడింది. తలవని తలంపుగా నా భార్యకు రోగం పెట్టుకొచ్చింది," అంటూ పండితుడు ఇంటి లోపలికి తొంగి చూశాడు.

మరు క్షణమే పాపన్నకు ఆడదాని మూలుగు గట్టిగా వినిపించింది. పండితుడి పిల్లలిద్దరు నోట్లో వేళ్ళు వేసుకుని పాపన్న కేసి కన్నార్పకుండా చూస్తూ దిగాలుపడి నిలబడి ఉన్నారు.

"అయ్యో! అలాగా? అయితే ముందామె విషయం చూడండి," అన్నాడు పాపన్న అదుర్దాగా.

పండితుడు లోపలికి వెళ్ళి తన భార్యతో, "ఆయన అది తీసుకు రాలేదు!" అన్నాడు.

"అయితే నాకీ మూలుగు కూడా దేనికి?" అన్నది భార్య, లేచి కూర్చుంటూ.

"ఆయన వెళ్ళిపోయిన దాకా కాస్త పడుండవే!" అన్నాడు పండితుడు.

పండితుడి వెనకనే లోపలికి వెళ్ళిన పాపన్నకీ సంభాషణ వినిపించింది గాని, భార్యా భర్తలు దేని విషయం మాట్లాడుతున్నదీ తెలియలేదు. పండితుడు మటుకు తాను వెళ్ళిపోవటం కోసం ఎదురు చూస్తున్నట్టు అతను గ్రహించాడు. అతను పండితుడితో, "చూడండి, నా కోసం మీరేమీ







శ్రమ పడకండి. నే నీ రాత్రికి ఎక్కడో తల దాచుకుని తెల్లవారి మా గ్రామం వెళ్ళి పోతాను," అన్నాడు.

పండితుడు అతన్ని ఉండమన లేదు. పాపన్న శాలువ లేకుండా రావటంతో ఆయన ఎత్తు కాస్తా పాడైపోయింది.

పాపన్న ఆ రాత్రి గ్రామ చావడిలో పడుకుని, తెల్లవారుజామున బయలుదేరి మర్నాడు చీకటి పడే వేళకు తాను శాలువ దానం చేసిన వా డుండే ఊరు చేరుకున్నాడు.

అప్పటికి రెండు రోజులుగా పాపన్నకు తిండి లేదు. దాని పైన చలికి గురి అయాడు. జ్వరం తగిలినట్టుగా ఉన్నది. ఆ రాత్రికి శాలువ తీసుకున్న వాడి ఇంట ఇంత ఎంగిలిపడి, సుఖంగా నిద్ర పోతే తెల్లవారే సరికి ఉనులుగా ఉంటుం దనుకున్నాడు పాపన్న.

అదృష్ట వశాన అతను గ్రామం ప్రవేశిస్తుండగానే ఒక కుక్క తోక ఆడించుకుంటూ పాపన్న కేసి వచ్చింది. క్రితం రోజు అతను పెట్టిన అటుకుల చద్ది మాట అది మరవలేదు.

పాపన్న కుక్క వెంట ఒక ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు. కిందటి రోజు తాను కాపాడిన మనిషే వచ్చి తలుపు తీసి, "ఎవరు వారు?" అని అడిగాడు.

"నేనేనండి. తిరిగి మా ఊరు పోతున్నాను. జ్వరం తగిలింది. ఈ రాత్రికి మీ ఇంట పడుకుని తెల్లవారి వెళ్ళి పోతాను," అన్నాడు పాపన్న.

"ఇదేం సత్ర మనుకున్నావా? పద, సత్రానికి వెళ్ళి పడుకో," అన్నాడా మనిషి.

"మీకు శాలువ ఇచ్చిన వాణ్ణండి," అని పాపన్న జ్ఞాపకం చేశాడు.

"శాలు వేమిటి? ఇవ్వట మేమిటి? పిచ్చి వాడిలాగున్నావే! పద, పద!" అన్నాడా మనిషి, మూల నుంచి కర్ర తీసి అదిలిస్తూ.





ఇది చూసి కుక్క తన యజమాని మీదనే గుర్రు మన్నది. యజమాని తన కుక్కను ఆ కర్రతోనే గట్టిగా కొట్టి, తలుపు వేసుకున్నాడు.

ఎదుటింటాయన ఇదంతా చూస్తూ ఉండి, పాపన్నను ప్రశ్నించి విషయమంతా తెలుసుకుని, సమీపంలోనే ఉన్న గ్రామాధికారి ఇంటికి తీసుకు పోయాడు.

గ్రామాధికారి ఇంట పాపన్నకు చక్కగా ఉపచారాలు జరిగాయి. అక్కడే అతనికి తాను కాపాడిన మనిషి గురించి తెలియ వచ్చింది. వాడొక హీనుడు. అస్తమానమూ జూద మాడతాడు. పెళ్ళాం నగలన్నీ అమ్మే శాడు, ఇంట్లో వస్తువులన్నీ అమ్మేశాడు. జూదంలో ఓడి డబ్బిచ్చుకోలేక ఎన్ని సార్లో చావు దెబ్బలు తిన్నాడు. కిందటి రాత్రి అలాగే తన్నులు తిని పడి ఉంటే పాపన్న వాణ్ణి కాపాడి ఉండవచ్చు. కుక్క కున్న పాటి కృతజ్ఞత వాడికి లేదు!

మర్నాడు గ్రామాధికారి ఆ కృతఘ్నుణ్ణి పిలిపించి, పాపన్న ఇచ్చిన శాలువ సంగతి అడిగితే, తన కెవరూ ఏ శాలువా ఇవ్వ లేదన్నాడు వాడు. పాపన్న శాలువ మాట ఊరంతా పాకింది. ఆ ఊరి వర్తకు డొకాయన ఒక శాలువా తెచ్చి పాపన్నకు చూపి, "ఇది మీదేనేమో చూడండి. దీన్ని ఆ జూదగాడి దగ్గిర నిన్ననే ఇరవైరూపాయలకు కొన్నాను," అన్నాడు.

శాలువ మీద జమీందారు పేరు కుట్టి ఉండటం చేత అది పాపన్నదే నన్న సంగతి సులువుగా రుజువయింది. గ్రామాధికారి జూదగాణ్ణి మళ్ళీ పిలిపించి నిజం ఒప్పించి, వర్తకుడికి ఇరవై రూపాయలూ జూదరి తిరిగి యిచ్చేలా చేసి పాపన్న శాలువ పాపన్న కిప్పించాడు.

పాపన్న ఆ రోజల్లా అక్కడే విశ్రాంతి తీసుకుని, మర్నాడు తన గ్రామానికి తిరిగి వెళ్ళిపోయాడు.





# అపాత్ర దానం

పాపన్న ఎటువంటి కష్టంలో ఉన్న వాళ్ళకయినా ప్రతిఫలాపేక్ష లేకుండా సహాయం చేస్తాడు; తెలిసిన వాళ్ళూ, తెలియనివాళ్ళూ అనే భేదం అతనికి లేదు; పరోపకారం చెయ్యటమంటేనే అతనికి ఎంతో ఆనందం. ఈ సంగతి చుట్టుపక్కల అనేక గ్రామాల వారికి తెలిసిపోయింది.

ఆ పల్లెలలో పేదపల్లె అనే ఒక గ్రామం ఉన్నది. అక్కడ ఉండే వాళ్ళందరూ పేద వాళ్ళు, కూలీ నాలీ చేసుకు బతికేవాళ్ళు. వారిలో సంగప్ప అనేవాడొక డుండేవాడు. వాడు పాపన్నను గురించి చాలా విని ఉన్నాడు. పాపన్న సహాయంతో, వాడు ఏ పనీ చెయ్యకుండా, ఇంటిపట్టున కూర్చుని, కొంత కాలం, సుఖపడదా మనుకున్నాడు.

అవి పొలాల నుంచి ధాన్యం ఇళ్లకు వచ్చే రోజులు. సంగప్ప ఒకనాడు పాపన్న ఇంటికి వచ్చి, "అయ్యా, నేను చాలా బీదవాణ్ణి. నా కూతురికి పెళ్ళి చెయ్యాలి. సంబంధమైతే కుదిరింది గాని, పదిమందినీ పిలిచి భోజనమైనా పెట్టాలి గద. బియ్యం కొనటానికి కూడా నాకు శక్తి చాలదు. ఎంతో మందిని సహాయం అడిగాను. లాభం లేకపోయింది. మీ పేరు విని వచ్చాను. మీరు బియ్యం సహాయం చేశారంటే ఈ పెళ్ళి మీరే చేయించినవారవుతారు. మీ ఉపకారం ఎన్నటికీ మరవను," అన్నాడు.

"సరయిన సమయానికి వచ్చావు. నా దగ్గర డబ్బయితే లేదు గాని, బియ్యం ఉన్నది. ఎంత కావాలో చెప్పు. నీ కూతురి పెళ్ళికి అన్నం ఖర్చు నాదే ననుకో," అన్నాడు పాపన్న.

"మా గ్రామంలో వాళ్ళందరినీ పిలవాలి. సుమారు మూడు వందల మందికి భోజనం పెట్టాలి. ఒక బస్తా అయితే సరిపోతుంది," అన్నాడు సంగప్ప.

పాపన్న వాడి కొక బియ్యంబస్తా ఇచ్చాడు; మీనాక్షి కోసం కొత్తగా కొన్న చీర కూడా ఇస్తూ, "ఇది పెళ్ళికూతురికి నా కానుకగా తీసుకో," అన్నాడు.

సంగప్ప ఆ బియ్యంబస్తాను పాపన్న బండిలోనే వేసుకుని తన పల్లెకు వెళ్ళి, బియ్యంబస్తా తన ఇంట్లో పడేసి, బండిని తిరిగి పాపన్న ఇంటికి చేర్చి, పాపన్న కొక దణ్ణం పెట్టి వెళ్ళిపోయాడు.

సంగప్ప తన ఎత్తుగడ గురించి ముందుగా తన భార్యకు చెప్పలేదు. ఆమె బియ్యమూ, చీరా చూసి, "ఏమిటిది? ఇవి ఎక్కడివి?" అని అడిగింది.

"ఉన్నాడు పరోపకారి పాపన్న అనే ఒక మహానుభావుడు. 'నా కూతురికి పెళ్ళి చెయ్యాలి, మీరే దిక్కు,' అని ఏడుపు ముఖం పెడితే నమ్మాడు వెర్రివాడు! మనకు హాయిగా గడుస్తుంది," అన్నాడు సంగప్ప, తన ప్రయోజకత్వానికి తానే మురిసిపోతూ.

"మంచి ఉపాయమే! కాని, మనకు మొదలు కూతురే లేదని తెలిస్తే గొడవ చేస్తాడేమో?" అన్నది భార్య.

"ఆయన గొడవ చేసే వాడు కాదు. ఎవరో వచ్చి అడిగారు, ఇచ్చాడు! అది అంతటితో చెల్లే. ఆయన కిది జ్ఞాపకం కూడా





ఉంటదు. నీ కాయన సంగతి తెలీదు," అన్నాడు సంగప్ప.

సంగప్ప భార్యకు బియ్యంబస్తా కన్న కొత్త చీర బాగా నచ్చింది. ఆమె మర్నాడే దాన్ని కట్టుకుని, వాళ్ళ పల్లెలో తెలిసిన వాళ్ళింటికి వెళ్ళి, "పాపన్నగారు నిన్న మా ఇంటికి వచ్చారు. కాసిని మంచినీళ్ళు తాగి, కాస్సేపు విశ్రాంతి తీసుకున్నారు. నా చీర చిమ్మగుల బొంత అని చూశారో ఏమో, తన భార్య కోసం కొనుక్కుపోతున్న చీర నా కిచ్చి, ఇంటికి వెళ్ళాక ఒక బియ్యం బస్తా కూడా పంపారు," అని ఆ ఇంటి వాళ్ళతో రహస్యంగా చెప్పింది.

అది నిజం కాదని విన్న వాళ్ళకు తెలిసింది. సంగప్ప ఇంటికి బియ్యంబస్తా బండిలో రావటం చాలా మంది చూశారు, కాని పాపన్న రావటం ఒక్కరూ చూడలేదు.

సంగప్ప కరణంగారింటికి వెళ్ళి ఒక రోజు పని చేస్తానని కిందటి రోజు మాట ఇచ్చి, డబ్బు తీసుకున్నాడు. కాని వాడు వెళ్ళి ఆ పని చూడలేదు. కారణం తెలుసుకుందామని కరణం పెదపల్లెకు వచ్చాడు. గ్రామస్తులు కరణంగారిని, "ఇలా దయచేశారేం?" అని అడిగారు.

"సంగప్ప పని చెయ్యటానికి వస్తానన్నాడు, కాని రాలేదు," అన్నాడు కరణం.







"వారి ధర్మాన బియ్యమూ, చీరా దొరికిన మాట నిజమేననుకోండి. కాని నా ఒంట్లో నిజంగానే బాగాలేదు. మీ కంతగా నమ్మకం లేకపోతే మీ కూలి డబ్బులు మీరు తీసుకోండి," అన్నాడు సంగప్ప, డబ్బివ్వబోతూ.

"వద్దులే. పాపన్నగారు నీకు అంత గొప్పగా దానం చేస్తే నేను నీకు రోజు కూలి దానం చెయ్యలేక పోతానా?" అంటూ కరణం అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆయనకు ఆ గ్రామ పెద్ద కనిపించి, "సంగప్ప విషయంలో ఏదో మోసం ఉన్నట్టుగా ఉంది. దాని అంతు కనుక్కోవాలి," అన్నాడు.

ఇద్దరూ పాపన్న ఊరికి వచ్చి, పాపన్నను కలుసుకుని, "పాపన్నగారూ, మీరు దాన ధర్మాలు చేస్తే చేశారు, కాని పాత్రాపాత్ర విచారం చేసి మరీ దానాలు చెయ్యండి. ఎవరి అర్హతకు తగినట్టు వారికి దానం ఇవ్వటం సబబుగా ఉంటుంది. ఆ సంగప్ప మధ్యాహ్నం వేళ మీకు కాస్త దాహ మిచ్చి నందుకు ఒక బస్తా బియ్యమూ, కొత్త చీరా ఇచ్చారట. వా డిప్పుడు చేస్తా నన్న పని కూడా చెయ్య నంటున్నాడు. అలా వాడు సోమరి అయి కూచుంటే మీరు మాత్రం

"వాడిం కెందుకు వస్తాడు? బియ్యం బస్తా దొరికిందిగా?" అన్నారు గ్రామస్తులు. వాళ్ళు కరణానికి అంతా చెప్పారు.

కరణం సంగప్ప ఇంటికే వెళ్ళి, రాలే దేమని అడిగాడు.

"నే నిప్పుడు రానులెండి. నాకు ఒంటో బాగాలేదు. మీ దగ్గిర తీసుకున్న డబ్బులకు మరో రోజెప్పుడైనా వచ్చి పనిచేసి పెడతా లెండి," అన్నాడు సంగప్ప కరణంతో.

"పాపన్నగారు నీకో బస్తా బియ్యమూ, నీ భార్య కొక కొత్త చీరా ఇచ్చారటగా? అందుకేనా నీకు ఒంట్లో బాగాలేనిది?" అన్నాడు కరణం.







ఎంత కాలం వాళ్లని మేప గలరు? మీ రిచ్చిన కొత్త చీర కట్టుకుని వాడి పెళ్ళాం ఊరంతా ఊరేగుతున్నది," అన్నారు.

వాళ్లు చెప్పిన దేదీ జరగలేదనీ, సంగప్ప తన కూతురి పెళ్ళి నిమిత్తం బియ్యం సహాయం చెయ్యమన్నా డనీ, పోనీ శుభ కార్యం గదా అని తాను చీర కూడా ఇచ్చా ననీ పాపన్న వారికి చెప్పి, "ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?" అని అడిగాడు.

"మా వెంట వచ్చి, సంగప్ప మీతో అబద్ధాలు చెప్పినందుకు మీ రిచ్చినది మీరు తిరిగి తీసుకోండి," అన్నాడు కరణం.

"ఇచ్చినది తిరిగి పుచ్చుకోవటం బాగుం డదు. కాని నేను మీతో వస్తాను. వచ్చి, నాతో అబద్ధం ఎందుకు చెప్పాడో తెలుసు కుంటాను, పదండి," అంటూ పాపన్న వాళ్ళ వెంట సంగప్ప ఇంటికి వచ్చాడు. ఊళ్ళో ఉన్న జన మంతా సంగప్ప ఇంటి దగ్గర పోగయారు.

ఆ జనాన్నీ పాపన్ననూ చూడగానే సంగప్ప గుండె జారిపోయి, తల వంచుకుని, అంతా ఒప్పేసుకున్నాడు.

పాపన్న తన బియ్యం బస్తా నుంచి సంగప్ప ఖర్చు చేయగా మిగిలిన బియ్యం వల్లె పెద్ద సహాయంతో ఇంటింటికి సేరు సేరు బియ్యం చొప్పున పంచిపెట్టించాడు.

సంగప్ప భార్య పశ్చాత్తాపంతో కుమిలి పోతూ, పాపన్న ఇచ్చిన చీరె తెచ్చి పాపన్న ముందు పెట్టింది.

"ఫరవాలేదు, ఆ చీర నువే ఉంచుకో. తప్పు చేసినవాడు నీ భర్త. అందుకు నువేం చేస్తావు? మరో సారి ఇలా జరగకుండా చూస్తే చాలు," అన్నాడు పాపన్న. అయినా ఆమె ఆ చీరను తుంపులు చేసి రవికలు లేని వారికి పంచింది.

అది మొదలు ఆ ప్రాంతాల పాపన్నను మోసగించిన వారు బాగుపడ రన్న నమ్మకం వ్యాప్తిలోకి వచ్చింది.





# సత్యసంధుడు

ఒక నాటి రాత్రి బాగా పొద్దుపోయి ఒక అవిటివాడు పాపన్న ఇంటిని వెతుక్కుంటూ వచ్చాడు. అతను పాపన్నతో, "అయ్యా, నాకు నమ్మదగిన వారంటూ ఎవరూ లేరు. అందుచేత మీరు నా కొక్క ఉపకారం చెయ్యాలి," అని దీనంగా అన్నాడు.

"చాతనయితే తప్పక చేస్తాను. ఏం చెయ్యాలో చెప్పు," అన్నాడు పాపన్న.

ఆ వచ్చినవాడి పేరు రామన్న. వాళ్ళది సమీప గ్రామం. ఈ రామన్నకు కోదండం అనే అన్న ఒకడున్నాడు. అతను ఆ గ్రామంలోని ధనవంతులలో ఒకడు. రామన్న చిన్నతనంలోనే చెట్టు పై నుంచి పడిపోయి, ఒక చెయ్యి విరగగొట్టుకుని, అవిటివాడయాడు. అది మొదలు కోదండం తమ్ముడికి తన ఇంట నౌకరు హోదా మాత్రమే ఇచ్చి, చాలా హీనంగా చూస్తూ వచ్చాడు; "అవిటివాళ్ళకు అడుక్కు తినటం తప్ప మరోగతి లేదు," అని అప్పుడప్పుడూ తమ్ముడికి జ్ఞాపకం చేస్తూ ఉండేవాడు.

రామన్న తల్లి మటుకు తన చిన్న కొడుకు గురించి చాలా దిగులు పడేది. తాను హరీ అన్న మరుక్షణం కోదండం రామన్నను ఇంటి నుంచి వెళ్ళగొట్టుతాడని ఆమెకు తోచింది. అందుచేత ఆవిడ రామన్న కోసం ఒక వంద వరహాలు పోగుచేసి, వాటిని రహస్యంగా రామన్న కిస్తూ, "వీటిని ఎక్కడన్నా దాచి ఉంచు. కష్టకాలంలో ఈ డబ్బు అక్కరకు వస్తుంది," అన్నది.

ఆ డబ్బు ఎవరి దగ్గిర దాచటమా అన్నది రామన్న కొక పెద్ద సమస్య అయింది. అతను ఎవరినీ నమ్మలేడు. డబ్బు ఎవరి దగ్గిర దాచినా తన అన్నకు తెలిసిపోతుంది. కోదండాన్ని తృణీకరించి రామన్నను ఆదుకోగలవారెవరూ లేరు. ఈ సమస్యతో

పరోపకారి పాపన్న కథ





సతమత మవుతున్న రామన్నకు పాపన్న జ్ఞాపకం వచ్చాడు. ముక్కూ మొహమూ ఎరగని వారిని కూడా పాపన్న ఆదుకుంటాడని ప్రతీతి. పాపన్నను ఆశ్రయింతా మనుకుని రామన్న రాత్రివేళ వడివచ్చాడు.

పాపన్నకు తన పరిస్థితి అంతా చెప్పి రామన్న, "అయ్యా, మీరు ఈ డబ్బు దాచి ఉంచటమే కాదు, ఈ సంగతి మా అన్నకు చెప్పకుండా ఉండాలి. మా అమ్మ నాకేదో డబ్బిచ్చినట్టు ఆయన పసిగట్టి నన్ను గుచ్చి గుచ్చి అడిగాడు. ఈ డబ్బు గురించి మా అన్నకు తెలిసినట్టయితే అది నాకు దక్కదు," అన్నాడు.

కోదండం గురించీ, అతని అవిటి తమ్ముణ్ణి గురించీ పాపన్న అదివరకే కొంత విని ఉండటం చేత రామన్న మాటలలో విశ్వాసం ఉంచి, "నీ డబ్బు సంగతి నా ద్వారా మీ అన్నకు తెలియదని నీవు ధైర్యంగా ఉండు. నీ అన్న వచ్చి అడిగితే నీ వెవరో కూడా నాకు తెలియదని చెప్పేస్తాను. నీకు కావలిసినప్పుడు వచ్చి డబ్బు తీసుకుంటూ ఉండవచ్చు," అని ధైర్యం చెప్పి, రామన్నను పంపేశాడు.

అయితే రామన్న భయపడినదంతా అయింది. తన తమ్ముడు పాపన్నగారి గ్రామం వెళ్ళి, పాపన్న వద్ద కొంత డబ్బు దాచపెట్టినట్టు చూచాయగా కోదండానికి తెలియనే తెలిసింది. మర్నాడే అతను పాపన్న వద్దకు వచ్చి, "నా తమ్ముడు మీ దగ్గిర ఏదో ధనం దాచినట్టు తెలిసింది. మీరలా చెయ్యటం ఎంతమాత్రమూ భావ్యం కాదు. ఈ సంగతి తెలిసి నలుగురూ నన్ను గురించి ఏమనుకుంటారు? నేను తమ్ముడికి ద్రోహం చేసే వాణ్ణనుకోరా? వాడి డబ్బు నా దగ్గిర ఉంటే మింగేస్తానా? దాన్ని నా కిచ్చెయ్యండి," అన్నాడు.

"మీ రేమి చెబుతున్నదీ నా కర్థం కాలేదు. మీ తమ్ముడు నా దగ్గిరికి రానూ





లేదు, నా వద్ద డబ్బు దాచనూ లేదు,'' అనేశాడు పాపన్న.

పాపన్న అబద్ధా లాడతాడని కోదండం కలలో కూడా అనుకోలేదు. కాని పాపన్న అన్నమాట నిజం కాదని కోదండానికి రూఢిగా తెలుసు; రామన్న పాపన్న ఇంటికి రావటం కళ్ళారా చూసినవాడే కోదండాని కా మాట చెప్పాడు.

కోదండం పాపన్నను ఏమీ చెయ్యలేక, అతను అబద్ధాలాడతా డని ఎరిగిన వాళ్ళం దరి దగ్గిరా ప్రచారం చెయ్యసాగాడు. కాని కోదండం చేసే ప్రచారాన్ని, ఆ చుట్టుపక్కల గ్రామాల్లో ఒక్కరూ నమ్మలేదు; పాపన్న ఏ చెడ్డ పనీ చెయ్యడని అందరికీ గాఢమైన విశ్వాసం.

అయితే, తలవని తలంపుగా, పాపన్న అసత్యవాది అన్న విషయం లోకానికి వెల్లడి కావటానికి తగిన అవకాశం త్వరలోనే ఏర్పడింది. అది ఎలా జరిగిందంటే—

కోదండం వాళ్ళ గ్రామానికి దగ్గిరలో ఉండే అడవి ప్రాంతంలో, ఒక వాగులో ఒక సాధువుకు ఒక దేవతా విగ్రహం దొరికింది. ఆ సాదువు ఊళ్ళలోకి ప్రవేశించడు. అందుచేత ఆయన ఆ విగ్రహన్ని ఒక చోట భద్రంగా ఉంచి, అడవిలో పశువులను మేపటానికి వచ్చిన కాపులతో, ''నా కొక





దేవతా విగ్రహం దొరికింది. దాన్ని మీ గ్రామస్థులు తీసుకుపోయి, మంచి ప్రదేశంలో ప్రతిష్ఠ చేసి, గుడి కట్టించి, అర్చించాలి. లేకపోతే మీ గ్రామానికి అరిష్టం వస్తుంది," అని చెప్పాడు.

ఈ సంగతి గ్రామంలో తెలియగానే గ్రామ పెద్దలు గుడి కట్టించ నిర్ణయించి, అది కట్టటానికి చోటు కూడా చూసి, చందాలు వసూలు చెయ్యసాగారు. కోదండం లాటి ధనికులు ముందుకు వచ్చి ఈ పని తమ పైన వేసుకున్నారు. కోదండమే అందరి కన్న పెద్ద మొత్తం చందా వేసి, పెత్తనం వహించాడు. విగ్రహ ప్రతిష్ఠకుగాను పీఠం తయారయింది. విగ్రహాన్ని తీసుకు రావటానికి గ్రామస్థులు మేళ తాళాలతో బయలుదేరి సాధువు వుండే చోటికి చేరారు.

పూజారి స్నానం చేసి పరిశుద్ధుడై వచ్చి విగ్రహాన్ని ఎత్తబోయే సరికి అతని చేతులు చుర్రున కాలాయి. అతను బాధతో అరిచి వెనకడుగు వేశాడు.

"ఇది పవిత్రమైన విగ్రహం. సత్య వ్రతులూ, పుణ్యాత్ములూ కాని వాళ్ళు దీన్ని తాకలేరు," అన్నాడు సాధువు.

"మాలో అంత పుణ్యాత్ము లెవరున్నారు? తమరే విగ్రహాన్ని గ్రామానికి చేర్చండి," అని గ్రామస్థులు సాధువును వేడుకున్నారు.

"గ్రామ ప్రవేశం చెయ్యనని నియమం పట్టాను. మీలో ఆత్మవిశ్వాసం ఉన్నవారెవరైనా ఉంటే విగ్రహాన్ని తీసుకుపొండి," అన్నాడు సాధువు.

గ్రామస్థులు ఒకరి నొకరు మెచ్చుకుని, నీ కన్న పుణ్యాత్ము డెవడంటే నీ కన్న పుణ్యాత్ము డెవ డన్నారు, కాని తామై ఒక్కరు కూడా విగ్రహాన్ని తాకటానికి సాహసించ లేదు. చివరకు అందరి దృష్టి కోదండం మీద పడింది. వాళ్ళు ఇచ్చిన










ప్రోత్సాహంతో కోదండం ముందుకు వచ్చి, "భయంలేదు, విగ్రహాన్ని నేను ఎత్తుతుంటాను," అన్నాడు.

"నీవు పుణ్యకార్యాలు చేసిన వాడివే కదా?" అన్నాడు సాధువు.

"చెయ్యకేమండి? ఈ దేవతకు గుడి కట్టించటానికి నేను అందరికన్నా ఎక్కువ విరాళ మిచ్చాను. తిరునాళ్ళప్పుడు బీదలకు అన్న దానాలూ, వస్త్ర దానాలూ చేస్తూంటాను," అన్నాడు కోదండం.

"అబద్ధా లాడవు కదా?" అని అడిగాడు సాధువు.

"ఎంత మాటా! ఎన్నటికీ అబద్ధం చెప్పను," అన్నాడు కోదండం.

"అలాటి ఆత్మవిశ్వాసం ఉంటే విగ్రహాన్ని ఎత్తుకో," అన్నాడు సాధువు.

కోదండం ముందుకు వచ్చి విగ్రహాన్ని తాకి కెవ్వున అరిచాడు. అతని చేతులు కూడా కాలాయి. పదిమంది లోనూ అతడికి మంచి పరాభవమే అయింది. అయితే అతని పరాభవం సంగతి అటుంచి, విగ్రహాన్ని ఎత్తేవాళ్ళెవరో గ్రామస్థులకు అర్థం కాలేదు.

ఆ క్షణంలో కోదండానికి పాపన్న గుర్తుకొచ్చాడు. పాపన్న మహా పవిత్రుడని అందరికీ నమ్మకం. అతను అబద్ధం చెప్పాడని తాను అంటే, ఒక్కడు కూడా నమ్మలేదు. పాపన్న బండారం బయట పెట్టటానికి ఇది బలే అవకాశం. తనతో వచ్చి అబద్ధం ఆడిన పాపన్న వచ్చి, ఈ విగ్రహాన్ని తాకితే అతని చేతులు తప్పక కాలి తీరుతాయి. అంతటితో పాపన్న పైన జనానికి ఉండే మూఢ నమ్మకం కాస్తా తొలగిపోతుంది.

అలా అనుకుని కోదండం, "అన్నట్టు, ఈ విగ్రహాన్ని తాకటానికి సమర్థుడు మన పక్కగ్రామంలో ఉండే పాపన్నే. ఆయన మహా పుణ్యాత్ముడు, అపరహరిశ్చంద్రుడు," అన్నాడు. అందరూ ఉత్సాహం తెచ్చుకున్నారు. పాపన్న మీద అందరికీ గురే.





పావన్నను పిలుచుకు రావటానికి ఒక సేవకుడు వెళ్ళాడు. ఆ సేవకుడు వెళ్ళి తాను వచ్చిన పని చెప్పగానే పావన్న వాడి వెంట బయలుదేరి వచ్చాడు. అతను స్నానం చేసి, పరిశుద్ధుడై వచ్చి, సాధువుకు నమస్కారం చేసి, విగ్రహాన్ని ఎత్తుకోవటానికి అనుమతి వేడాడు.

సాధువు కోదండాన్ని అడిగినట్టు గానే, "నీవు పుణ్యకార్యాలు చేసినవాడివే గదా?" అని అడిగాడు.

"అంతరాత్మ చెయ్యమన్న పనులు చెయ్యటమే తప్ప, అవి పుణ్య కార్యాలో కావో నాకు తెలీదు, స్వామీ. అది ఆ భగవంతుడికే తెలియాలి," అన్నాడు పావన్న.

"అబద్ధ మాడవుకదా!" అని సాధువు మళ్ళీ అడిగాడు.

"అలా చెప్పలేను. కొన్ని సందర్భాలలో అబద్ధం కూడా ఆడవలిసి వస్తుంది," అన్నాడు పావన్న.

"సరే, నీకు ఆత్మవిశ్వాసం ఉంటే విగ్రహాన్ని ఎత్తుకో," అన్నాడు సాధువు.

పావన్న భక్తితో విగ్రహానికి నమస్కారం చేసి, చేతులు చాచి దాన్ని ఎత్తుకున్నాడు. అతని చేతులు కాల లేదు.

గ్రామస్థులు విజయధ్వానాలు చేస్తూ, పావన్న వెంట మేళతాళాలతో తమ గ్రామానికి వెళ్ళి, దేవతను పీఠం పైన ప్రతిష్ఠించారు. అటు పైన విగ్రహం తాకితే ఎవరి చేతులూ కాల లేదు.

అందరూ సంతోషించారు గాని ఒక్క కోదండానికే ముఖం మాడిపోయినట్టయింది. క్రమంగా అతనికి పావన్న పైన భక్తి పుట్టుకొచ్చింది. అతను తన తప్పు తెలుసుకుని, తన తమ్ముణ్ణి సరిగా చూస్తానని తన తల్లి ఎదట ప్రమాణం చేశాడు. పావన్న వద్ద దాచిన డబ్బును తెచ్చి రామన్న తన అన్న ఎదట పెట్టాడు. కోదండం దాన్ని తమ్ముడికే ఇచ్చేశాడు.







# నగలపెట్టె

ఒకనాటి రాత్రి బాగా చీకటిపడి ఒక కుటుంబం ప్రయాణం చేస్తూ పాపన్న ఇంటికి వచ్చింది. కుటుంబ పెద్ద జగ్గన్న అనే వాడు. అతని వెంట అతని భార్యా, ఒక అయిదేళ్ళ కుర్రవాడూ, ఇంకొక పాపా మాత్రమే ఉన్నారు. జగ్గన్న అత్తవారూరు పాపన్న ఉండే గ్రామానికి దక్షిణానా, అతని స్వగ్రామం ఉత్తరానా ఉన్నది. అతను సకుటుంబంగా అత్తవారూరు నుంచి, చీకటి పడ్డాక పాపన్న ఊరు చేరుకునే టట్టుగా కాలినడకన ప్రయాణమయ్యాడు.

జగ్గన్న బుద్ధిపూర్వకంగానే ఇలా చేశాడు. కారణ మేమంటే, అతను దొంగబుద్ధి కల వాడు. పేరుకు ఒక చిన్న దుకాణం పెట్టు కుని వ్యాపారం చేస్తున్నట్టు నటిస్తూ, అతను అవకాశం దొరికినప్పుడల్లా దొంగతనాలు చేస్తూండేవాడు. భర్త సంగతి భార్యకూ్కడా తెలునును. కాని భర్త ఆగ్రహానికి వెరిచి, అతని రహస్యం తన కడుపులోనే దాచు కుని, కుక్కిన పేనులాగా ఉండిపోయింది.

జగ్గన్న పాపన్నను గురించి చాలా విని ఉన్నాడు. ఈ పాపన్న లోకజ్ఞానం ఎరగని అమాయకు డనీ, అతన్ని సులువుగా దోచ వచ్చుననీ అనుకుని, అవకాశం కోసం చాలా కాలంగా ఎదురు చూస్తున్నాడు. ఇప్పుడా అవకాశం దొరికింది.

అయితే జగ్గన్న కుటుంబం వచ్చేసరికి పాపన్న గ్రామంలో లేడు. రెండు రోజుల క్రితం గ్రామాంతరం వెళ్ళాడు. అయినా అభ్యాగతులకు ఏ లోటూ రాకుండా మీనాక్షీ, ఆమె అత్తగారూ కూడా వచ్చినవాళ్ళ సంగతి కనుక్కొని, ఆ రాత్రి భోజనాలు పెట్టి, పాపకు పాలు ఇచ్చి, వాళ్ళు పడుకో టానికి లోపలి గదిలో ఏర్పాటు చేశారు.

జగ్గన్న పడుకుని, అవతలి గదిలో మాట్లాడే మాటలన్నీ ఎంతో శ్రద్ధగా అల







కిస్తున్నారు. పాపన్న తల్లి తన కోడలితో, "ఏమే, మీనాక్షీ? మొన్న పెళ్ళికి వేసుకున్న నగలు ఇంకా అక్కడే ఉంచావేం? పెట్టెలో పెట్టకపోయావా?" అనటం జగ్గన్నకు వినిపించింది.

అత్తగారలా అన్న కాస్సేపటికి మీనాక్షి ఒక చేత దీపమూ, ఇంకో చేత నగలూ తీసుకుని మిద్దె మీదికి ఎక్కటం జగ్గన్న గమనించాడు. జగ్గన్న ఆమె వెనకగా మెట్ల మీదికి వెళ్ళి, మీనాక్షి నగలను ఏ పెట్టెలో పెట్టుతున్నదీ గమనించి, మళ్ళీ తన చోటికి వచ్చి పడుకున్నాడు. తరవాత కొంత సేపటికి మీనాక్షి కిందికి దిగి వచ్చి తాము పడుకునే గదికి వెళ్ళిపోయింది. అర్ధ రాత్రివేళ అందరూ గాఢనిద్రలో ఉన్న సమయంలో జగ్గన్న లేచి, పిల్లిలాగా మెట్లెక్కి పైకి వెళ్ళి, తాళం వెయ్యని పై గది ప్రవేశించి, పెట్టె సంగ్రహించి కిందికి దిగి వచ్చాడు. చుక్క పొడిచే వేళకు అతను నిద్ర లేచినట్టు లేచి, పెట్టెను బయటికి తీసుకుపోయి, చీకట్లో ఒక చోట గుర్తుగా పెట్టి, లోపలికి వచ్చి తన భార్యనూ, పిల్లవాణ్ణీ లేపి ప్రయాణమయాడు. ఈ అడావుడికి పాపన్న తల్లీ, మీనాక్షీ కూడా లేచారు. జగ్గన్న వాళ్ళతో, "మాకు సెలవిప్పించండి. మేం బయలుదేరుతాం. వెళ్ళవలిసిన దూరం చాలా ఉంది," అన్నాడు.

జగ్గన్న కుటుంబం తిరిగి కాలినడకన ప్రయాణం సాగించింది. జగ్గన్న తాను దాచి ఉంచిన పెట్టె తీసుకుని వీపున వేసుకుని నడక సాగించాడు. మధ్యాహ్నం వేళకు వాళ్ళు ఒక గ్రామం చేరుకుని, అక్కడ విశ్రాంతి తీసుకుని బయలుదేరారు. కుర్రవాడు నడవలేక ఎత్తుకోమని వేధించ సాగాడు. జగ్గన్న భార్య కూడా పాపను ఎత్తుకుని నడవటం చేత ఆమెకు కాళ్ళు పీకసాగాయి. అందరూ దారి పక్కన చతికిలబడ్డారు. తాము వెళ్ళే దిక్కుగా ఏదైనా





బండి వెళుతూ కనిపిస్తే బాగుండు నను కున్నాడు జగ్గన్న.

ఇంతలో ఒక బండి కనిపించనే కని పించింది. అయితే అది వాళ్ళు వెళ్ళ వలిసిన దిక్కు నుంచి వస్తున్నది.

"ఆ బండి మన వూరువేపు వెళ్ళదురా!" అని జగ్గన్న అంటున్నా వినిపించుకోకుండా కుర్రవాడు వేలుపెట్టి చూపుతూ, "బండి! బండి!" అని కేకలు పెట్టసాగాడు.

ఆ బండి తోలుకుంటూ తన వూరు పోతున్న పాపన్న బండి ఆపి, "బండిలో ఎక్కుతావా, బాబూ?" అని కుర్రవాణ్ణి అడిగాడు.

తాము పోతున్నది ఫలానా గ్రామమని జగ్గన్న చెప్పాడు.

"ఫరవాలేదు, ఎక్కండి. ఇక్కడికి ఎంతో దూరంలేదు. మిమ్మల్ని దించి రేపు ఉదయం నేను మా వూరు పోతాను," అన్నాడు పాపన్న. అతను బండి దిగివచ్చి పెట్టె తీసుకుని బండిలో పెట్టుతూ, అది తన పెట్టెలాగే ఉండటం చూసి ఆశ్చర్య పోయాడు. కొంచెం శ్రద్ధగా చూస్తే "సోమయ్య" అన్న తన తండ్రి పేరు కూడా దాని పైన రాసి ఉన్నది. అతని ఆశ్చర్యం మరింత అయింది.



ఈ లోపల అందరూ బండి ఎక్కి కూర్చున్నారు. పాపన్న బండిని వెనక్కు తిప్పి జగ్గన్నగారి ఊరు కేసి తోలుతూ, "ఈ పెట్టెలాటిదే మా ఇంట్లోకూడా ఉంది. దాని పైన సోమయ్య అని రాసి ఉన్నదే, అది మా తండ్రిగారి పేరేకూడా," అన్నాడు.

జగ్గన్న గుండె గుభేలు మన్నది. అతను వెంటనే సంబాళించుకుని, "ఆశ్చర్యంగా ఉందే. మీ తండ్రిగారి పేరు కూడా అదేనా? అందుకే మనం దైవికంగా ఇలా కలును కున్నాం," అన్నాడు.

"మీ పేరు కూడా పాపన్నేనా ఏమిటి?" అని పాపన్న అడిగాడు.







జగ్గన్నా, అతని భార్యా కూడా ఉలిక్కి పడ్డారు. భయపడ వద్దని జగ్గన్న భార్యకు సంజ్ఞ చేసి, "బాగా కనిపెట్టారే? నా పేరు పాపయ్యే. మన పేర్లు కూడా ఒకటేనంటే ఇదేదో పూర్వ జన్మ సంబంధమే," అన్నాడు నవ్వుతూ.

త్వరలోనే చీకటి పడింది. బండి ఒక కుగ్రామం చేరింది. అక్కడ పడిపోయి, ఖాళీగా ఉన్న ఇళ్ళు ఒకటి రెండు ఉన్న సంగతి జగ్గన్నకు తెలుసు. అతను బండిని ఒక ఇంటి ముందు ఆపించి, "ఇదేనండి మా ఇల్లు! ఇక్కడ దిగుతాం," అన్నాడు. అతను పెట్టెను దించినాక అతని భార్యా, కుర్రాడూ కూడా దిగారు. దూరంగా తనకు తెలిసిన వాళ్ళ ఇల్లున్నదని, అక్కడ రాత్రి గడిపి, తెల్లవారి బయలుదేరి వెళతానని చెప్పి పాపన్న బండిని ముందుకు తోలుకు పోయాడు. తరవాత జగ్గన్న తన భార్యనూ, పిల్లవాణ్ణి ఇంకొక ఖాళీ గుడిసెకు నడిపించుకుపోయి, ఆ రాత్రికి అందులో చేరాడు.

ముందు పెట్టె పగలగొట్టి, అందులో ఉన్న నగలు మూటగట్టి, పెట్టెను నామ రూపాలు లేకుండా చెయ్యాలని నిశ్చయించుకుని జగ్గన్న ఉలి, సుత్తి తేవటానికి బయలుదేరి వెళ్ళాడు. అతని భార్య ఎక్కడన్నా ఇన్ని పాలూ, రొట్టె తెద్దామని తాను కూడా బయలుదేరింది. గుడిసెలో కుర్రాడూ, పసి పాపా మిగిలారు.

కుర్రాడు పాపను ఆడిస్తూ పెట్టె దగ్గిర కూర్చున్నాడు. ఆ పెట్టెకు రెండు తాళాలున్నాయి. ఒకటి పెట్టె మూతలోనే అమర్చిన బీగం. రెండోది పెట్టె ముందు భాగంలో ఉండే కొక్కానికి తగిలించి వేసే తాళం. ఆ పెట్టెకు మీనాక్షి మొదటి బీగం సరిగానే వేసింది, కాని తాళాన్ని తొందరలో పూర్తిగా నొక్కలేదు. అది నొక్కితే పడే తాళం. పూర్తిగా నొక్కనందున అది సరిగా పడలేదు. కుర్రాడు ఆ తాళం కొంకి సందున ఒక





చేతి వేళ్ళుంచి, రెండో చేత్తో తాళాన్ని గట్టిగా నొక్కాడు. అప్పుడా తాళం టక్కున పడింది. కుర్రాడి వేళ్ళు అందులో ఇరుక్కుపోయి, లాగితే రాలేదు. కుర్రాడు గట్టిగా అరిచి ఏడిచాడు.

వాడి కేకలు విని పక్క ఇంటి వాళ్ళు వచ్చి చూసి, "అరెరే, కుర్రాడు వేళ్ళను తాళంలో ఇరికించు కున్నాడే. తాళం తీయాలి. తాళపు చెవి ఎక్కడ?" అన్నారు.

కొంచెం సేపట్లో జగ్గన్న భార్య పాలూ, రొట్టెలూ తీసుకుని వచ్చి తన కొడుకు స్థితి చూసి, "బిడ్డను కాపాడండి, బాబూ! మీకు పుణ్యం ఉంటుంది," అని జనాన్ని బతిమాల సాగింది. జనం పోగుకా సాగారు. వాళ్ళతో బాటు పాపన్న కూడా వచ్చాడు.

అతను కుర్రవాణ్ణి చూసి, "అయ్యో, పాపం! తాళం తీయండి. లేకపోతే వాడి వేళ్ళు రావు. వాళ్ళ నాన్న ఎక్కడ?" అన్నాడు ఆదుర్దాగా.

అతనా మాట అంటూండగానే సుత్తీ, ఉలీ తీసుకుని జగ్గన్న వచ్చాడు; పాపన్నను చూసి కొయ్యబారి పోయాడు. పాపన్న అతని చేతిలో ఉన్న పనిముట్లు చూసి, "నిక్షేపం లాటి పెట్టెను పాడు చెయ్యకండి. తాళం తీస్తే తప్ప వాడి వేళ్ళు రావు. తాళం పగల




గొట్టటానికి ప్రయత్నిస్తే కుర్రాడి వేళ్ళకు ప్రమాదం. తాళంచెవి తీయండి," అన్నాడు.

"నిజం చెప్పెయ్యండి," అని జగ్గన్నతో భార్య రహస్యంగా అన్నది.

"నా దగ్గిర దాని తాళపుచెవి లేదు," అన్నాడు జగ్గన్న.

"నా దగ్గిర ఉన్న చెవి తాళానికి పడుతుందేమో చూస్తాను. నా పేరే మీ పేరు, నా తండ్రి పేరే మీ తండ్రి పేరు, మా పెట్టె లాటిదే మీ పెట్టె. నా తాళపు చెవి దానికెందుకు పట్టకూడదూ?" అంటూ పాపన్న తన తాళపుచెవుల గుత్తిలో ఒకటి పైకి తీసి దానితో తాళం తెరిచాడు.





పాపన్న తాళపుచెవితో తాళం రావటమూ, పెట్టె తాళపు చెవి జగ్గన్న దగ్గిర లేకపోవటమూ, పాపన్న అన్న మాటలూ విన్నవాళ్ళలో కొందరు పాపన్నను, "అయ్యా, మీ పేరేమిటి?" అన్నారు.

"ఈయనగారి పేరే నా పేరూనూ, పాపన్న," అన్నాడు పాపన్న.

"ఈయనగారి పేరు పాపన్న కాదండీ, జగ్గన్న. ఈ ప్రాంతాల బాగా ఖ్యాతిగలవాడు. పెట్టె లోపల ఉన్న బీగం కూడా మీ తాళపు చెవితో తెరుచుకుంటుందేమో కాస్త చూడండి," అన్నారు కొందరు.

పాపన్న పెట్టె బీగాన్ని కూడా తీసి మూత ఎత్తి, "అన్నిటికన్న అత్యద్భుతం! ఇందులో నగలన్నీ అచ్చు నా భార్య నగల లాగే ఉన్నాయి," అన్నారు.

జగ్గన్న దొంగ అని అందరికీ సునాయాసంగా తెలిసిపోయింది. కొందరు అతన్ని పట్టుకు తన్నబోయారు. పాపన్న వారిని వారించి, "తొందర పడకండి. ఆయన దొంగతనం చేసినట్టు ఆయనకు తెలియకుండా మనకు తెలుస్తుందా?" అన్నాడు.

జగ్గన్న భార్య ఏడుస్తూ పాపన్న కాళ్ళపైన పడి, "అయ్యా, అది మీ పెట్టె. ఒక రాత్రి మీ ఇంటి తిండి తిని మీ భార్య నగల పెట్టె ఎత్తుకొచ్చాం. మమ్మల్ని క్షమించండి," అన్నది.

"ఊరుకో, అమ్మా, ఊరుకో. ఇది నా పెట్టె అని మీ రన్నట్టయితే నేను తీసుకుపోతానులే. ఇప్పుడు నాకు జరిగిన నష్టం ఏమున్నది? ఏ పాపమూ ఎరగని పసి కుర్రవాడికి బాధ తప్పింది, అంతే చాలు," అన్నాడు పాపన్న.

పాపన్న తన గ్రామానికి తిరిగి వెళ్ళాడు. రాత్రి ఉన్న పెట్టె తెల్లవారి ఏమయిందా అని క్రితం రోజల్లా ఆదుర్దాపడిన మీనాక్షీ, పాపన్న తల్లీ, పాపన్న వెంట పెట్టె ఉండటం చూసి ఎంతో ఆనందం పొందారు.





# తలవంచినవాడు

పాపన్న ఒకసారి ఏదో పని మీద కొంత ప్రాంతాలకు వెళ్ళి తిరిగి వస్తూండగా మధ్యాన్న మయింది. ఎక్కడైనా కూర్చుని భోజనం చేద్దా మనుకుంటూ ఒక తోట వద్దకు వచ్చాడు. ఆ తోట వెనక ఒక ధని కుడి ఇల్లు కనిపించింది. తోటలో అతని కొక దృశ్యం కనబడింది. అక్కడ కట్టెలు కొట్టుతున్న ఒక మనిషి శోష వచ్చి పడు తున్నాడు. అయిదా రేళ్ళ కుర్రవా డొకడు ఆ మనిషిని లేపుతూ, "అమ్మ డబ్బులు పట్టుకు రమ్మన్నది. నా కాకలేస్తున్నది," అన్నాడు ఏడుపు ముఖంతో.

"ఏం చేసేదిరా? ఈ కట్టెలన్నీ కొట్టితే గాని ఇంటి యజమాని డబ్బు లివ్వడు. ఎక్కడన్నా డబ్బులు ముస్తైత్తి ఏమైనా కొనుక్కుతిను. నేని కట్టెలు కొట్టి, డబ్బులు తీసుకు వచ్చి, మీ అమ్మకు గంజి కాచి పోస్తా," అన్నాడు తండ్రి.

"ఎవరి నడిగేది? ఎవరిస్తారు?" అంటూ కుర్రవాడు ఏడిచాడు.

ఇంతలో పనివాడికి పాపన్న కనిపిం చాడు. అతను పాపన్న దగ్గిరికి వచ్చి, "అయ్యా, మీ దగ్గిరుంటే అణో, బేడో ఇచ్చి పుణ్యం కట్టుకోండి. వీడు ఆకలికి మాడు తున్నాడు," అన్నాడు.

పాపన్న ఒక చెట్టు కిం
మూట విప్పి, కట్టెలు
కొడుకునూ కూడా తి
కలిసి భోజనం చేశాక, పాపన్న
వాళ్ళ ప్రశ్నించి అతడి గృహ పరిస్థితులు తెలుసుకున్నాడు.

కొంత దూరంలో కట్టెలుకొట్టే వాడి గుడిసె ఉన్నది. అందులో అతడి భార్య జబ్బుగా పడిఉన్నది. ఈ ఇంటి యజమాని కట్టెలుకొట్టితే తప్ప డబ్బివ్వడు. సాయం కాలం ఆ కూలి డబ్బుల తోనే ఇతను తన







భార్యకు మందూ, తిండీ చూడాలి. ఏ రోజు [illegible] రోజుకే చెల్లు.

[illegible]గు ముడి విప్పి చూసు[illegible] ఉండే చిల్లర అంతా [illegible] బంగారు కాసు మిగి[illegible] పావన్న సంకోచించకుండా ఆ బంగారు కాసును కట్టెలుకొట్టే వాడి చేతిలో పెడుతూ, "దీన్ని తీసుకుని వెంటనే వెళ్ళి మార్చి, నీ భార్యకు మంచి మందూ అదీ ఇప్పించు," అన్నాడు.

"అన్న ప్రకారం ఈ కట్టెలన్నీ కొట్టకుండా ఎట్లా వెళ్ళను?" అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

"నువ్వు వచ్చేదాకా నేను కొట్టుతూ ఉంటాలే. కట్టెలు కొట్టటం నా కలవాటే. నీ యజమాని అడిగితే నేను చెప్పు తుంటాలే," అన్నాడు పావన్న.

అటే ఇష్టం లేకుండానే కట్టెలుకొట్టే వాడు పావన్న ఇచ్చిన బంగారు కాసు తీసుకుని, కుర్రాణ్ణి వెంట బెట్టుకుని ఇంటికి బయలుదేరాడు.

పావన్న చొక్కా విప్పి పక్కన పెట్టి, కట్టెలు కొట్టనారంభించాడు.

కొంత సేపటికి ఇంటి యజమాని బయటికి వచ్చి, కొత్తవా డెవడో కట్టెలు కొట్టడం చూసి, "నువ్వెవరు? వా డేడీ?" అని అడిగాడు పావన్నను.

"నేను వాడి బంధువునే లెండి. వాడి భార్యకు నుస్తీగా ఉంటే, వెళ్ళి చూసి, భోజనం చేసి వస్తానని వెళ్ళాడు. వాడు వచ్చే దాకా నేను కట్టెలు కొట్టుతా లెండి," అన్నాడు పావన్న.

"సరే కానియ్యి. కట్టెలు బాగా కొట్టు, ఏం? నీకు వేరే కూలీ ఇమ్మంటే ఇచ్చేది లేదు, ఇప్పుడే చెబుతున్నాను," అన్నాడు ధనికుడు.

"అలా నే నెందు కడుగుతానండీ?" అన్నాడు పావన్న.





ధనికుడు కొంచెం అవతలికి పోయి, కట్టెలుకొట్టే పాపన్ననూ వింతగా గమనించ సాగాడు. పాపన్న చూడటానికి కట్టెలుకొట్టే వాడి లాగా లేడు, కాని అసలు వాడి కన్న బాగా కొట్టుతున్నాడు. రేపు కూడా వీణ్ణే రమ్మనాలి అని ఇంటి యజమాని అను కుంటూండగా, అసలు కట్టెలుకొట్టే వాడు వచ్చి, పాపన్న చేతి గొడ్డలి ఇయ్యమని అడిగాడు.

"అప్పుడే వచ్చావేం?" అని పాపన్న అతన్ని అడిగాడు.

"మీరు ధర్మాత్ములై ఏం లాభం? నాబోటి దరిద్రుడికి తీసుకున్నది ప్రాప్తం ఉండొద్దూ? మీ రిచ్చిన బంగారు కాసు కొంగున దోపుకుని బయలుదేరానా? గుడ్డ చిరుగులో నుంచి జారి అది ఎక్కడ పడి పోయిందో పడిపోయింది," అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

బంగారు కాసు అన్న మాట చెవిని పడ గానే ధనికుడు వాళ్ళ దగ్గిరికి అడావిడిగా వచ్చి, "బంగారు కాసేమిటి? ఎక్కడిది? దాన్ని యితగాడికి యిచ్చిన వాళ్ళెవరు?" అని అడిగాడు.

"నేనే ఇచ్చాను. దాన్ని కాస్తా పాపం, దారిలో ఎక్కడో పారేసుకున్నాడట," అన్నాడు పాపన్న.





"అదే నేనూ అడిగేది—బంగారు కాసు నీ కెక్కడిదీ అని! ఇవాళ ఉదయమే నేను పది బంగారు కాసులు బొడ్డులో పెట్టుకుని ఇంటికి వచ్చి చూసుకుంటే ఒకటి కనిపించలేదు. అది మీకు దొరికింది. దాన్నే మీలో ఒకడిచ్చినట్టూ, ఇంకొడు పారేసుకున్నట్టూ నాటకం ఆడుతున్నారు. దాన్ని ఎక్కడ దాచారో తెచ్చి ఇచ్చారా సరే సరి, లేకపోతే ఇద్దరికీ శాస్తి చేయిస్తాను," అన్నాడు ఇంటి యజమాని.

పాపన్నా, కట్టెలు కొట్టేవాడూ ఎంతగా చెప్పుకున్నా ధనికుడు వినిపించుకో లేదు. చివరకు పాపన్న, "మీ బంగారు కాసు పోయి ఉంటే, అక్కడే ఎక్కడో ఉంటుంది. మీరు సరిగా వెతికి ఉండరు. నాపైన అకారణంగా నింద మోపుతున్నారు గనక దాన్ని వెతికి పెడతాను. ఈ నింద మొయ్యలేను," అన్నాడు.

అతను బంగారు కాసు కోసం వెతక నారంభించాడు. ధనికుడు కట్టెలు కొట్టే వాడితో, "చూస్తూ నిలబడతా వేం? నీపని కానీ!" అని, పాపన్నను ఆసక్తితో గమనించసాగాడు. అతను ధనికుడి కంటికి విచిత్రమైన మనిషిగా కనిపించాడు. అతను లేని నాణెం కోసం నిజంగా వెతుకుతాడా, లేక వెతుకుతున్నట్టు నటించి, చివరకు తనదే ఒక బంగారుకాసు తీసి, దొరికిందని తనకు ఇస్తాడా?

సాయంత్రం దాకా వెతకగా పాపన్నకు కంచెవార బంగారుకాసు దొరకనే దొరికింది. అతను దాన్ని తెచ్చి ధనికుడికిస్తూ, "ఇదుగో నండీ మీ బంగారుకాసు. కష్టపడి వెతికితే ఎందుకు దొరకదు? ఇది దొరకబట్టి సరిపోయింది గాని, లేకపోతే నేను నిష్కారణంగా దొంగనై ఉందునుగదా!" అన్నాడు.

ఈ లోపుగా కట్టెలు కొట్టేపని పూర్తి అయింది. ధనికుడు భార్యను కేకేసి, ఆమె చేత కట్టెలు కొట్టినవాడికి కూలి డబ్బు





లిప్పించాడు. కట్టెలు కొట్టేవాడి వెంటనే పాపన్న కూడా బయలుదేరాడు.

ధనికుడు ఉట్టుడియుంగా బంగారుకాను సంపాదించి నందుకు పొంగిపోతూ, మురిసి పోతూ ఉండగా, అతని చిన్న కొడుకు ఇంటి ముందు ఆడుకుంటూ, కెవ్వున అరిచి ఇంటికేసి పరిగెత్తుకు వచ్చాడు. ఎవరో కుర్రాళ్ళు ఒక ఆవు దూడ పైన రాళ్ళు వెయ్యగా అది బెదిరి, ధనికుడి కొడుకు కేసి వచ్చింది. దాన్ని చూసి భయపడి వాడు పరిగెత్తుతూ కింద పడ్డాడు.

ఆ కంగారులో ధనికుడు, ఊడిపోతున్న బట్టను సవరించు కుంటూ కొడుకు దగ్గిరికి ఒక్క పరుగున వచ్చాడు. ఇంటి లోపలి నుంచి, "అయ్యో, అయ్యో," అంటూ కుర్రవాడి తల్లి కూడా వచ్చింది. ఇద్దరూ తమ బిడ్డను ఇంటి లోపలికి తీసుకుపోయి, వాడి గాయాలకు మందూ మాకూ వేశారు.

ఇదంతా జరిగే సమయానికి పాపన్నా, కట్టెలు కొట్టేవాడూ చాలా దూరం వెళ్ళి పోయారు. వాళ్ళ కీ గొడవే తెలీదు. దారిలో కట్టెలు కొట్టేవాడు పాపన్నతో, "అయ్యా, మీరా ధనికుడి మాటనమ్మి, బంగారు కాను కష్టపడి వెతికి ఆయన కిచ్చారు. కాని అది మీదే. దాన్ని నేను పారేసుకుంటే మీరు వెతికి ఆ మనిషి కిచ్చేశారు," అన్నాడు.



"ఎలా చెప్పగలం? నువ్వు పారేసుకున్న కాసు ఎక్కడ పడిందో, ఎవరికి దొరికిందో, లేక యింకా పడిన చోటనే ఉన్నదో ఎవరు చెప్ప గలరు?" అన్నాడు పాపన్న.

అప్పటికి చీకటి కూడా పడిపోతూండటం చేత పాపన్న ఆ రాత్రికి కట్టెలు కొట్టేవాడి గుడిసెలోనే ఉండిపో దలిచాడు. అతనికి ఒకటే బాధగా ఉన్నది—తాను కట్టెలు కొట్టేవాడికి ఎలాటి సాయమూ చెయ్యలేక పోయాడు. అతను పారేసుకున్న కాసు కూడా వెతికి అతని కివ్వేస్తేగాని పాపన్నకు తృప్తి కలిగేటట్టు లేదు.

మర్నాడు ఉదయం కట్టెలు కొట్టేవాడు ధనికుడి తోటకు కట్టెలు కొట్టటానికి బయలు దేరేటప్పుడు పాపన్న కూడా వెంట వచ్చాడు. పాపన్న కళ్ళు నడుస్తున్నంత సేపూ నేల పైనే ఉన్నాయి. తోట కుండా ధనికుడింటికి పోయేదారి పక్కన అతనికి బంగారు కాసు కనబడింది. పాపన్న ఉత్సాహంగా దాన్ని ఎత్తి, "చూశావా? ఊరికేనే నువ్వు ఆ ధనికుణ్ణి తప్పుపట్టావు! ఇదుగో, నువ్వు పారేసుకున్న కాసు. దీన్ని నువ్వు మళ్ళీ పారేసుకోగలవు. దీన్ని మార్చి డబ్బు నీ భార్య కివ్వు, నా తోవన నేను పోతాను," అన్నాడు.

కట్టెలు కొట్టేవాడు తోటలో కట్టెలు కొట్టుకుంటూ, ధనికుడు నేల కేసి చూస్తూ తోటంతా కారాడటం చూశాడు. పాపం, ఆ ధనికుడికి తన కొడుకు ప్రమాదం గొడవ ముగిశాక ఎంత ఆలోచించినా తాను ఉట్టుడియంగా సంపాదించిన బంగారు కాసు విషయం గుర్తురాలేదు. ఆ అదా వుడిలో అది తోటలో ఎక్కడో జారి పడి పోయి ఉండాలి.

ఆ కాసు కోసం అనేక మాసాలపాటు నేలనే చూస్తూ ఇంటి పరిసరాలలో తిరగటం చేత తలవంచి, నేలను చూస్తూ నడవటం ఆయనకు అలవాటై పోయింది.







# అప్పూ-వడ్డీ

పాపన్న ఉండే గ్రామంలో ఒక కిరాణా కొట్టు పెట్టాలని, పక్క గ్రామంలో ఉండే గోవిందు డనే యువకుడు కొంత డబ్బు పోగు చేశాడు. కాని వాడి కింకా ఒక వంద రూపాయలు కావలసివచ్చింది. తన సొంత గ్రామంలో వాడి కా డబ్బు పుట్టలేదు. అప్పుడు వాడి స్నేహితు డొకడు, "ఎందుకు శ్రమపడతావు ? నువ్వు కొట్టు పెట్టదలచిన గ్రామం లోనే పరోపకారి పాపన్న ఉన్నాడు. ఆయన దగ్గిర డబ్బుంటుంది. ఎందుకంటే, ఈ మధ్యనే ఆయన కెవరో సన్మానం చేశారు. ఆయన డబ్బడిగితే లేదనడు. తిరిగి ఇవ్వకపోయినా విచారించే మనిషి కాడు," అని సలహా ఇచ్చాడు. గోవిందుడికి ఈ సలహా దివ్యంగా తోచింది. వాడు పాపన్న వద్దకు వచ్చి, తన డబ్బు చిక్కు గురించి చెప్పుకుని, వంద రూపాయ లడిగాడు.

"దానంగా కావాలా, అప్పుగా కావాలా?" అని పాపన్న అడిగాడు.

పాపన్న ఇలా అడగటం చూసి గోవిందుడు నిర్ఘాంతపోయాడు. జరిగిన దేమిటంటే, ఇటీవలనే పాపన్న తన గురువుగారిని కలుసుకోవటం జరిగింది. ఆ సందర్భంలో గురువుగారు పాపన్న వ్యవహారాలన్నీ తెలుసుకుని, "చూడు, పాపన్నా, నువ్వు దానధర్మాలు చేసేటప్పుడు పాత్రాపాత్ర విచక్షణ అవలంబించాలి. అసహాయులకు ధర్మం చెయ్యవచ్చు. నిస్సహాయులు కానివారికి డబ్బు అప్పు ఇవ్వటం కూడా సహాయమే. ఆ అప్పు తిరిగి పుచ్చుకోకపోతే సొమ్ము తిన్నవాడి పాపంలో ఇచ్చినవాడు భాగస్తు డవుతాడు," అని బోధచేశాడు.

ఈ బోధ మనసులో పెట్టుకునే పాపన్న ఆ విధంగా అడిగాడు.











గోవిందుడు అభిమానంతో, "దానం పట్టే కర్మ నాకేం పట్టిందండీ? అప్పుగానే ఇవ్వండి. మూడు నెలలలో మీ బాకీ అంతా సర్దేస్తాను. వడ్డీ ఎంత అడుగుతారో అడగండి," అన్నాడు.

"మూడు నెలల భాగ్యానికి వడ్డీ దేనికి? అసలు ఇచ్చేస్తే చాలు," అన్నాడు పాపన్న.

"పత్రం రాసి ఇవ్వమన్నారా?" అని అడిగాడు గోవిందుడు.

"నీలో నీకు విశ్వాసం లేకపోతే రాసి ఇవ్వు," అన్నాడు పాపన్న.

"నా విశ్వాసం మీరే చూస్తారుగా!" అని గోవిందుడు నూరురూపాయలు పుచ్చుకుని వెళ్ళిపోయాడు. తాను గోవిందుడికి నూరురూపాయలు అప్పిచ్చిన సంగతి పాపన్న గుర్తు రాసుకున్నాడు.

గోవిందుడు పెట్టిన గడువు మూడు నెలలూ గడిచాయి. ఈ లోపుగా పాపన్న ఎంతమందికో దానధర్మాలు చేసినట్టు వాడు తెలుసుకుని, "నా దగ్గిర గొప్ప వ్యవహర్త లాగా మాట్లాడాలని చూశాడు గాని, ఆ మనిషి నా బాకీ మాట మరి ఎత్తడు," అనుకుని తృప్తిపడ్డాడు.

పాపన్న ఒక సంవత్సరమల్లా ఆగి, గోవిందుడి వద్దకు వెళ్ళి, "ఏమోయి, నా దగ్గర ఏడాది క్రితం నూరు రూపాయలు అప్పు తీసుకున్నావు, మూడు నెలల్లో చెల్లు వేస్తానన్నావు, ఇంతవరకు చెల్లించనే లేదు. నీ వ్యాపారం బాగా సాగుతున్నదా?" అని అడిగాడు.

"వ్యాపారం బాగానే జరుగుతున్నది కానిండి, డబ్బు పోల్లించవలిసి రావటంతో మీ బాకీ తీర్చలేకపోయాను. వీలు చూసుకుని ఇస్తాలెండి," అన్నాడు గోవిందుడు.

"ఇవ్వలేకపోతే చెప్పెయ్యి. దానం చేశాననుకుంటాను," అన్నాడు పాపన్న.

నలుగురు బేరగాళ్ళు దుకాణంలో ఉన్న సమయంలో ఇంత మాట పడలేక గోవిం








డుడు, "ఛ, ఛ! దానం దేనికండీ? అప్పు అన్న తరవాత అప్పే! ఇచ్చేస్తాను," అని పాపన్నను అవతలికి తీసుకుపోయి రహస్యంగా, "చూడండి పాపన్నగారూ, బాకీ అంతా ఒక్కసారిగా ఇవ్వటం నాకూ కష్టంగానే ఉంది. నెలకు పదేసి రూపాయల చొప్పున చెల్లువేస్తాను. ఏమంటారు?" అని అడిగాడు.

పాపన్న సరే నన్నాడు. గోవిందుడు పాపన్నకు పది రూపాయ లిచ్చి పంపేశాడు. అది మొదలు వాడు పాపన్నకు నెల నెలా పదేసి రూపాయల చొప్పున ఇస్తూ వచ్చాడు.

తీర్చనవసరం లేదనుకున్న అప్పు వాయిదాల మీదనే అయినా తీర్చవలసి వచ్చేసరికి గోవిందుడికి పాపన్న పైన ఏదో కసి పుట్టుకొచ్చింది. అందుచేత వాడు పాపన్న పైన దుష్ప్రచారం ప్రారంభించాడు. పాపన్న నెలనెలా వచ్చి పదేసి రూపాయలు పుచ్చుకుపోయినప్పుడల్లా దుకాణం మీద ఎవరో ఉండేవాళ్ళు. వాళ్ళతో గోవిందుడు, "ఈ పెద్దమనిషి, చూడండి, అపరదాన కర్ణుడని అంతా చెప్పుకుంటారు. తప్పనిసరి అయి ఈయనగారి దగ్గిర ఒక వంద రూపాయలు అప్పు చేశాను. అందుకుగాను నెలకు పది రూపాయలు వడ్డీ గుంజుతు






మెలేసి తీసుకుంటున్నాడు. చచ్చినట్టు ఇచ్చుకుంటున్నాను. ఏమిటి చెయ్యటం?" అంటూ వచ్చాడు.

ఈ దుష్ప్రచారం విని అంతా ఆశ్చర్య పడ్డారు, పాపన్న పైన అభిమానం గల వాళ్ళు బాధ పడ్డారు కూడా. ఇలాటి అభిమానులలో రామయ్యశ్రేష్ఠి అనే ఆయన ఒకడు. ఆయనతో కూడా గోవిందుడు పాపన్న గురించి అందరి తోనూ అన్నట్టే అన్నాడు. అది విని రామయ్యశ్రేష్ఠి మండి పడి గోవిందుణ్ణి గట్టిగా చివాట్లు వేశాడు.

"పాపన్నగారికి వల్లమాలిన వడ్డీ చెల్లించ లేక నేను ఎలా సతమతమవుతున్నానో మీకు తెలీదు, శ్రేష్ఠిగారూ. ఈ బాకీ రద్ద యితేనేగాని నాకు నిద్రాహారాలుండవు. నా భార్య చేతినగలు అమ్మి పాపన్నగారి నుంచి ఋణవిముక్తి పొందుదామను కుంటున్నాను. కాస్త వాటిని మంచి ధరకు అమ్మిపెట్టి పుణ్యం కట్టుకోండి," అంటూ గోవిందుడు తన భార్య చేతినగలు తెచ్చి రామయ్యశ్రేష్ఠి కిచ్చాడు.

అసలు సంగతేమిటంటే, గోవిందుడి వ్యాపారం మూడు పూలూ, ఆరు కాయ లుగా ఉంది, పెట్టుబడి హెచ్చిస్తే లాభా లింకా హెచ్చే సూచనలు కనబడు తున్నాయి. అందుచేత వాడు తన భార్య నగలు ఎలాగూ అమ్మ దలిచాడు. అవి రామయ్యశ్రేష్ఠిగారి చేతిలోనే పెట్టి, పాపన్న బాకీ కోసం అమ్ముతున్నట్టు చెబితే, ఆయ నకు తన మాటలలో విశ్వాసం కుదురు తుందన్న నమ్మకంతో ఈ పని చేశాడు.

రామయ్యశ్రేష్ఠికి గోవిందుడి మాటలలో కొంత నమ్మకం కుదరనే కుదిరింది. అంత మాత్రాన ఆయనకు పాపన్నయందున్న గురి పూర్తిగా నశించక, పాపన్న వద్దకు వెళ్ళి గోవిందుడి బాకీ గురించి అడిగాడు.

"మూడు నెల్లలో తీరుస్తానని గోవిం దుడు నా దగ్గిర నూరు రూపాయలు పుచ్చు





కున్నాడు. ఏడాదిపాటు ఒక్క రూపాయి కూడా చెల్లు వెయ్యలేదు. ఆ తరవాత నేను వెళ్ళి, బాకీ తీర్చుతావా, ధర్మం కింద ఉంచుకుంటావా అని అడిగితే, నెలకు పది రూపాయల చొప్పున చెల్లు వేస్తానని తొమ్మిది మాసాలలో తొంభై రూపాయలు చెల్లు వేశాడు. ఇంకొక్క పది రూపాయ లిస్తే నా బాకీ తీరిపోతుంది. వడ్డీ ప్రసక్తే లేదు," అని పాపన్న చెప్పాడు.

గోవిందుడు యుక్తిగా అబద్ధమాడి తనను మోసగించినందుకు రామయ్య శ్రేష్ఠికి చాలా కోపం వచ్చింది. ఆయన పాపన్నతో, "పాపన్నగారూ, రేపు ఉదయం సరిగా పది కొట్టే సరికి గోవిందుడి దుకాణానికి తప్పక రావాలి. వాడు మీ బాకీ సాంతం తీర్చేస్తాడు," అన్నాడు.

రామయ్యశ్రేష్ఠి ఇలా ఎందుకన్నాడో పాపన్నకు అర్థం కాలేదు, కాని ఆయన మీది గౌరవం కొద్దీ అలాగే వస్తా నన్నాడు.

మర్నాడు పది గంటలు కొట్టటాని కింకా కొద్ది వ్యవధి ఉన్నదనగా రామయ్యశ్రేష్ఠి రూపాయలు మూట కట్టుకుని, ఒకరిద్దరు ఊరిపెద్దలను వెంటపెట్టుకుని గోవిందుడి దుకాణానికి వచ్చి, గోవిందుడితో, "ఇదుగో, నువ్విచ్చిన నగలు అమ్మగా వచ్చిన డబ్బు. మంచి ధరకే అమ్మాను. దీంతో పాపన్న



గారి అసలు ఫాయిదాలు చెల్లించి, ఋణ విముక్తుడివై, ఇకమీదట నిశ్చింతగా ఉండు," అన్నాడు.

అంతలోనే పాపన్న అక్కడికి రానే వచ్చాడు. రామయ్యశ్రేష్ఠి అతనితో, "దయ చెయ్యండి, పాపన్నగారూ. మీ గురించే అనుకుంటున్నాం. పాపం, గోవిందుడు మీ బాకీ చెల్లించటం కోసం భార్య నగలు కూడా అమ్మి డబ్బు సేకరించి, ఋణ విముక్తి పొందగోరుతున్నాడు. చిన్న వ్యాపారస్తుడు కావటంచేత భారీ వడ్డీ ఇచ్చుకోలేక సతమతమయాడు. ఇదుగో మీకు ఈ నెల రావలిసిన వడ్డీ పది రూపాయలూ, మీ రిచ్చిన అసలు నూరురూపాయలూ కలిసి నూటపది రూపాయలు," అంటూ పాపన్నకు నూటపది రూపాయలివ్వబోయాడు.

పాపన్న ఆశ్చర్యపోతూ, "అదేమిటి, శ్రేష్ఠిగారూ? గోవిందుడు నా దగ్గిర తీసుకున్నదే నూరు రూపాయలు. అంతా ఒక్కసారిగా ఇచ్చుకోలేనని, నెలకు పది చొప్పున తొమ్మిది మాసాలుగా ఇస్తూ వస్తున్నాడు. ఇంక నాకు రావలిసినది పదే. పైన ఈ నూరు ఏమిటి?" అన్నాడు.

ఈ సంగతి శ్రేష్ఠికి తెలుసుగాని, అతని వెంట వచ్చిన పెద్దలకు తెలీదు. వాళ్ళు కూడా, పాపన్న గోవిందుడి వద్ద వడ్డీ గుంజుతున్నాడనే అనుకున్నారు. గోవిందుడు ఇంత కాలంగా చేసిన నీచప్రచారం వాళ్ళకిప్పుడర్థమయింది. వాళ్ళు గోవిందుణ్ణి నానా మాటలూ అన్నారు.

పాపన్న ఆ గొడవ పట్టించుకోకుండా తనకు రావలిసిన పది రూపాయలూ తీసుకుని వెళ్ళిపోయాడు.

గోవిందుడు పాపన్న మీద నీచప్రచారం చేసినట్టు కొద్దిసేపట్లోనే ఊరంతా తెలిసిపోయింది. అతని వ్యాపారం కూడా ఆనాటి నుంచీ దెబ్బ తిన్నది.






# వృద్ధభిక్షుకుడు

పాపన్న ఉండే దేశంలో ఒకసారి యుద్ధ పరిస్థితి వచ్చింది. పొరుగు దేశపు రాజు ఈ దేశంలోని కొన్ని భాగాలు తన రాజ్యానికే చెందాలని తగాదా తెచ్చి, ఆ తగాదాను అంతకంతకూ పెంచి, చివరకు ఈ దేశం పై దురాక్రమణకు పూనుకున్నాడు. ఆయన సేనలు ఈ దేశంలోకి చొరబడి, కొన్ని గ్రామాలనూ, నగరాలనూ ఆక్రమించుకుని, చివరకు ఒక కోట వద్ద నిలవరించబడ్డాయి. అవి ఆ కోటను ముట్టడించి, నెలల తరబడి యుద్ధం సాగించి కూడా దాన్ని లోబరుచుకోలేక పోయాయి.

యుద్ధ కారణంగా దేశంలోని ప్రతి గ్రామం లోనూ గ్రామాధికారికి ప్రత్యేకమైన పనులు ఏర్పడ్డాయి. ఈ పనులు నిర్వర్తించటంలో పాపన్న తమ ఊరి గ్రామాధికారికి ఎంతో తోడ్పడ్డాడు. గ్రామాధికారి కొంత యుద్ధనిధి పోగుచేశాడు, సేనలో చేరటానికి కొందరు యువకులను సంపాదించాడు. ఆ డబ్బునూ, యువకులనూ వెంటబెట్టుకుని పాపన్న రాజధానికి వెళ్ళాడు.

అక్కడి పని పూర్తిచేసుకుని పాపన్న తిరుగుముఖమై వస్తూ చీకటిపడే వేళకు ఒక గ్రామసావడి చేరుకున్నాడు. అక్కడ అతనికి అనేకమంది బిచ్చగాళ్ళ లాటి వాళ్ళు ఒక గుంపుగా చేరి కనబడ్డారు. అంతమంది బిచ్చగాళ్ళు అక్కడ పోగవటానికి కారణ మేమిటని పాపన్న అడగగా, బిచ్చగాళ్ళనూ, గాలికి తిరిగేవాళ్ళనూ పట్టుకుని రాజధానికి పంపమని రాజాజ్ఞ అయినట్టు తెలిసింది. శత్రువుల వేగులవాళ్ళూ, గూఢచారులూ మారువేషాలతో దేశమంతటా తిరుగుతున్నట్టు రాజధానికి తెలియవచ్చిందట. ఈ బిచ్చగాళ్ళంతా ఆ ప్రాంతాలలో పట్టుబడినవాళ్ళు. వాళ్ళలో కొందరు పాపన్నను గుర్తించి, సంతోషం చెంది,







"పాపన్నగారూ, మమ్మల్ని అకారణంగా భటులు పట్టుకున్నారు. మీరైనా కాస్త మమ్మల్ని విడిపించి పుణ్యం కట్టుకోండి," అని వేడుకున్నారు.

"ఇంతలో మీకు వచ్చిన నష్టమేమిటి? రాజాజ్ఞ అమలు జరగనివ్వండి. మీకు కావలిసిన తిండి కేమీ లోపం రాదు. ఈ జరుగుతున్న యుద్ధం ముగిసేదాకా కాస్త ఓర్చుకోండి. ఆ తరవాత ఎప్పటిలాగే మీరు యథేచ్ఛగా తిరగవచ్చు," అన్నాడు పాపన్న ఆ బిచ్చగాళ్ళతో.

బిచ్చగాళ్ళలో ఒక వృద్ధుడు తెలిసిన వాళ్ళ నుంచి పాపన్న గురించి వివరాలు తెలుసుకుని, సైగ చేసి పాపన్నను దగ్గిరికి పిలిచి, రహస్యంగా, "అయ్యా, నాకు తమ వల్ల ఒక ఉపకారం కావాలి. ఈ ఊరి కోట వెలుపల తూర్పున ఒక కాళికాలయం ఉన్నది. అక్కడ నా కొడుకు ఒంటికంటి వెంకడనేవాడు ఉన్నాడు. నే నిలా చిక్కుకున్నానని వాడితో చెప్పి, నే నిచ్చే పొట్లాన్ని వాడికి అందించాలి. నే నిక ఎక్కువ కాలం బతకను. ఈ పొట్లంలో నే నొక కొత్త మంత్రం రాసి ఉంచాను. దాన్ని వాడికి మీరు చేర్చగలిగితే నా పని తీరిపోతుంది. ఈ సహాయం చేయగలవాళ్ళు నా కిప్పుడెవరూ లేరు," అన్నాడు.

"ఆ పొట్లాన్ని నా కిస్తే నేను నీ కొడుక్కు చేర్చుతాను," అన్నాడు పాపన్న.

ముసలి బిచ్చగాడు ఆ చీకట్లో పాపన్న చేతిలో ఒక పొట్లం ఉంచాడు. ఒక పాత గుడ్డలో కట్టిన ఆ పొట్లం అరిచేతి అంత వెడల్పుగానూ, పలచగానూ ఉన్నది.

మర్నాడు పాపన్న కాళికాలయాన్ని వెతుక్కుంటూ వెళ్ళి, అక్కడ ఒక యువకుణ్ణి చూశాడు. వాడు ఒంటికంటివాడు. పాపన్న వాణ్ణి, "నీ పేరేనా వెంకడు?" అని అడిగి, వా డవునన్న మీదట, "నీ తండ్రి దీన్ని నీ కివ్వమన్నాడు," అంటూ పొట్లం







వాడి చేతిలో పెట్టి, "నీ తండ్రిని అధికారులు పట్టుకుపోయారు," అని చెప్పి దేవి దర్శనం చేసుకునేటందుకు ఆలయం లోపలికి వెళ్ళారు.

ఆ దేవాలయంలో నలుగురే ఉంటారు. ఒకడు అర్చకుడూ, రెండోవాడు దేవాలయం నౌకరూ, మూడోవాడు వెంకడూ, నాలుగోవాడు వెంకడి సహచరుడూనూ. వెంకడు పొట్లం విప్పి, తన సహచరుడు తెచ్చిన గుడ్డపీలికను నీటితో తడిపే సరికి సాంకేతిక లిపిలో రాసి ఉన్నది ఏదో బయట పడింది. అందులో కొన్ని గీత లేవో ఉన్నాయి. అదిగాక కొంత రాత కూడా ఉన్నది. ఆ రాతలో పాపన్నకు సంబంధించిన విషయా లిలా ఉన్నాయి: "ఇది తెచ్చేవాడే పరోపకారి పాపన్న. రాజుకు స్నేహపాత్రుడు. ఇతన్ని చెరలో పెట్టించు."

పాపన్న దేవాలయం నుంచి వెళ్ళిపోతున్నప్పుడు ఒంటికన్ను వెంకడు అతన్ని సమీపించి, "మీరు మా ఆతిథ్యం స్వీకరించాలి, పాపన్నగారూ. అమూల్యమైన సమాచారం తెచ్చినందుకు మీకు మా రాజుగారు గొప్ప బహుమానం ఇస్తారు. ఇవాళ రాత్రే మన ప్రయాణం," అన్నాడు. అతనా మాట అంటూండగానే అతని సహచరుడూ, అర్చకుడూ వచ్చి పాపన్న చెరొక రెక్కా పట్టుకున్నారు. "ఏమిటీ దౌర్జన్యం? నువ్వెవరు? ఆ బిచ్చగాడి కొడుకువు కావా?" అని పాపన్న అంటూండగా దేవాలయం నౌకరు పెద్ద తాడొకటి పట్టుకొచ్చాడు.

"ఇదంతా ఒక నాటకం. మీరు మాకు ఉపకారమే చేశారు గాని, మిమ్మల్ని బంధించక తప్పదు. మిమ్మల్ని విడిపించుకోవటానికి మీ రాజు మాకు అర్థరాజ్యమిస్తాడో, రాజ్యమంతా ఇస్తాడో చూడాలి," అన్నాడు ఒంటి కన్నువాడు.

"అదా సంగతి? మీరు పూర్తిగా పొరబడ్డారు. నేను మీ రనుకుంటున్నంత ముఖ్యుణ్ణి







కాను. నన్ను మీరు చంపినా మా రాజుగారు లెక్కచెయ్యరు. యుద్ధంలో చచ్చేవాళ్ళతో బాటే నేనూనూ. కావలిస్తే నన్ను చంపండి. కాని అందువల్ల మీ కింత పాపం తప్ప మరేమీ దక్కదు," అన్నాడు పాపన్న.

వాళ్ళు అతని చేతులు కలిపి కట్టి ఒక కొట్టులోకి నెట్టి తలుపులు మూసేశారు. గుడి ఉండే ప్రాంతం నిర్జనమైనది, తాను కేకలు పెట్టినా పలికే దిక్కుండదని పాపన్న గ్రహించాడు. గుడిలో వాళ్ళంతా శత్రువులూ, శత్రువుల మనుషులూనూ. ముసలి బిచ్చగాడు కూడా గూఢచారే. వాడు రాజధానికి సంబంధించిన రహస్య మార్గాలు మొదలైనవన్నీ చిత్రించి తన కొడుక్కు అందజేశాడు. ముసలివాడు పట్టుబడ్డాడు గాని ఒంటి కన్నువాడు స్వేచ్ఛగానే ఉన్నాడు. వాడా రహస్యాలను శత్రు రాజుకు చేరుస్తాడు.

పాపన్న అసాధారణ బలాఢ్యుడు కావటం చేత తన చేతికి కట్టిన తాళ్ళు వదిలించుకుని జరగగల దాని కెదురు చూస్తూ కొట్టులో ఉన్నాడు. ఆ రాత్రి ఒంటి కన్నువాడు యోధుడి వేషంలో, తన అనుచరుడితో సహా వచ్చి, కొట్టు తలుపు తెరిపించి, పాపన్నను బయటికి రమ్మని, "ఇక మనం మా రాజుగారి దగ్గిరికి బయలుదేరుతున్నాం. పెద్దమనిషిలా మా వెంటరావాలి. దారిలో నువ్వేదైనా కోతి పని చేశావో మా కత్తులు రుచి చూస్తావు? వాటి రుచి నీకు తెలుసా?" అన్నాడు.

"నాకు తెలీదు. అసలు మీ చేతిలో కత్తులుండటమే తప్పు," అంటూ పాపన్న ఒంటికంటి వాడి చేతి మీద బలంగా ఒక్కటి పెట్టాడు. ఆ దెబ్బతో వాడి చేతి కత్తి కింద పడింది, చెయ్యి నీలుక్కుపోయి చచ్చే బాధ పెట్టింది. అది చూసి వాడి అనుచరుడు పాపన్న పైకి తన కత్తి ఎత్తాడు. పాపన్న వాడి చేతి మీద కూడా బలంగా





కొట్టి, కత్తి కింద పడేయించాడు. తరవాత అతను రెండు కత్తులూ తీసి దూరంగా విసిరి పారేశాడు.

ఇంతలో అర్చకుడూ, నౌకరూ బలమైన తాళ్ళు తెచ్చారు. పాపన్న ఒంటికన్ను వాణ్ణి, వాడి అనుచరుణ్ణి చచ్చేటట్టు తన్ని, అర్చకుడు తెచ్చిన తాడు లాక్కుని, వాళ్ళిద్దరినీ పెడరెక్కలు విరిచి కట్టి, భయంతో కంపించిపోతున్న అర్చకుణ్ణీ, గుడి నౌకరునూ కూడా అలాగే కట్టి, నలుగురినీ గదిలోకి తోసి, తలుపు బిగించాడు. తరవాత అతను గ్రామాధికారి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళి, తనకు నలుగురు గూఢచారులు చిక్కారనీ, వాళ్ళను పట్టుకుపోవటానికి భటులు కావాలనీ చెప్పాడు.

భటులు వచ్చి నలుగురినీ వశపరచుకున్నారు, ముసలి బిచ్చగాడు పంపిన సంకేత సందేశాన్నీ, ఇతర వస్తువులనూ స్వాధీనం చేసుకున్నారు. పాపన్న వాళ్ళ వెంట రాజధానికి వెళ్ళి, రాజుగారికి జరిగినదంతా సవిస్తరంగా చెప్పాడు.

రాజుగారు ఖైదీ బిచ్చగాళ్ళలో నుంచి ముసలి బిచ్చగాణ్ణి ఏరి, విచారించగా, వాడు శత్రురాజు పినతండ్రి అనీ, ఒంటి కన్ను వాడు ఆయన కొడుకే ననీ బయట పడింది. తరవాత రాజుగారు శత్రురాజుకు, "మీ పినతండ్రీ, ఆయన కొడుకూ మాకు బందీలుగా చిక్కారు. మీ సేనలు వెంటనే మా రాజ్యం వదిలి పోవాలి. యుద్ధ నష్టం కింద మీరు లక్షవరహాలు చెల్లించాలి. లేని పక్షంలో మీ పినతండ్రి తలా, ఆయన కొడుకు తలా తీయించి, మీతో యుద్ధం కొనసాగిస్తాం," అని కబురు చేశాడు.

తన వాళ్ళను విడిపించుకో గలందులకు శత్రురాజు షరతు లన్నిటికీ ఒప్పుకున్నాడు. దేశానికి యుద్ధభయం తీరిపోయింది. ఇతర యోధులతో బాటు పాపన్నకు కూడా రాజుగారు మంచి సన్మానం చేశాడు.





# ఎద్దుబేరం

ఒకసారి పాపన్న తన అత్తవారూరు వెళ్ళి, అక్కడ పొలాల మీద రావలిసిన సొమ్ము మూడు వందల రూపాయలు వసూలు చేసి ఇంటి మార్గం పట్టి రాసాగాడు. దారిలో అతని కొక హృదయ విదారకమైన దృశ్యం కంటపడింది.

దారి మధ్య ఒక లాగుడుబండి నిలబడి ఉన్నది. దానికి ఒక ఎద్దు కట్టి ఉన్నది. బండి మీద ఎత్తుగా ధాన్యపు బస్తాలు పేర్చి ఉన్నాయి. అంత బరువును ఆ బక్క ఎద్దు అక్కడి దాకా ఎలా లాగు కొచ్చిందో పాపన్నకు అర్థం కాలేదు. అది బాగా అలిసి నిస్త్రాణగా ఉన్నది.

నిర్జనంగా ఉన్న ఆ ప్రాంతంలో పాపన్న కనిపించగానే బండివాడు, "అయ్యా, నేను అల్లా కాలవ దాకా వెళ్ళి దాహం తీర్చుకుని వస్తాను. ఈ బండి కాస్త చూస్తూ ఉండండి," అన్నాడు.

"అలాగే వెళ్ళిరా," అని పాపన్న అక్కడే నిలబడ్డాడు.

కొంచెం సేపట్లో బండివాడు నీళ్ళు తాగి తిరిగి వచ్చి, "బతికించారు, బాబూ. ఈ కాలంలో సహాయపడే వాళ్ళు కరువయా రండి. బండిని తొయ్యమని పావలా ఇచ్చి ఇద్దరు మనుషులను పెడితే, వాళ్ళు ఇక్కడి దాకా బండిని తోసుకొచ్చి, ఇంక తమ వల్ల కాదని వెళ్ళిపోయారండి. ఒక్కణ్ణే ఏం చావను?" అని పాపన్నతో అని, "హై, హై," అని ఎద్దును అదిలించసాగాడు.

ఎద్దు బండిని లాగటానికి ప్రయత్నిం చింది గాని, బండి మటుకు కదలలేదు. బండివాడు ఎద్దును బాదసాగాడు.

పాపన్న బండివాడి చేతిలో ఉండే కర్ర లాగేసి, "నువ్వు మాత్రం ఏమన్న మని షివి? నువ్వు వెళ్ళి నీళ్ళు తాగివస్తే ఎద్దు దప్పిక తీరినట్టేనా?" అంటూ ఎద్దును







కాడి నుంచి విప్పి, కాలవ కేసి తీసుకు పోబోయాడు.

బండివాడు సిగ్గుపడి, "తప్పే లెండి. మీ కెందుకు శ్రమ? నేనే ఎద్దుకు నీరుపెట్టి తెస్తాను," అంటూ ఎద్దు తాళ్ళు తాను తీసుకున్నాడు.

"దాహంతో పాటు ఎద్దుకు ఆకలి కూడా ఉండవచ్చు. కాస్త గడ్డి కూడా మేపి మరీ తీసుకురా. నువ్వు వచ్చిన దాకా నే నిక్కడే బండి చూస్తూ ఉంటాలే. భయం లేదు," అన్నాడు పావన్న.

కొంత సేపటికి బండివాడు ఎద్దుతో సహా తిరిగి వచ్చి, దాన్ని బండికి కట్టి అదిలించాడు. కాని బండిని కదిలించటం ఎద్దుకు సాధ్యం కాలేదు.

అది చూసి పావన్న, "రెండెడ్ల బండి మీద ఎక్కించేటంత సామాను ఈ లాగుడు బండి మీద వేశావు గదా, ఎద్దు ఎలా లాగుతుంది? సగం సరుకు ఇక్కడ దించి మిగతాది చేర్చి, రెండోసారికి దించిన సరుకు తీసుకుపో. నే నిక్కడే కాపలా ఉంటాను," అన్నాడు.

"మీ రెవరో దేవుడల్లే సహాయం వచ్చారు గాని, సామానులో కొంత దించటానికి వీల్లేదు. ఇంత సామానూ ఈ ఎద్దు చేత లాగించి తీసుకుపోవాలి. అలా నియమం జరిగింది," అన్నాడు బండివాడు.

వింతగా వుంది, అదేం నియమ మని పావన్న అడిగితే, దాన్ని గురించి బండివాడు ఇలా చెప్పాడు:

బండివాడి పేరు బతన్న. వాడు సామాన్ల బండి పెట్టుకుని, దాన్ని ఎద్దు చేత లాగించి జీవనం చేస్తున్నాడు. ఎద్దును అమ్మేసి దానితో తానే సరుకు కొని, బండిని తానే లాగుతూ సరుకును చేరవేసుకోవాలని వాడికి ఆలోచన వచ్చింది. పొరుగు గ్రామంలో ఉన్న శరభాద్రిగారనే ధనికుడికి బతన్న తన ఎద్దును అమ్మజూపాడు. ఎంత





కిస్తా నన్నారు శరభాద్రి. నూరు రూపాయల కిస్తా సన్నారు బతన్న.

"ఛీ పోరా! బక్క బస్తా ధాన్యంకూడా లాగలేని ఈ బక్క ఎద్దుకు నూరురూపాయ లెవడిస్తాడు?" అన్నారు శరభాద్రి.

"అంత తీసెయ్యకండి, బాబూ. అది లాగే బరువు ఏ ఎద్దూ లాగలేదు. అలా కాని పక్షంలో నా ఎద్దును ఊరికే ఇచ్చేస్తాను," అని బతన్న ప్రగల్భాలు పలికాడు.

"అయితే నేను కొంత సరుకు బాబితా ఇస్తాను. దాన్ని బస్తీలో ఫలాని షావుకారు కిచ్చి, ఆ సరు కంతా బండి మీద వేసి, నీ ఎద్దు చేత మా ఇంటికి లాగించి తీసుకురా. నువ్వడిగినట్టు నూరురూపాయ లిచ్చి ఎద్దును కొంటాను," అన్నారు శరభాద్రి.

బుద్ధి తక్కువై బతన్న అందుకు ఒప్పుకున్నాడు. బాబితా ప్రకారం సరుకు తీసుకుని బండి కెత్తి, ఎద్దును పూన్చాడు. ఎద్దు లాగలేకపోయింది. బండి రెండు మైళ్ళు పోవాలి. బతన్న ఇద్దరు కూలివాళ్ళను పావలా డబ్బులకు మాట్లాడి, వాళ్ళ చేత బండి తోయించు కుంటూ వచ్చాడు. ఒక మైలు వచ్చి వాళ్ళద్దరూ, "ఇక మేం తొయ్యలేం," అని వెళ్ళిపోయారు. ఇంకో మైలు వెళితే గాని శరభాద్రిగారి ఇల్లు రాదు. సామాను ఎద్దు చేత లాగించకపోతే





శరభాద్రి ఎద్దును కొనడు సరేకదా, కూలి డబ్బులు కూడా ఇవ్వడు.

ఈ సంగతు లన్నీ వినే సరికి పాపన్నకు ఐతన్న మీద జాలి కలిగింది. "కూలి ఏదో మాట అన్నావు గదా అది ఎద్దు నిలా చంపుకు తింటావా? నీకు కావలిసింది, ఎద్దును నూరు రూపాయల కమ్మటమే గద. ఆ వంద రూపాయలూ నే నిస్తాను, నాకు ఎద్దు నిచ్చెయ్యి," అన్నా డతను ఐతన్నతో.

ఐతన్న కళ్ళు వెళ్ళబెట్టుకు చూస్తూ, నోట మాట రాకుండానే, పాపన్న ఇచ్చిన నూరు రూపాయలూ పుచ్చుకున్నాడు. పాపన్న ఎద్దును బండి నుంచి విప్పి, మేతకు వదిలిపెట్టాడు.

"ఈ సరుకు శరభాద్రిగారి ఇంటికి ఎలా చేరుస్తావు? నే నేదైనా రెండెడ్లబండి పంపుతాను. దాని మీద సామాను చేర్చి, ఎద్దు దారిలోనే మంచి వెలకు అమ్ముడయిందని శరభాద్రిగారితో చెప్పెయ్యి. ఏ చిక్కూ రాదు. ఏం?" అన్నాడు పాపన్న.

"అదంతా నేను తంటాలు పడతాలెండి. ఇవాళ నాకు తమ వంటి పుణ్యాత్ముడు దొరకటం నా అదృష్టం. మీ మేలు ఎన్నటికీ మరవను...అదుగో ఖాళీ బండి ఒకటి ఇటే వస్తున్నది. దాని మీద సరుకు చేరుస్తాలెండి," అన్నాడు ఐతన్న.

పాపన్న ఎద్దును తోలుకుని తన దారిన తాను వెళ్ళాక, ఐతన్న ఖాళీబండిని పిలిచి, తన బండి మీద ఉన్న సరుకంతా దాని మీద ఎక్కించి, తన ఖాళీబండిని తానే ఈడ్చుకుంటూ శరభాద్రిగారి ఇంటికి చేరుకున్నాడు.

"సామాను తెచ్చావు సరే, నీ ఎద్దేది?" అని శరభాద్రి అడిగాడు.

"ఆ ఎద్దును చూసినవాళ్ళు ఎగరేసుకు పోరుటండీ? మీ సరుకులు వేసుకుని సగం దూరం వచ్చానో లేదో, ఒక పెద్దమనిషి





ఎదురై, 'ఎవరిదీ ఎద్దు? ఇంత సామానునునాయాసంగా లాగేస్తున్నదే!' అన్నాడండి. తమకు నూరురూపాయలకు అమ్ముతానని ఒప్పుకున్నానని చెప్పానండి. మరో అయిదు రూపాయలు వేసి, నూటఅయిదు రూపాయలకు ఆ ఎద్దును ఆయన అవళంగానే కొనుక్కు పోయాడండి. మీ వరుకు చేరటానికి ఇంకో బండి కూడా ఆయనే ఏర్పాటు చేసి మరీ వెళ్ళాడండి," అన్నాడు బతన్న.

శరభాద్రి ఆశ్చర్యపోయి, ఎద్దును కొన్న వాడి పేరడిగాడు. ఆయన పేరు తనకు తెలియదనీ, ఎవరైనప్పటికీ ఎద్దు నాణెం బాగా తెలిసినవాడనీ శరభాద్రిని కాస్త ఎత్తి పొడిచి బతన్న సెలవు తీసుకున్నాడు. దాని విలువ తాను తెలుసుకోలేనందుకు శరభాద్రి నొచ్చుకున్నాడు.

తరవాత మూడు నెలలకు సంక్రాంతి పండగ వచ్చింది. ఎద్దుల పందాలు జరిగాయి. మూడు నెల్లపాటు పాపన్న పోషణలో ఉన్న కారణంగా అతని ఎద్దు బాగా బలిసి, పందెంలో ఆ చుట్టుపక్కల ఎద్దులన్నిటినీ ఓడించింది.

పందాలు చూడటానికి వచ్చినవారిలో శరభాద్రి, బతన్నా కూడా ఉన్నారు.

బతన్న శరభాద్రికి పాపన్ననూ, గెలిచిన ఎద్దునూ చూపించి, "ఎద్దు తడాఖా ఇప్పుడు కళ్ళారా చూశారుగా? అదుగో ఆయనే దాన్ని కొన్నవాడు," అన్నాడు.

శరభాద్రి పాపన్నను సమీపించి, "ఈ ఎద్దును నేను కొందా మనుకుంటుండగా మీరు కొనేశారు. నేను ఎద్దుగల వాడితో ఖండితంగా కొంటానని చెప్పకపోవటం నాదే తప్పనుకోండి. ఇప్పటికైనా మీరు అమ్మే పక్షంలో కొంటాను," అన్నాడు.

"కావాలంటే తీసుకోండి. నాకేమీ అభ్యంతరం లేదు," అన్నాడు పాపన్న.

శరభాద్రి ఆ ఎద్దును నూటయాభై రూపాయలిచ్చి గర్వంగా తోలుకుపోయాడు.








# లోభీ-వ్యాధీ

పాపన్న ఉండే గ్రామానికి ఒక ఆమడ దూరంలో ఉన్న ఊళ్ళో కనకయ్య అనే భూస్వామి ఉండేవాడు. కట్టుకుపోయినంత డబ్బుండి కూడా ఆ కనకయ్య పరమలోభి. కాని ఖర్చు చెయ్యాలంటే ప్రాణం మీదికి వచ్చేది. అటువంటి వాడికి కాస్త గుండె నొప్పి ప్రారంభమయింది.

గుండెనొప్పి చాలా చెడ్డ జబ్బు. దానికి చికిత్స జరగకపోతే ప్రమాదం. చికిత్స చేయించాలంటే డబ్బు ఖర్చవుతుంది. అందుచేత కనకయ్య మొదట్లో అదే పోతుందని తాత్సారం చేశాడు. ఆ నొప్పి కూడా నిలకడగా ఉండక, వస్తూ పోతూ ఉండేది. అది పోయినప్పుడు ఇక రాదనుకునేవాడు కనకయ్య. కాని అది తిరిగి వచ్చేది. అప్పుడు కనకయ్య, "ఛీ, ఈ దిక్కుమాలిన నొప్పి వైద్యం చేస్తేగాని నయమయేటట్టు లేదు," అనుకునేవాడు.

కనకయ్య ఇంట్లో వెంకడనేవాడు పని చేస్తూండేవాడు. వెంకడు జీతానికి కుదిరిన నౌకరుకాడు, కనకయ్యకు ఋణపడి, బాకీ తీర్చలేక, పనిచేసి ఋణం చెల్లబెట్టుతున్నవాడు. కనకయ్య వెంకణ్ణి పిలిచి, "గుండె నొప్పికి వైద్యం చేసేవాళ్ళెవరన్నా ఉన్నారేమో నీకు తెలుసా?" అని అడిగాడు.

"మా పల్లెలో ఒకడికి గుండె నొప్పి వస్తుందండి. వాడు భస్మాల వైద్యుడి దగ్గిర మందు తినుకుంటున్నాడు. ఆ భస్మాల వైద్యు డెక్కడుంటాడో కనుక్కుని చెబుతాను," అన్నాడు వెంకడు.

"మళ్ళీ కనుక్కోవటం దేనికిలే? మీ పల్లెలోవాణ్ణే అడిగి బేడాకో, పావలాకో ఆ మందే పట్టుకురా," అన్నాడు కనకయ్య. వెంకడు తనకు బాకీ ఉన్నవాడు గనక వాడి చేతిలో కనకయ్య డబ్బులు పెట్టలేదు. వెంకడు తన పల్లెలో ఉండేవాణ్ణి బతిమాలి,







వాడు తీసుకుంటున్న మందులో కొంత తెచ్చి కనకయ్యకు ఇచ్చాడు. కనకయ్య దాన్ని పొదుపుగా కొంచెం కొంచెమే తీసుకుంటూ వచ్చాడు. కాని నొప్పి తగ్గలేదు. మందు కాస్తా అయిపోయింది. మరికొంచెం మందు పట్టుకు రమ్మని కనకయ్య వెంకణ్ణి మళ్ళీ అడిగాడు. "ఇంక అక్కడ మందు దొరక దండీ. వాడికి గుండె నొప్పి నిలిచిపోయిందిట. మందు మానేశాడు," అన్నాడు వెంకడు.

"అయితే ఆ వైద్యు డెక్కడ ఉంటాడో, ఏ విధంగా మందిస్తాడో వివరంగా తెలుసుకురా," అన్నాడు కనకయ్య. వెంకడు మర్నాడు వచ్చి వివరాలు చెప్పాడు.

భస్మ వైద్యుడుండే గ్రామం నాలుగు మైళ్ళ దూరాన ఉన్నది. ఆయన పేదవాళ్ల దగ్గిర వారంరోజుల మందుకు పావలా తీసుకుంటాడు, కాని కలిగినవాళ్ళ దగ్గిర రూపాయికి తక్కువ తీసుకోడు.

ఈ మాట విని కనకయ్య చాలా బాధ పడ్డాడు. వారంవారం రూపాయిబిళ్ళ కుదుములాగా ఖర్చుచేసి మందు తీసుకోవాలంటే ప్రాణం పోయినంత పనవుతుంది. మందు తీసుకోకుండా ఉందామనుకుంటే గుండె నొప్పితో ప్రాణమే పోవచ్చు. ఈ చిక్కు విడక మూడు రోజులు మథన పడి కనకయ్య ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఒక రోజు వేకువజామున కనకయ్య వెంకడితో, "నేను తొందర పనిమీద పొరుగూరు పోతున్నాను. నువ్వు మాత్రం నేను తిరిగి వచ్చేదాకా అక్కడే ఉండు, ఎటూ పోకు," అని బయలుదేరాడు. ఆయన తిన్నగా వెంక డుండే పల్లెకు చేరుకుని, వెంకడి గుడిసెకు వెళ్లాడు. ఇంట్లో వెంకడి కొడుకు లిద్దరు మాత్రమే ఉన్నారు. "మీ అమ్మ ఏదిరా?" అని అడిగితే, పొలంలో గడ్డి కోసుకు రాబోయిందన్నారు.

వెంకడి పెద్ద కొడుకు పన్నెండేళ్లవాడి చేతిలో ఒక పావలా పెట్టి కనకయ్య, "నీకు





భస్మాల వైద్యుడి ఊరూ, ఇల్లూ తెలుసా? అయితే వెంటనే వెళ్ళి, మీ నాన్నకు గుండె నొప్పి వస్తున్నదని చెప్పి, ఒక వారానికి సరిపోయే మందు పట్టుకురా. వైద్యుడితో ఏం చెబుతావు?" అన్నాడు.

"మా నాన్నకు గుండె నొప్పి వస్తున్నది. ఒక వారానికి మందియ్యమని చెబుతా," అన్నాడు వెంకడి కొడుకు.

"చాలా బాధపడుతున్నాడని చెప్పు. ఏం? నువ్వు వచ్చేదాకా నేనిక్కడే ఉంటా," అన్నాడు కనకయ్య, చౌకలో మందు దొరుకుతుందని ఉబలాటపడుతూ.



వెంకడి కొడుకు పావలా తీసుకుని వైద్యుడి గ్రామానికి పొలాల వెంట పరిగెత్తి పోతుంటే, వాడి తల్లి గడ్డి కోసు కుంటూ వాణ్ణి చూసి, "ఎక్కడికిరా?" అని అడిగింది.

"అయ్యకు గుండె నొప్పిట. చాలా బాధ పడుతున్నాట్ట. కనకయ్యగారు మనింటి కొచ్చి, ఈ పావలా డబ్బులు ఇచ్చి త్వరగా మందు తెమ్మని నన్ను పంపారు," అని చెప్పాడు కుర్రాడు.

వెంకడి భార్య కంగారుపడి, "ఇదేం గ్రహచారంరా, బాబూ! ఆ దబ్బిటియ్య, మందు నువేం తెస్తావు? నేనే పోతా," అంటూ పావలా తీసుకుని, రెండుమైళ్ళ దూరంలో ఉన్న వైద్యుడి గ్రామం చేరి, వైద్యుడింటికి వెళ్ళి, "బాబూ, మా ఆయనకు గుండెనొప్పి వచ్చి చాలా బాధపడుతున్నారు. ఈ పావలా తీసుకుని మందిచ్చి పుణ్యం కట్టుకోండి," అన్నది.

వైద్యు డామెను ఎగాదిగా చూసి, "రోగిని యిక్కడికి తీసుకురా, చూడకుండా మందివ్వను," అన్నాడు.

రోగి అయిదారు మైళ్ళదూరాన కనకయ్య గారింట ఉన్నాడనీ, నడవలేడనీ, మందిచ్చి ప్రాణం కాపాడమేనీ వెంకడిభార్య వైద్యుడి కాళ్ళావేళ్ళా పడింది.







"కనకయ్యగారంటే పేరుమోసిన భూస్వామిగదా. ఆయనింట పనిచేసేవాడికి ఆయనే గదా మందిప్పిస్తారు. రూపాయకు తక్కువైతే మందివ్వను. అయినా రోగిని చూడాలి," అన్నాడు వైద్యుడు.

తన భర్త జీతానికున్న నౌకరు కాదనీ బుణపడి శ్రమచేసి బాకీ తీరుస్తున్నాడనీ చెప్పి, ఆమె వైద్యుణ్ణి తనవెంట రమ్మన్నది.

"నేనెలా వస్తాను? నా కోసం ఎక్కడెక్కడి నుంచో వస్తారు. ఈ పెద్దమనిషిని చూడు, రెండు కోసులదూరం నుంచి నా కోసం బండి కట్టుకుని వచ్చాడు," అన్నాడు వైద్యుడు. వైద్యుడు చెప్పిన మనిషి పాపన్నే. అతను జరిగినదంతా చూస్తూనే ఉంది. వెంకడి భార్యతో, "నా బండి మీద రామ్మా, నీ భర్తను తీసుకు వద్దాం. వైద్యుడుగారు చూసి మందిస్తారు," అన్నాడు.

పాపన్న వెంకడి భార్యను బండిలో ఎక్కించుకుని కనకయ్య ఇంటికి వచ్చాడు. వెంక డక్కడే ఉండి, భార్యను చూసి ఆశ్చర్యపడ్డాడు. భార్య కూడా, పిడిరాయి లాగున్న భర్తను చూసి, "జబ్బు నయమయిందా ఏం?" అన్నది.

"నాకేం జబ్బు?" అన్నాడు వెంకడు.

వెంకడి భార్య జరిగినదంతా చెప్పింది.

"అయ్యగారు కూడా బాగానే ఉన్నారే. పొరుగూరు వెళ్ళొస్తానని వేకువనే బయల్దేరారు. దారిలో మనవాడు కనిపిస్తే ఏదో చెప్పివుంటారు, వాడింకేదో అర్థం చేసుకుని ఉంటాడు," అన్నాడు వెంకడు.

భార్యా భర్త లిద్దరూ పాపన్నకు అనవసరంగా శ్రమ ఇచ్చినందుకు క్షమాపణ చెప్పుకున్నారు. పాపన్న బండి తోలుకుంటూ తన గ్రామానికి బయలుదేరాడు.

ఈలోపల వెంకడి గుడిసెలో వేచి ఉన్న కనకయ్య, వెంకడి కొడుకు తిరిగి రావటం చూసి, "ఏంరా, మందేదీ? అప్పుడే వచ్చావేం?" అన్నాడు.





"మందు మా అమ్మ తెస్తానని వెళ్ళింది," అన్నాడు కుర్రాడు.

వెంకడి భార్య ఎంతకూ రాలేదు. కనకయ్యకు గుండెనొప్పి ఆరంభమై, హెచ్చే టట్టు కనబడింది. ఆయన వెళుతున్నానని కుర్రాడికి చెప్పి, వైద్యుడి గ్రామం కేసి నడక సాగించాడు. దారిలో వెంకడి భార్య మందుతో ఎదురు వస్తుందని ఆయన ఆశ.

ఒకవేళ ఆమె రాకపోతే తాను వైద్యుడి దగ్గిరికి వెళ్ళవలిసి వస్తుంది. తనను చూసి ధనికు డనుకుని వైద్యుడు మందుకు రూపాయి అడుగుతాడు. ఈ భయంతో కనకయ్య తన చేతి ఉంగరాలూ, డబ్బు సంచీ, చొక్కా తీసి మూట గట్టి, అది పట్టుకుని, రెండో చేత్తో గుండెను అదిమి పెట్టుకుని నడుస్తూ, దారిలో ఒకచోట స్పృహతప్పి పడిపోయాడు.

బండి తోలుకుంటూ అటుగా వచ్చే పాపన్న ఆయనను చూసి, బండి ఆపి, ఆయన ముఖాన అన్ని నీళ్ళు చల్లి, స్పృహ తెప్పించాడు.

కళ్ళు తెరుస్తూనే కనకయ్య, "మందు తెచ్చావామ్మా?" అని అడిగాడు.

ఆ మాటలు పాపన్నకు అర్థంకాక, కనకయ్యను ఎత్తి బండిలో పెట్టి, బండిని మళ్ళీ వైద్యు డింటికి తోలుకుపోయాడు.



వైద్యుడు రోగిని పరీక్షించి, "రోగం చాలా ముదిరింది. రోజూ పరీక్ష చేస్తూ మందివ్వాలి. ఎవరీ మనిషి?" అన్నాడు.

"నాకు తెలీదండి, ఎవరో అనాథలా గున్నాడు. మీరు చికిత్స చెయ్యండి. నేను రోజూ బండిలో తెస్తాను. మందు ఖర్చు కూడా ఇచ్చుకుంటాను," అన్నాడు పాపన్న.

కనకయ్యకు మర్నాటికి గాని పూర్తిగా స్పృహ రాలేదు. ఒళ్ళు తెలియగానే ఆయన, "మీ రెవరు? నే నెక్కడ ఉన్నాను?" అని పాపన్నను అడిగాడు.

"క్షేమమైన చోటనే ఉన్నావు. నీ కేమీ భయం లేదు. నువ్వెవరు? నీ పేరేమిటి?" అని పాపన్న అడిగాడు.

"నా పేరుతో ఏం పనిలెండి. ఎవడో దిక్కులేని వాణ్ణి. నా మూట ఏది?" అన్నాడు కనకయ్య.

"నీ మూట భద్రంగానే ఉంది. వారం రోజులపాటు కుదురుగా ఉండి మందు తీసుకుంటే ఆ తరవాత నువ్వు స్వేచ్ఛగా నీ యిష్టం వచ్చినట్టు తిరగవచ్చు," అన్నాడు పాపన్న. కనకయ్య పారిపోతాడని అనుమానం తగిలి, అలాటి పని జరగకుండా కట్టు దిట్టాలు చేశాడు.

అక్కడ కనకయ్య కుటుంబానికి కనకయ్య ఏమైపోయిందీ తెలియరాలేదు. వాళ్ళు ఆరాలు తీయగాతీయగా చివరకు పాపన్న ఇంట్లో కనకయ్య దొరికాడు. తాను అనాథుడు కాడనీ, పెద్ద భూస్వామి అనీ పాపన్నకు తెలిసిపోయే సరికి కనకయ్యకు చచ్చే అవమానమయింది. తాను వ్యాధి తీవ్రతలో మతి చెడి ఏం మాట్లాడినదీ తనకే తెలియదని చెప్పుకుని, కనకయ్య తన మందు ఖర్చే గాక, పాపన్నకు కొంత బహుమానం కూడా ఇచ్చి, తన ఊరికి తిరిగి వెళ్ళాడు. కొన్ని వారాలపాటు వైద్యం చేయించుకున్నాక కనకయ్య గుండె నొప్పి తగ్గిపోయింది.





# తిరునాళ్ళ సందడి

సుబ్బారాయుడి కొండ మీద జరిగే ఉత్సవానికి పాపన్న సకుటుంబంగా వెళ్ళాడు. ఉత్తవ్వరా ప్రాంతంలో కుగ్రామాలు తప్ప ఏమీ లేకపోయినా తిరునాళ్ళకు జనం తండోపతండంగా వచ్చి వేడుక చూస్తారు, మొక్కులూ అవీ ఉంటే చెల్లిస్తారు. ఎన్నో అంగళ్ళు పెడతారు. అనేక వేడుకలు జరుగుతాయి.

పాపన్న ఈ ఉత్సవానికి వచ్చి సత్రంలో బస చేశాడు. ఉదయం పూట అతను కాల కృత్యాలు తీర్చుకోవటానికిగాను కొండ పక్కన ప్రవహించే వాగు కేసి వెళ్ళి, స్నానం చేసి, తిరిగివస్తూండగా, ఒక ముసలాయన, "ఇక నడవలేను, సుబ్బారాయుడా!" అంటూ ఒక బండ మీద చతికిలబడ్డాడు. ఆ ముసలాయన పాపన్నకు తెలిసినవాడే.

"ఏం, తాతా?" అంటూ పాపన్న దగ్గిరికి వచ్చేసరికి ముసలాయన తల ఎత్తి చూసి, "పాపన్నవా? సుబ్బారాయుడల్లే వచ్చావు! ఒక్క చిన్న ఉపకారం చేసి పెడుదూ! ఈ డబ్బాలో ముడుపున్నది, దాన్ని కాస్త దేవుడి హుండీలో వేస్తావా? ఎలాగో ఇక్కడిదాకా నడిచి వచ్చానుగాని, కొండ ఎక్కలేను. ఇక్కడే ఉంటాను, కాస్త దేవుడి ప్రసాదం మటుకు తెచ్చి పెట్టు," అన్నాడు.

ముసలాయన తన ఇంకే సహాయమూ అవసరం లేదనీ, తన వద్ద భోజనపదార్థాలూ అవీ ఉన్నాయనీ అన్నాడు. అందుచేత పాపన్న ఆయన ఇచ్చిన డబ్బా తీసుకుని కొండదారిన బయలుదేరాడు. దారిలో అతని కొక మూడేళ్ళ పిల్ల కనిపించింది. ఆ పిల్ల "అమ్మా" అని ఏడుస్తూ, పడుతూ లేస్తూ ఉత్సవం దిక్కుగా పోతున్నది.

పాపన్న ఆ పిల్ల నెత్తుకుని, "నీపే రేమిటి? మీవాళ్ళెక్కడ?" అంటూ చుట్టూ



చూశాడు. ఎవరూ దగ్గిరలో కనిపించలేదు. ఆ పిల్ల వచ్చీరాని మాటలతో, తన పేరు మాలతి అనీ, ఎవడో దొంగ తన సొమ్ములు కాజేశాడనీ, అమ్మ కావాలనీ అన్నది. పిల్లను చూస్తే ధనికుల బిడ్డగా ఉన్నది. దొంగవా డెవడో పిల్ల ప్రాణాలు తీయకుండా వదిలిపెట్టినందుకు పాపన్న సంతోషించాడు.

పాపన్న మాలతిని ఉత్సవం జరిగేచోటికి తెచ్చి, పిల్ల తాలూకు మనుషులు కనిపిస్తారేమోనని చాలాసేపు తిరిగాడు; పిల్లకు ఒక అరటిపండు కొని, తినటానికి ఇచ్చాడు; రంగులరాట్నం చూసి పిల్ల సంబరపడితే, దాని మీద ఎక్కించి తిప్పాడు. తరవాత పిల్లను ఎత్తుకుని, ముసలాయన ఇచ్చిన ముడుపుడబ్బా కోసం వెతికితే అది కనిపించలేదు.

"పిల్లను రంగులరాట్నం ఎక్కించటానికి వెళుతూ, ఇక్కడ ఒక డబ్బా ఉంచాను. అదేమయిందో తెలుసునా?" అని పాపన్న ఆ చుట్టుపక్కల ఉన్న వాళ్ళను అడిగాడు.

"ఎవరో పెద్దమనిషి, కిందటిసారి రాట్నం ఆగినప్పుడు దాని నుంచి దిగి, వెళ్ళిపోతూ అక్కడ ఉన్న డబ్బా తీసుకుని వెళ్ళిపోయాడు. ఆ డబ్బా ఆయనదే కాబోలు ననుకున్నాం," అన్నారు అక్కడి వాళ్ళు. వాళ్ళు ఆ మనిషి ఆనవాళ్ళు కూడా చెప్పారు. ఆయన ఎర్రపాగా తలకు చుట్టుకుని, పచ్చని చొక్కా వేసుకున్నాడు; మనిషికి గడ్డాలూ, మీసాలూ ఉన్నాయి.

పాపన్న మాలతి తల్లిదండ్రుల కోసం వెతికే కళ్ళతోనే, ఎర్రపాగా, పచ్చచొక్కా, గడ్డాలూ, మీసాలూ గల మనిషి కోసం కూడా చూస్తూ చాలాసేపు తిరునాళ్ళ జనం మధ్యగా తిరిగాడు.

అంతలోనే, "మాలతీ!" అని కేక పెడుతూ ఒక స్త్రీ అతన్ని సమీపించి, మాలతిని అతని చేతి నుంచి లాగేసుకున్నది.





"ఈ పిల్ల మీదేనా? మీ కోసం తెగ తిరుగుతున్నాము," అన్నాడు పాపన్న.

ఆ ఇల్లాలు తన పిల్ల ఒళ్ళు తడివి చూసుకుని ఆగ్రహంతో, "పిల్ల నగలన్నీ కాజేసి ఉత్తపిల్ల నిస్తున్నావా?" అన్నది పాపన్నతో.

ఆవిడ తనకు కృతజ్ఞత చూపకపోగా దొంగతనం అంటగట్టటం చూసి పాపన్న, ఆ పిల్ల తన కెలా దొరికినదీ చెప్పాడు. మాలతి కూడా అదే నిజమన్నది. ఆ తల్లి, తన కూతురు ప్రాణాలతో దొరికినదే చాలు ననుకుని, బిడ్డతో సహా వెళ్ళిపోయింది.

పాపన్న కిప్పుడు ముసలాయన ఇచ్చిన ముడుపు డబ్బా దిగులు పట్టుకున్నది. ఆయన తన కోసం వాగు దగ్గిర ఎదురు చూస్తూంటాడు. ఏం చెయ్యటానికీ పాప న్నకు పాలుబోక, తన బసకు వెళ్ళాడు. అతన్ని చూస్తూనే అతని భార్య, "మన పిల్లవా డెక్కడైనా కనిపించాడా? మీరెంత సేపటికీ రాకపోతే ఇద్దరూ కలిసి తిరుగు తున్నారనుకున్నానే?" అన్నది.

"జనంలో తిరుగుతూంటాడు. వాడే వస్తాడులే," అన్నాడు పాపన్న చిరాకుగా.

"కాదండీ, పరిగడుపున ఇంత ఫల హారమన్నా చెయ్యకుండా వెళ్ళాడు. భోజ



నాలవేళ కావస్తున్నది. దారితప్పి ఎక్కడైనా పోయాడో ఏమో, వాణ్ణి కాస్త వెతికి తీసుకు రండి," అన్నది భార్య.

"ఇంతసేపూ జనం మధ్యనే తిరుగు తున్నాను. ఒక దొంగవాడి మూలంగా నాకు చెడ్డ చిక్కు వచ్చిపడింది. వాడి కోసం కళ్ళు కాయలయేలా చూశాను. ఇంకేం చూసేది?" అన్నాడు పాపన్న

ఇంతలో పాపన్న కొడుకు, పదేళ్ళవాడు, రొప్పుకుంటూ, "ఏం జరిగిందో తెలుసా, నాన్నా?" అంటూ వచ్చాడు. వాడి చేతిలో ఒక కత్తీ, గడ్డమూ, ఒక డబ్బా ఉన్నాయి. ఆ డబ్బాను చూసేసరికి పాపన్నకు ప్రాణం





లేచి వచ్చింది. అది ముసలాయన ఇచ్చిన ముడుపు డబ్బా.

పాపన్న కొడుకు జరిగిన దంతా తల్లిదండ్రులకు చెప్పాడు.

వాడు ఆ ఉదయం తాము దిగిన సత్రం పరిసరాలలో చెట్ల మీది కోతులను చూసి ఆనందిస్తూ తిరుగుతుండగా, ఎర్ర తలపాగా, పచ్చ చొక్కా, గడ్డాలూ, మీసాలూ గల మనిషి ఒకడు కనపడి, "తింటావా అబ్బాయి?" అంటూ చేతిలో బఠానీలు చూపాడు. పాపన్న కొడుకు దగ్గిరికి రాగానే, ఆ మనిషి వాడి చెయ్యి గట్టిగా పట్టుకుని, రెండో చేతితో కత్తి చూపిస్తూ, "అరిచావంటే పొడిచేస్తా! నా వెంట రా!" అంటూ కొండరాళ్ళ మధ్యకు తీసుకుపోయాడు.

అక్కడ ఆ మనిషి తన చేతిలో ఉన్న కత్తి, డబ్బా ఒక రాతి మీద పెట్టి, కుర్రవాడి చెవుల కుండే తమ్మెంట్ల సీలలు ఊడదీయటానికి ప్రయత్నించాడు. ఒకటి వచ్చింది గాని రెండోది సులువుగా రాలేదు. ఈ లోపల కుర్రవాడికి ఆ మనిషి గడ్డం పెట్టుడు గడ్డం లాగా కనబడింది. వాడు చల్లగా చెయ్యి చాచి కత్తి అందుకుంటూ, రెండో చేత్తో ఆ మనిషి గడ్డం పట్టుకుని గుంజాడు. గడ్డం చేతిలోకి ఊడి వచ్చింది. దొంగవాడు కంగారుగా లేచి నిలబడ్డాడు.



"దొంగ! దొంగ! పట్టుకోండి!" అని కుర్రాడు కేకలు పెట్టాడు.

దూరంగా మనుషుల మాటలు వినిపించాయి. దొంగ పరిగెత్తసాగాడు. పాపన్న కొడుకు డబ్బా కూడా తీసుకుని దొంగ వెంట పడ్డాడు. కాని దొంగవాడు పెద్దపెద్ద రాళ్ళ మీదుగా దూకుతూ వాగు కేసి కనబడకుండా పారిపోయాడు. పాపన్న కొడుకు ఐన చేరుకున్నాడు.

తన కొడుకు ధైర్యానికీ, యుక్తికీ పాపన్న చాలా సంతోషించాడు. వాళ్ళంతా ఆ పూట కొండ మీదికి వెళ్ళి, దేవుడి దర్శనం చేసుకున్నారు. పాపన్న, ముసలాయన ముడుపును దేవుడి హుండీలో వేశాడు.

తరవాత పాపన్న ముసలాయన ఉన్న చోటికి బయలుదేరుతుంటే అతని కొడుకు కూడా బయలుదేరాడు. ఇద్దరూ వాగు ప్రాంతం చేరేసరికి ముసలాయన సమీపంలో ఇంకో మనిషి పడుకుని ఉన్నాడు.

"ఎవరు, తాతా, ఈ మనిషి?" అని పాపన్న అడిగాడు, ముసలాయనకు ఖాళీ డబ్బా తిరిగి ఇస్తూ.

"ఎవరో, పాపం! కాలులో ఇంత లోతున ఏదో మోదు దిగబడిందట. నడవ లేక ఇక్కడ చతికిలబడ్డాడు," అన్నాడు ముసలాయన.

ఈ మాటలు విని పడుకుని ఉన్న మనిషి లేచి కూర్చుని, పాపన్న కొడుకును చూసి కంగారు పడ్డాడు.

"వీడే నాన్నా, దొంగ!" అన్నాడు పాపన్న కొడుకు తండ్రితో.

దొంగ పారిపోదామని చూశాడు గాని కాలు బాధపెట్టటం చేత పరిగెత్తలేక పోయాడు. పాపన్న వాణ్ణి సులువుగా పట్టుకుని వెతకగా వాడు కాజేసిన తమ్మంటు దొరికింది. పాపన్న ఆ దొంగను గ్రామాధికారికి అప్పగించి, యాత్ర ముగించుకుని, సకుటుంబంగా తన గ్రామానికి తిరిగి వెళ్ళిపోయాడు.





# నీటి ఎద్దడి

పాపన్న మేనమామ ఒకాయన చాలా ఏళ్ళ క్రితం దేశాలు పట్టి పోయాడు. ఆయన ఇటీవల తిరిగి వచ్చాడనీ, కొడుకులూ కోడళ్ళూ ఆయనను దగ్గిర చేరనివ్వలేదనీ, ఆయన కొండల అవతల ఎక్కడో ఉండి, ముసలితనంలో నానా అగచాట్లూ పడుతున్నాడనీ తెలియవచ్చింది. తన అన్న గురించి ఇలాటి వార్త విని, పాపన్న తల్లి చాలా బాధపడి, "నువ్వు వెళ్ళి అన్నయ్యను తీసుకురారా," అన్నది కొడుకుతో.

పాపన్న బండి కట్టుకుని తన మేనమామను వెతుక్కుంటూ బయలుదేరాడు. కొండల మధ్యన బండిబాట నిలిచిపోయింది. అక్కడి నుంచి కాలిబాట మాత్రమే ఉన్నదనీ, కొండల అవతల ప్రజలు నీటిఎద్దడితో బాధపడుతున్నారనీ పాపన్నకు తెలియవచ్చింది. అందుచేత పాపన్న తన బండినీ, ఎద్దునూ ఒక గ్రామంలో గ్రామపెద్ద ఇంట ఉంచి, ఎద్దు మేతకు కొంత డబ్బిచ్చి, కాలినడకన కొండల అవతలి ప్రాంతానికి చేరుకున్నాడు.

కొండల అవతల ఉండే మైదానాలను చేరుకోగానే అతనికి, ఎక్కడి నుంచో నెత్తిన నీటిబిందెలు పెట్టుకుని ప్రయాణాలు చేస్తున్న స్త్రీలూ, పురుషులూ చాలామంది కనిపించారు.

పాపన్న ఈ ప్రాంతానికి బయలుదేరే టప్పుడు కొన్ని రొట్టెలూ, పెద్ద చెంబుతో నీళ్ళూ తెచ్చుకున్నాడు. కాని ఆ రొట్టెలు అయిపోయాయి. దారిలో కనిపించే వాళ్ళను అతను, "ఈ దగ్గిర ఎక్కడన్నా పూట కూళ్ళ ఇల్లుందా?" అని అడిగాడు.

"పది మైళ్ళ మేరలో ఎక్కడా పూట కూళ్ళ ఇల్లు లేదు. ఈ ప్రాంతాల వాళ్ళు తమ వంట తామే చేసుకుంటారు," అని జవాబు వచ్చింది.







"వంట చేసుకుంటాను. స్వయంపాక మైనా దొరుకుతుందా?" అని పాపన్న మళ్ళీ అడిగాడు.

"ఏది కావాలన్నా బండారయ్య ఇంటనే దొరుకుతుంది. ఆయన ధరలు విపరీతం. కాని ఈ చుట్టుపక్కల ఏది కావాలన్నా ఆయన దగ్గిరే కొనాలి. చివరకు మంచి నీళ్ళు కూడా ఆయన బావివే ఇక్కడి వాళ్ళకు గతి," అని పాపన్న తెలుసు కున్నాడు. బండారయ్య నీటిని కూడా విపరీతమైన ధరలకు అమ్ముతాడట.

పాపన్న నీళ్ళతోనైనా తన ఆకలి చంపుకుందామని, నీళ్ళ బిందె నెత్తిన పెట్టుకుని వెళ్ళే మనిషి నొకణ్ణి తన చెంబు నిండా నీరు పొయ్యమన్నాడు. ఆ మనిషి నిర్దాక్షిణ్యంగా పొయ్యననేశాడు. అతను మాత్రం ఏం చేస్తాడు? ఆ బిందెడు నీళ్ళా రోజల్లా నలుగురికి సరిపోవాలి. అందులోనూ బోలెడంత డబ్బుపోసి కొనుక్కున్న నీళ్ళు!

మరో మనిషి పాపన్న వద్ద నాలుగణాలు తీసుకుని అతని చెంబు నింపాడు. ఆ మని షినీ తప్పు పట్టి లాభం లేదు. అతను మూడుమైళ్ళ పైచిలుకు దూరం నుంచి వచ్చి, బిందెడు నీళ్ళకు గాను పావలా ఇచ్చి ఆ నీటిని మోసుకుపోతున్నాడు.

"మీ రింత అగచాట్లు పడటం దేనికి? మీ మీ ప్రాంతాలలో బావులు తవ్వుకో రాదా?" అని పాపన్న అడిగాడు.

"ఈ ప్రాంతాని కంతకూ బండారయ్యే గుత్తదారు. ఆయన ఇంకా అనేక చోట్ల బావులు తవ్వించాలని ప్రయత్నిస్తే క్షేత్రజ్ఞులు, ఆ ప్రదేశమంతా శిలామయ మనీ, ఒక్క చుక్క నీరు పడదనీ అన్నా రట. ఈ మాట బండారయ్యే చెప్పాడు. ఏమైనా ఆ పుణ్యాత్ముడా బావినీళ్ళన్నా పదిమందికీ ఇస్తున్నాడు గనక ఇక్కడి వాళ్ళ ప్రాణా లింకా నిలిచి ఉన్నాయి," అన్నాడు నీళ్ళు అమ్మినవాడు.





మరి నోరెండినప్పుడల్లా నోరు తడి చేసుకుంటూ, ఆకలిని సహిస్తూ పాపన్న ముందుకు సాగాడు. అతను ఆ ఎగుడు దిగుడు కాలిబాటన నడిచిపోతూండగా ఒక పల్లంలో ఒక వృద్ధుడు పడిపోయి, హీన స్వరంతో, "దా-హం!" అంటూ అలమటించటం పాపన్న కంట పడింది. అతను ఆగి, తన చెంబులో ఇంకా మిగిలి ఉన్న నీటిలో కొంత ఆ ముసలాడి నోట పోసి, మిగిలినది తాను తాగేశాడు.



ఆ సమయంలో ఒకడు ఖాళీ బిందెతో అటుగా పోతూ, "ఎవరు నాయనా, నువ్వు? ఆ ముసలాడి నోట్లో నువ్వు నీళ్ళుపోసినట్టు తెలిస్తే ఆ బండారయ్యగారు నీకు ఒక్క చుక్క నీరివ్వడు. ఆయనకు కోపం వచ్చిందంటే ఈ ప్రాంతాలలో ఎవరూ నిన్ను క్షణం నిలవనివ్వరు," అన్నాడు.

"ఏం? ఈ ముసలాడు బండారయ్య గారికీ, అక్కడి ప్రజలకూ అంత గొప్ప ద్రోహం ఏం చేశాడు?" అని అడిగాడు పాపన్న.

"వీడొక దగాకోరు. ఈ గుడ్డి ముండా కొడుకు చావు కోసమే అందరమూ ఎదురు చూస్తున్నాం," అన్నాడా మనిషి.

పాపన్న ఆ ముసలాడి కేసి చూసి ఆయనకు కళ్ళు లేవని తెలుసుకున్నాడు.

ఆ వృద్ధుడు పాపన్న పోసిన నీటితో కొంచెంగా తెప్పరిల్లాడు గాని, ఇంకా మాట్లాడే స్థితిలో లేడు. పైపెచ్చు మరి కాసిని నీళ్ళు కావాలని సంజ్ఞ చేస్తున్నాడు.

పాపన్న కేం చెయ్యటానికీ పాలుపోలేదు. తాను బండారయ్య బావి దాకా వెళ్ళి నీళ్ళు తెచ్చిన దాకా ముసలాడి ప్రాణం నిలుస్తుందో, నిలవదో. నీళ్ళు తెచ్చేవాళ్ళ దగ్గిర ఇంకో చెంబెడు నీళ్ళు కొందామన్నా అలాటి మనుషు లెవరూ అటుకేసి రావటం కనిపించలేదు.

ఇంతలోనే సమీపంలో ఎవరో ఆడ మనిషి కెవ్వున అరవటం వినిపించింది.







పాపన్న వెంటనే తానున్న పల్లంలో నుంచి కేక వినిపించిన దిక్కుగా పరిగెత్తాడు.

కొద్ది దూరంలోనే ఇద్దరు మొరటు మనుషులు, దుడ్డుకర్రలతో ఒక ఆడమనిషిని బెదిరిస్తూ, ఆమె మోసుకొస్తున్న నీళ్ళ బిందెను లాక్కోవటానికి యత్నిస్తున్నారు. పాపన్న పులి లాగా ఒకడి మీద పడి, వాణ్ణి డొక్కలో చాచి తన్ని, దుడ్డుకర్ర లాక్కొని రెండోవాణ్ణి రెండు బాదేసరికి ఇద్దరు రౌడీలూ కాలికి బుద్ధి చెప్పారు.

"ఈ నీళ్ళదొంగలతో చావుగా వుంది, నాయనా. దేవుడల్లే వచ్చి అడ్డుపడకపోతే మా గతి ఇవాళ ఏమయేదో!" అన్నదా స్త్రీ.

"నిన్నూ దేవుడే పంపాడు. నేనూ, ఇంకో ముసలాయనా దప్పికతో చస్తున్నాం. నా చెంబులో కాసిని మంచినీళ్ళు పోసిపో, తల్లీ," అన్నాడు పాపన్న. ఆమె జాగ్రత్తగా, ఒక్క చుక్క నేల రాలకుండా, పాపన్న చెంబు నింపింది.

పాపన్న ఆ నీరు కొంత ముసలాయన నోట పోసి, మరి కొంత తాను తాగాడు.

ముసలాయనకు పాపన్న నీరు పొయ్యటం చూడగానే ఆ స్త్రీ గతుక్కుమని, భయంగా అటూ ఇటూ చూడసాగింది.

"భయపడకమ్మా. నేను రాజుగారితో మాట్లాడి బండారయ్య ఆట కట్టిస్తాలే. ఈ ముసలాయన బండారయ్యకు చేసిన ద్రోహమేమిటో నీకేమైనా తెలుసా?" అన్నాడు పాపన్న.

ఆమె ఆ ముసలాయన కథ ఈ విధంగా చెప్పింది:

ముసలాయన క్షేత్రజ్ఞుడు. జలవేది. నీరెక్కడ పడేదీ చెప్పగలడట. ఆయన బండారయ్య దగ్గిరికి వెళ్ళి, ఎక్కడెక్కడ బావులు తవ్వాలో చెబుతాననీ, తన కేదైనా ఇప్పించమనీ కోరాడట. "నేను ఈ ప్రాంతాలంతటా పరీక్ష చేయించాను. ఎక్కడా జలం పడదు," అని బండారయ్య అన్నాడు.





"అలా కాదు. రెండు మూడు చోట్ల చాలా తక్కువ లోతునే నీరున్నది. నేను పరీక్ష చేసే చెబుతున్నాను," అన్నాడు ముసలాయన.

ముసలాయన చెప్పిన చోట తవ్వించి చూడమని పదిమందీ బండారయ్యను ఒత్తిడి చేశారు.

"సరే, ఒకచోటు చూపించు. అక్కడ తవ్విస్తాను. నీరు పడిందా నీకు ఇరవై రూపాయలిస్తాను. లేదా, నిన్నీ ప్రాంతాల వాళ్ళు బతకనివ్వరు," అన్నాడు బండారయ్య, పదిమందీ వింటూండగా.



ఆ తరవాత బండారయ్య ముసలాయనను వెంటబెట్టుకుని మంచి చీకట్లో బయలుదేరాడు. ముసలాయన బండారయ్యను ఒక నిర్జన స్థలానికి తీసుకుపోయి, "ఇక్కడ తవ్వించండి. ఇరవై అడుగుల లోతున నీరు పడుతుంది," అన్నాడు.

మర్నాడు బండారయ్య మనుషులను తీసుకుపోయి తవ్వకం సాగించాడు. అయితే అతను బావి తవ్వించినది ముసలాయన చెప్పిన చోట కాదు, మరొక చోట. ఎంత తవ్వినా నీరు పడలేదు.

"చూశారా, ఈ దుర్మార్గుడు డబ్బుకు కక్కుర్తిపడి మనకు లేనిపోని ఆశపెట్టాడు. ఎవరూ వీడికి పిడికెడు బియ్యం పెట్టకండి. గుక్కెడు మంచినీళ్ళివ్వకండి. చస్తే, చచ్చిన చోటనే పాతెయ్యండి," అని అందరినీ బండారయ్య హెచ్చరించాడు. నీళ్ళు అమ్ముకుని డబ్బుచేసుకో దలిచిన బండారయ్యకు ముసలాయన మీద కక్ష ఉండటం సహజమే. పలుకుబడి కలవాడు గనక, ముసలాయనను ఆకలిదప్పులతో హత మార్చటానికి ఒడిగట్టాడు.

"బండారయ్య నేను చెప్పిన చోట బావి తవ్వటం లేదని నెత్తి, నోరూ బాదుకుని చెప్పాను. ఎవరూ నా మాట విన్నారు కారు. నేనా గుడ్డివాణ్ణయి పోతిని. నేను







నీరు పడుతుందన్న చోట పడి తీరుతుంది. కళ్ళు పోయాక నాకీ శక్తి ఒకటి సిద్ధించింది. నాకు భూమిలో ఉండే నీటి గలగల వినిపిస్తుంది. ఎక్కడి మాటో ఎందుకు? నేను పడి ఉన్న ఈ చోటనే పదిహే నడుగుల లోతున నీరున్నది," అన్నాడు ముసలాయన, పాపన్న పోసిన నీళ్ళతో కొంచెం తెరుకుని లేచి కూర్చుని.

పాపన్న ముసలాయనను మాటలలో పెట్టి, ఆయనే తన మేనమామ అని తెలుసుకున్నాడు.

"నువ్వేనా మామయ్యా? నీ కోసమే నేను బయలుదేరి వచ్చాను. దేశం కాని దేశాలు తిరిగి, నువ్వు ముసలితనంలో అష్ట కష్టాలు పడుతున్నావని విని అమ్మ నిన్ను తీసుకురమ్మన్నది," అన్నాడు పాపన్న.

వాళ్ళిలా మాట్లాడుకుంటుండగా బండారయ్య బావి నుంచి కొంత మంది గట్టిగా మాట్లాడుకుంటూ ఖాళీ బిందెలతో ఇటుగా వచ్చారు. ఏమిటి సంగతి అని అడిగితే బండారయ్య బావిలో ఎవరో పడి చచ్చినట్టు తెలిసింది. ఆ ప్రాంతాల ఉన్నదే ఒక్క బావి. ఆ నీళ్ళు కూడా జనానికి ప్రాప్తం లేకుండా పోయాయి.

పదిమంది చేరారు. పాపన్న వాళ్ళతో, "ఇప్పటికన్నా కళ్ళు తెరవండి. ఇదంతా నీరు లేని ప్రాంతమని బండారయ్య మిమ్మల్ని నమ్మించి మోసం చేస్తున్నాడు. మేం కూర్చున్న ఇక్కడే నీరు పడుతుంది. పలుగులూ, పారలూ, తట్టలూ తెచ్చి పది మంది పూనుకుంటే ఈ పూటే బండారయ్య బండారం బయట పెట్టవచ్చు," అని ప్రోత్సహించాడు.

పాపన్న మాటలలో వాళ్ళకు గురి కుదిరింది. రెండు గడియల లోపుగా జనం పనిముట్లతోనూ, ముసలాయనకు తిండి తీసుకుని వచ్చారు. బావి పని అతి చురుకుగా సాగింది.





పొద్దువాలే లోపుగా నీరు తగిలింది. జనం పొందిన ఆనందానికి మేరలేదు. చీకటి పడే లోపుగా వందల కొద్దీ జనం పోగయారు. కాగడాలు వచ్చాయి. ఎవరో కొబ్బరికాయలూ, హారతి కర్పూరమూ కూడా తెచ్చారు.

మర్నాడు తెల్లవారే సరికి దాదాపు నిలువు లోతు నీళ్ళు గల బావి తయారయింది. బావికి టెంకాయలు కొట్టి, హారతి ఇచ్చారు. పాపన్న వచ్చిన వారందరికీ కడవలు ముంచి నీరు అందించాడు. పాపన్న పేరూ, ముసలాయన పేరూ చెప్పుకోనివాళ్ళు లేరు.

ముసలాయన ఆ ప్రాంతాలవారికి దేవుడై పోయాడు. ఆయనను ఆ ప్రాంతమంతా తిప్పి, ఇంకెక్కడెక్కడ బావులు తవ్వవచ్చునో చూడమన్నారు. ఆయన సహాయంతో మరి మూడు నాలుగు బావులు ఆ నిర్జన ప్రాంతంలో వెలిశాయి.

ఆ ప్రాంతాల వారికి నీటిఎద్దడి లేకుండాపోయింది. జనానికి తాగే నీరే గాక, కూరగాయలు పండించుకునేటందుకు కూడా తగిన నీరు లభ్యమయింది.

పాపన్న రాజుగారి దివాణంలో బండారయ్య చేసే దురాగతాలను గురించి పెద్ద ఫిర్యాదిచ్చి, తన మామను ఇంటికి తీసుకుపోయాడు. పాపన్న తల్లి తన అన్నను చాలా కాలానికి చూసి సంతోషించింది. తరవాత రాజుగారు ముసలాయనను పిలిపించి, ఆయన చేసిన ఉపకారానికి మంచి సన్మానం చేశాడు. బండారయ్య గుత్తాధికారాలన్నీ రద్దయాయనీ, అతనికి భారీగా జరిమానా పడిందనీ, వ్యాపారం చేసుకునే హక్కు అడిగినవారికల్లా ఇవ్వబడిందనీ, కొండ అవతల ప్రాంతంలో వస్తువుల ధరలు అదుపులోకి వచ్చాయనీ, అక్కడి ప్రజలు సుఖంగా బతుకుతున్నారని పాపన్నకు తెలిసింది.





# చెయ్యి చాచిన దాత

ఒకసారి పాపన్న తమ గ్రామాధికారి తరఫున కొన్ని వస్తువులను పొరుగూరి జమీందారుకు అందజేయవలసి వచ్చింది. పాపన్న లాటి నమ్మకస్తుడు మరొకడు దొరకనందువల్ల గ్రామాధికారి ఆ పని పాపన్నకే అంటగట్టాడు.

పాపన్న జమీందారుగారి ఊరు చేరుకుని, జమీందారుగారింటికి పోతూండగా, దారి పక్కన ఉన్న గుడిసెలో నుంచి శోకాలు వినిపించాయి. ఈ ఏడుపుల మధ్య ఒక ఆడది, "జోస్యంవైద్యుడు చెప్పిన మాట పొల్లుపోతుందా? నువు పోతే మా కింకెవరు దిక్కు? ఇక్కడ ఉండనివ్వరు. ఎక్కడికని పోతాం? దిక్కులేని పక్షులకు ఎవరు సాయం చేస్తారు? ఎంత కష్టం తెచ్చి పెట్టావురా, దేవుడా!" అంటూ ఏడుస్తున్నది.

ఒక మగగొంతు, "నే నింకా చావకుండానే చచ్చినంతగా ఏడుస్తున్నా వేమే? నన్ను నెమ్మదిగా చావనివ్వవా ఏం? ఏమిటీ గోల?" అన్నది బలహీనంగా.

ఈ వింత సంభాషణ ఆలకించిన పాపన్న గుడిసెలో ప్రవేశించాడు. లోపల తల విరబోసుకున్న ఒక ఆడదీ, నలుగురు పిల్లలూ ఉన్నారు. అందరూ ఏడుస్తున్నారు. చాప మీద చింకిపాత ఒకటి కప్పుకుని ఒక మగవాడు రోగంతో వణుకుతున్నాడు.

పాపన్న వాళ్ళను చూసి, "ఎందు కలా కంగారు పడతారు? ఏమిటి మీకు వచ్చిన కష్టం? నాతో చెప్పండి, చేతనైన సహాయం చేస్తాను," అన్నాడు. అసలే చలికాలం, అందులోనూ రోగిష్ఠివాడు. అతనికి కప్పుకునేటందుకు కొక పాతకంబళీ కూడా లేకపోవటం చూసి పాపన్న తన మీద ఉన్న శాలువా తీసి రోగికి కప్పాడు.

రోగి భార్య తమ పరిస్థితి అంతా పాపన్నకు చెప్పింది. రోగి పేరు రాములు.








జమీందా రింట్లో పని చేస్తారు. వాళ్ళుం టున్న గుడిసె కూడా జమీందారు స్థలం లోనే ఉంది. జమీందా రింట చాకిరీ చేసి తెచ్చే కొద్దిపాటి జీతంతో కుటుంబం ఎలాగో గడుస్తున్నది. జమీందారు దగ్గిర నౌకరీ చేసే వాళ్ళకు జబ్బు చేస్తే జమీందారే వైద్యం చేయిస్తాడు. పనివాళ్ళు తామే డబ్బిచ్చి వైద్యం చేసుకుంటే జమీందారుకు అవమానం. అదీగాక, జమీందారు దగ్గిర పని చేసేవాళ్ళ వద్ద వైద్యం ఖర్చుకు డబ్బు ఉండనూ ఉండదు.

ఈ మధ్యనే రాములుకు జ్వరం తగల నారంభించింది. అతని భార్య వెళ్ళి ఆ సంగతి జమీందారుతో చెప్పుకున్నది. ఆ ప్రాంతాల బాగా పేరుమోసిన జోస్యం వైద్యుణ్ణి జమీందారు రాములు చికిత్స కోసం పిలిపించాడు.

జోస్యం వైద్యుడు వైద్యం లోనూ, జ్యోతిషం లోనూ కూడా గట్టివాడు. ఎవ రైనా జబ్బుపడి ఆయనను పిలిచినప్పుడు ఆ వైద్యుడు ముందు జోస్యం చూసి, రోగికి నయమయే యోగం ఉన్నట్టు తోస్తేనే మందిస్తాడు. లేకపోతే, "ఇది నయమయే వ్యాధి కాదు. మందివ్వమంటే ఇస్తాను," అంటాడు. తాను చికిత్స చేసే రోగి చని పోతే తనకు అపఖ్యాతి అని ఆ వైద్యుడి భయం. కొన్ని సందర్భాలలో ఆయన అన్నట్టే జరగటం చేత అందరికీ ఆయన జోస్యంలో కూడా మంచి గురి ఉన్నది. ఆయనను అందరూ జోస్యంవైద్యు డనే వారు. కొంతమంది మటుకు ఆయన చేత వైద్యం చేయించుకోవట మంటే హడలి పోయేవారు.

అలవాటు ప్రకారం జోస్యంవైద్యుడు ముందుగా రాములు జాతకచక్రం వేసి చూసి, మీనమేషాలు గుణించి, పెదవివిరిచి, "లాభం లేదు. దక్కడు. ఇప్పుడు వాడికి కుజరాహు సంధి. శాంతి చేసినా ఫలితం





ఉండకపోవచ్చు. మందివ్వమంటే ఇస్తాను," అని జమీందారుతో అన్నాడు.

"మందిచ్చి ప్రయోజనం లేనప్పుడు దేనికి? కుజరాహు సంధి దోషపరిహార కర్మంటే మాటలా? శ్రీమంతులకే ఎంతో ఖర్చుతో కూడిన పని. అది వాడి వల్ల ఏమవుతుంది? ఇక మీరు వెళ్ళండి," అని జమీందారు జోస్యంవైద్యుణ్ణి పంపేశాడు. తరవాత ఆయన రాములు భార్యతో, "విన్నావుగా? ఈ వైద్యుడి మాటకు తిరుగు లేదు. కాలం తీరిన వాడికి వైద్యం కూడా దేనికి? నువ్వు మాత్రం ఇల్లు దాటి ఎటూ వెళ్ళక, ఈ నాలుగు రోజులూ రాముల్ని కాస్త జాగ్రత్తగా కనిపెట్టి ఉండు," అన్నాడు. అందుకే ఈ ఏడుపులూ, పెడ బొబ్బలూనూ.

సంగతంతా విని పాపన్న రాములు భార్యతో, "జమీందారు నడిగి ఒక మంచమూ, కంబళీ అయినా తెచ్చుకో పోయావా? రోగిష్టి మనిషి తడినేల మీద పడుకోవచ్చా? ఈ మనిషికి వైద్యమూ గ్రహశాంతీ కూడా జరిగి తీరాలిసిందే. మనిషి చస్తున్నాడని తెలిసినా ఆఖరు క్షణంలో కూడా ఏ గరళమో పోస్తారు గాని, విడిచిపెట్టేస్తారా? వైద్యుణ్ణి తీసుకొద్దాం, పద," అన్నాడు.






కాని రాములు భార్య పాపన్న వెంట వెళ్ళి, జమీందారును మంచం ఇవ్వమనీ, కంబళి ఇవ్వమనీ, వైద్యం చేయించమనీ అడగటానికి చాలా భయపడింది.

"నువేమీ భయపడకు. జమీందారుకు నేను చెబుతాలే. నేనూ ఒక జమీందారునే," అని పాపన్న రాములు భార్యను బయలు దేర దీసి, జోస్యంవైద్యు డింటికి వెళ్ళాడు.

ఎవరో కొత్త రోగికి చికిత్స కోసం వచ్చా రనుకుని వైద్యుడు, రోగి పేరూ, జన్మ నక్షత్రమూ, తిథీ వారాలూ అడిగాడు.

"ఈ మనిషి జాతకం మీరు ముందే చూశారు. ముందు వైద్యం చెయ్యండి, ఆ తరవాత కుజరాహు సంధి దోషానికి శాంతి కూడా మీరే చేద్దురుగాని. వాట న్నిటికీ ఖర్చెంత అవుతుందో చెప్పండి," అన్నాడు పాపన్న.

"అంతా చేరి యాభై, అరవై రూపా యల దాకా అవుతుంది," అన్నాడు వైద్యుడు. ఆయన వచ్చి రాములును చూసి మందిచ్చి, అనుపానాలూ అవీ చెప్పాడు.

"నేను మళ్ళీ తమ దర్శనం చేసుకుని అంతా మాట్లాడతాను," అని వైద్యుణ్ణి పంపేసి, త్వరలోనే తిరిగి వస్తానని గుడిసె వాళ్ళతో చెప్పి, పాపన్న జమీందా రింటికి బయలుదేరాడు.

జమీందా రింటికి కొద్ది దూరంలో దారి పక్కన మామిడిచెట్టు మీద ఎక్కి కాయ కోస్తున్న కుర్రవా డొకడు కెవ్వున అరుస్తూ కింద పడ్డాడు. పాపన్న చప్పున వాణ్ణి సమీ పించి చూశాడు. కుర్రాడు పది, పన్నెండేళ్ళ వాడు. వాడికి అక్కడక్కడా గాయాలు తగిలాయి. స్పృహ తప్పిపోయింది.

పాపన్న ఆ కుర్రవాణ్ణి ఎత్తుకుని గబగబా జోస్యంవైద్యు డింటికి వెళ్ళి, "అయ్యా, ఈ కుర్రవాడు చెట్టు మీది నుంచి పడి గాయపడ్డాడు. స్పృహ లేదు. చికిత్స చెయ్యండి," అన్నాడు.





"పడింది సరిగా ఏ వేళకు? వాడి పేరేమిటి? జన్మనక్షత్రం?" అని వైద్యుడు ప్రారంభించాడు.

"నా కవేమీ తెలీవు. జోస్యం తరవాత చూసుకోవచ్చు. ముందు చికిత్స చెయ్యండి," అన్నాడు పాపన్న తీవ్రంగా.

వైద్యుడు పాపన్న దగ్గిరికి వచ్చి, అతని చేతుల్లో ఉన్న పిల్లవాణ్ణి చూసి, "వీడేనా? వీడు మన జమీందారుగారబ్బాయేనండీ. అలా పడుకోబెట్టండి. కట్లు కట్టి మందిస్తాను. కించిత్తు గ్రహదోషం ఉండి ఉంటుంది. జమీందారుగారితో చెప్పి గ్రహశాంతి కూడా తరవాత చేయింతాం," అంటూ కుర్రవాడికి మందిచ్చి స్మృతి కలిగించి, గాయాలకు మందులు రాచి కట్టు కట్టాడు.

తరవాత పాపన్న కుర్రవాణ్ణి జమీందారు గారింటికి చేర్చి, తాను వచ్చిన పని పూర్తి చేసి, కుర్రవాడి పాటు గురించీ, చికిత్స గురించీ చెప్పి, "నాకు వేరే తొందర పని ఉన్నది. నా కిక సెలవిప్పిస్తారా?" అన్నాడు.

జమీందారు పాపన్నను పొగడాడు. సమయానికి అదుకోకపోతే, చెట్టు పై నుంచి పడి స్పృహ తప్పిన తన కొడుకేమై ఉండును?

"మీరు నాకు చేసిన మహోపకారానికి నా దగ్గిర ఏదైనా పుచ్చుకు తీరాలి.



మీ ఋణం ఉంచుకోవటం నాకు సాధ్యం కాదు. మీ మనస్సుకు నచ్చినది అడిగి మరీ పుచ్చుకోండి," అన్నాడు జమీందారు.

పాపన్న కొంచెం ఆలోచించి, "అలా అయితే నాకు రెండు కంబళ్ళూ, ఓ వంద రూపాయలూ ఇప్పించండి," అన్నాడు, చెయ్యి చాచి.

పాపన్న ఏమీ తీసుకో దనుకుంటున్న జమీందారుకు, అతను చెయ్యి చాచి అడగటం చూసి అమిత ఆశ్చర్యం కలిగింది. కాని అన్న మాట తప్పటానికి లేదు. అందు చేత జమీందారు రెండు కొత్త కంబళీలూ, వందరూపాయలూ తెప్పించి, పాపన్న కిచ్చి, అతన్ని పంపేశాడు.

పాపన్న అవి తీసుకుని తిన్నగా రాములింటికి వెళ్ళి, కంబళీలను రాములు భార్య కిచ్చాడు. ఆమెకే అయిదురూపాయలు కూడా ఇచ్చి, మంచం ఒకటి కొనుక్కు రమ్మని పంపి, పాపన్న జోస్యంవైద్యుడింటికి వెళ్ళి, శాంతి ఖర్చుల కింద యాభై రూపాయలు ఆయన చేతిలో పెట్టి, గుడిసెకు తిరిగి వచ్చి, తన దగ్గిర ఇంకా మిగిలి ఉన్న డబ్బు ఖర్చులకు వాడుకో మని రాములు భార్యచేతి కిచ్చి, తాను తన ఊరికి తిరిగి వెళ్ళిపోయాడు.

తన వద్ద తీసుకున్న దానాన్ని పాపన్న ఎలా వినియోగించాడో తెలియవచ్చే సరికి జమీందారుకు తల తీసేసి నట్టయింది. ఆయన తన పరువు నిలబెట్టుకోవటానికై రాములు గుడిసెకు వచ్చి, "ఏమిట్రా ఇదంతా? మీ కేం కావలిస్తే అదంతా ఇవ్వటానికి నేను లేనా? పొరుగూరి పాపన్న సహాయం దేనికి?" అంటూ తానే పాపన్న ద్వారా వారికి సహాయం చేసినట్టుగా నటించి, తన కొడుకు కోసమూ, రాములు కోసమూ కూడా జోస్యంవైద్యుడి చేత గ్రహశాంతి చేయించాడు. అప్పటికే రాములు వ్యాధి నిమ్మళించి అతను తేరుకున్నాడు.





# చేతగాని పని

పాపన్న గ్రామంలో ఉండే వెంకటాద్రికి పాపన్న అంటే వల్లమాలిన అభిమానం. ఒకనాడు వెంకటాద్రి ఇంటికి పొరుగు గ్రామం నుంచి కిష్టయ్య అనే అతను వస్తే, ఇద్దరూ పాపన్న గురించి చాలా సేపు మాట్లాడుకున్నారు. వెంకటాద్రి పాపన్న కథలు అనేకం చెప్పి, "మా పాపన్న అపూర్వమైన మనిషి. అతను తలుచు కుంటే చెయ్యలేని పని అంటూ లేదు. అందుకే అబాలగోపాలానికీ అతనంటే అంత అభిమానం," అన్నాడు.

"నీ దంతా మరీ బడాయి. పాపన్నకు చేతగాని పనులు లేకపోవటమేమిటి?" అన్నాడు కిష్టయ్య.

"ఏమిటది?" అన్నాడు వెంకటాద్రి.

"యాభైరూపాయలు పందెం కాస్తావా? అనేకమంది అవలీలగా చేసే పని మీ పాపన్న చెయ్యలేడు. చెయ్యలేడని నీ చేతనే ఒప్పిస్తాను. నువ్వు ఒప్పుకోక పోతే నేను నీకు యాభైరూపాయ లిచ్చు కుంటాను, ఒప్పుకునే పక్షంలో నువ్వు నాకు యాభైరూపాయ లిచ్చుకుంటావా?" అన్నాడు కిష్టయ్య.

"నువ్వు చెప్పే పని అనేకమందికి సాధ్యమై పాపన్నకు చేతకాదని నేను ఒప్పుకునే పక్షంలో తప్పక యాభైరూపాయ లిచ్చుకుంటాను. ఆ పని ఏమిటో చెప్పు," అన్నాడు వెంకటాద్రి.

"మీ పాపన్నకు దొంగతనం చెయ్యటం చేతకా దంటాను. అవునంటావా, కాదం టావా?" అన్నాడు కిష్టయ్య.

వెంకటాద్రి వెలవెల పోయాడు. ఏం చెప్పటానికీ అతనికి నోరాడలేదు. కిష్టయ్య పెట్టిన పందెం గెలుచుకోవటానికి, పాపన్న దొంగతనం చెయ్యగలడని అతను తన నోట ఎలా అనగలడు? పాపన్న అంటే అతని







కెంతో అభిమానం, ఎంతో గురి! తన అంతరాత్మను చంపుకుని కిష్టయ్య అన మన్న మాట అని అతను యాభైరూపా యలూ గెల్చుకుంటే, రేపటి నుంచి కిష్టయ్య, పాపన్న దొంగ అని ప్రచారం ప్రారంభించి, వెంకటాద్రి అన్న మాటే సాక్ష్యంగా ఉపయో గిస్తాడు. అంతకంటె కిష్టయ్యకు ఓడినట్టు ఒప్పుకుని, యాభైరూపాయలూ నష్టపడ టమే నయం. అలా అనుకుని వెంకటాద్రి లోపలికి వెళ్ళి, యాభైరూపాయలూ తెచ్చి, కిష్టయ్య చేతిలో పెట్టి అతన్ని పంపేశాడు.

వెంకటాద్రి దగ్గిర ఉన్నదంతా కలిసి ఆ యాభైరూపాయలే. తన భార్య ఎంతో కాలంగా చెవులకు కమ్మలు కొనమని వేధిస్తూంటే, అతను ఒక్కొక్క రూపాయే చేర్చి ఆ సొమ్ము కూడబెట్టాడు. దాని కింకో పదిరూపాయలు చేరగానే కమ్మలు కొనవచ్చు.

ఇంకొక వారంలో వెంకటాద్రి మరదలి పెళ్ళి జరగబోతున్నది. కొత్తకమ్మలు పెట్టు కుని ఆ పెళ్ళికి వెళ్ళాలని వెంకటాద్రి భార్య తాపత్రయం. వెంకటాద్రి పందెంలో ఓడి, ఉన్న డబ్బంతా కిష్టయ్య కిచ్చుకున్న రోజునే వెంకటాద్రి భార్య అతని చేతికి పదిరూపాయలు ఇచ్చి, "ఇంక కమ్మలు కొనుక్కురండి," అన్నది.

తన దగ్గిర ఇప్పుడు డబ్బేమీ లేదంటూ, వెంకటాద్రి తన భార్యకు జరిగిన దంతా చెప్పేశాడు. అతని భార్యకు కోపమూ, దుఃఖమూ ముంచుకొచ్చాయి. "మీ బుద్ధి బుగ్గయినట్టే ఉంది! మీరూ మీ దిక్కు మాలిన పందెమూనూ! ఇదే కాస్త తెలివి తేట ఉన్నవాడైతే అవతలివా డన్నదే నిజ మని ఒప్పుకుని యాభైరూపాయలు సంపా దించి ఉందును. ఇదంతా నా తలరాత!" అని గట్టిగా అన్నది.

వెంకటాద్రి అత్తగారు కూతురి దగ్గిరే ఉంటున్నది. ఆవిడ సంగతంతా తెలుసు





కుని, "హయ్యో! హయ్యో! ఇదేం గ్రహచారమమ్మా? ఇలాటి పంచెం ఎక్కడైనా కద్దా? ఈ పీడాకారపు పాపన్న ఎక్కడ దాపరించాడే, తల్లీ?" అని ఎత్తుకున్నది.

"పాపన్న నేమీ అనకమ్మా! ఆయన ఏం చేశాడూ?" అన్నది కూతురు.

"ఇంకేం చెయ్యాలే? వాడి మూలంగానే కాదుటే సొమ్మంతా గంగపాలయింది? వాడి మొహం మండా! కొన్నట్టా, తిన్నట్టా? యాభైరూపాయ లంటే మాటలా?" అంటూ వెంకటాద్రి అత్తగారు పొలికేకలు ప్రారంభించింది. ఆవిడ పెట్టే కేకలన్నీ పొరుగింటి పిల్ల విన్నది. ఆ అమ్మాయి పనిపెట్టుకుని వెళ్ళి, పాపన్న భార్య మీనాక్షితో, పాపన్నను ఫలానా ఇంటివాళ్ళు ఘోరంగా ఆడిపోసుకుంటున్నారని చెప్పింది.

ఆ మాటలు విని మీనాక్షికి చాలా కష్టం వేసింది. ఆమె భర్త దగ్గిరికి వెళ్ళి, "ఏమండీ, మీ మూలంగా ఆ వెంకటాద్రికి యాభైరూపాయలు పోయాయట. ఏం చేశారేమిటి?" అని అడిగింది.

"నా కేమీ తెలియదే. నేనీ మధ్య వెంకటాద్రిని కలవను కూడా లేదు," అన్నాడు పాపన్న ఆశ్చర్యంతో.

"వెంకటాద్రి అత్తగారు ఇంటి కప్పు ఎగరగొట్టుతున్నదట. వెళ్ళి, విషయ





మేమిటో కాస్త విచారించండి," అన్నది మీనాక్షి. పాపన్న వెంటనే బయలుదేరి వెంకటాద్రి ఇంటికి వెళ్ళాడు. వెంకటాద్రి పుట్టెడు దిగులుతో కూర్చుని ఉన్నాడు. అతని ద్వారా పాపన్న సంగతంతా రాబట్టి, "జరిగిందేదో జరిగింది. మీ ఆవిడ కొత్తకమ్మలతో పెళ్ళికి బయలుదేరేటట్టు చూద్దాం," అన్నాడు.

వెంకటాద్రి కంగారుపడి తనకు దాన ధర్మాలు స్వీకరించటం ఇష్టం లేదని స్పష్టం చేశాడు.

"అది నాకు తెలీదుటోయ్! అటువంటి దేమీ ఉండదులే. మళ్ళీ కనిపిస్తా," అంటూ పాపన్న వెళ్ళిపోయాడు.

పొరుగూళ్ళో కిష్టయ్య ఉండే ఇల్లు పాపన్నకు తెలుసును. అతను ఆ రాత్రి రెండోఝాముపొద్దు పోనిచ్చి, నల్లని కంబళీ కప్పుకుని, నెత్తికి ఒక ముసుగు తగిలించుకుని, చేత ఒక కత్తి పట్టుకుని తిన్నగా కిష్టయ్య ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు.

అప్పటికే నిద్రపోతున్న కిష్టయ్య, "ఎవరు వారు?" అంటూ లేచి వచ్చి తలుపు తెరిచాడు.

పాపన్న మారుగొంతు పెట్టి, "నోరెత్తావంటే గుండెల్లో పొడుస్తా!" అంటూ కత్తి పైకి ఎత్తాడు.

కిష్టయ్యకు ముచ్చెమటలు పోసి కాళ్ళు వణికాయి. పాపన్న లోపల ప్రవేశించి, తలుపు గడియ పెట్టి, "నీ డబ్బు పెట్టె తీసుకురా!" అన్నాడు.

కిష్టయ్య వణుకుతున్న చేతులతో ఒక కొయ్యపెట్టె తెచ్చి పాపన్న చేతికిచ్చాడు.

"ఇక నేను పోతున్నా. కిక్కురుమన్నావంటే నీ ప్రాణం తీస్తా," అని పాపన్న తలుపు తెరిచి ఉంచి బయటికి వెళ్ళిపోయాడు. కిష్టయ్య తన భార్యను లేపి, జరిగిన దొంగతనం గురించి చెప్పాడు.

"పాపిష్టి డబ్బు! ఉట్టుడియంగా స్నేహితుడితో పందెం వేసి యాభైరూపా

యలు కాజేశావు. కట్టికుదవకుండా ఉంటుందా? పాపన్న అంటే అభిమానం గల దొంగ ఎవడో మీ సంగతి విని పగ తీర్చుకుని ఉంటాడు. ఆ పెట్టెలో రెండు వందల నగదూ, నగలూ అవీ ఉన్నాయి. అన్నీ పోయాయి. ఇక గడ్డి తిందాం!" అన్నది కిష్టయ్య భార్య కడుపుమంట కొద్దీ.

మర్నాడు ఉదయం పాపన్న, తాను కిష్టయ్య ఇంట దొంగిలించిన పెట్టెను ఒక సంచిలో పెట్టుకుని వెంకటాద్రి ఇంటికి వెళ్ళి, "కిష్టయ్య ఇంటికి పోదాం పద. అతను పందెం గెలుచుకున్నా . డనుకుని నువ్వు యాభైరూపాయలూ ఇచ్చేశావు. కాని గెలిచింది నువ్వే నని నే నతని చేత ఒప్పిస్తాను," అన్నాడు.

పాపన్న అనే మాట వెంకటాద్రికి ఏమీ అర్థం కాలేదు, కాని అతను పాపన్న వెంట కిష్టయ్య ఇంటికి వెళ్ళాడు.

కిష్టయ్య ముఖంలో జీవం లేదు. అది చూసి, "ఏం కిష్టయ్యా, పెద్ద విచారంలో ఉన్నట్టున్నావు?" అని పాపన్న అడిగాడు.

"ఏం చెప్పమన్నారు, పాపన్నగారూ? నిన్న రాత్రి ఎవడో గజదొంగ తలుపు తట్టి మరీ లోపలికి వచ్చాడు. కత్తి చూపి మా ఇంటో ఉన్న డబ్బూ నగలూ సొంతం కాజేసుకుపోయాడు," అన్నాడు కిష్టయ్య.



"మన డబ్బయితే ఎక్కడికి పోదు. దొంగను నేనే పట్టిస్తాను. కాని ప్రస్తుతం ఇంకో పనిమీద వచ్చాం. నిన్న మీరిద్దరూ నన్ను గురించి ఏదో పందెం వేసుకున్నారని, పందెంలో గెలిచి యాభై రూపాయలు సంపాదించావని విన్నాను. నిజమేనా?" అన్నాడు పాపన్న.

"నిజమే, నిజమే. బుద్ధి గడ్డితిని ఏదో వాగి, యాభై రూపాయలు సంపాదించు కున్నాను; దానికి అరింతలు పోగొట్టు కున్నాను కూడా!" అన్నాడు కిష్టయ్య.

"ఇదేనా దొంగ పట్టుకుపోయిన పెట్టె?" అంటూ పాపన్న సంచిలో నుంచి పెట్టె పైకి తీశాడు.

కిష్టయ్య నిర్ఘాంతపోయి, "అవునవును. అది మీ కెలా దొరికింది?" అన్నాడు.

"రాత్రి మీ ఇంట దొంగతనం చేసింది నేనేగా! ఇంతకూ నువు పందెంలో నెగ్గ లేదు. వెంకటాద్రే నెగ్గాడు. అందుచేత నువు అతని దగ్గిర తీసుకున్న యాభైతో బాటు నువు ఓడిన యాభై జతచేర్చి, వంద రూపాయలూ ఇచ్చెయ్యి. డబ్బు ఈ పెట్టె లోనే ఉండి ఉంటుంది. నేను దాన్ని తెరిచికూడా చూడలేదు," అన్నాడు పాపన్న.

కిష్టయ్య తన వద్ద ఉన్న తాళపు చెవితో పెట్టె తెరిచి చూశాడు. పెట్టెలో ఉన్న వస్తువు లేమీ పోలేదు. కిష్టయ్య అందులో నుంచి నూరురూపాయలు తీసి వెంకటాద్రి ముందు పెట్టాడు.

"మనం స్నేహితులం. ఇది అర్థంలేని పందెం. అందుచేత నీ డబ్బు నా కవసరం లేదు. నా డబ్బు నాకిచ్చెయ్యి, చాలు," అన్నాడు వెంకటాద్రి. కిష్టయ్యకు తల తీసేసినట్టయింది. తను వెంకటాద్రి డబ్బు కోసం కక్కుర్తిపడి ఉన్నాడు. అతను ఆ పూట పాపన్ననూ, వెంకటాద్రినీ తన ఇంటనే భోజనానికి ఉండమని ఆహ్వానించి, ఆ సాయంకాలం చల్లబడ్డాక పంపేశాడు.





# అధికారి ఆప్యాయత

పాపన్న ఉండే ప్రాంతానికి రాజ ప్రతినిధిగా ఉండే శంభునాయకుడి కొడుకు పుట్టినరోజు పండగ వచ్చింది. గ్రామాధికారులకూ, ఇతర ప్రముఖులకూ ఆహ్వానాలందాయి. పాపన్న ఉండే గ్రామానికి అధికారి జబ్బుగా ఉండి వెళ్ళలేకపోయాడు. ఆయన పాపన్న చేతికి నూరు రూపాయల విలవ చేసే బంగారుగొలుసూ, రాజప్రతినిధి గారికి గ్రామస్థుల తరవున ప్రశంసాపత్రమూ, కుర్రవాడికి ఆశీస్సులు తెలుపుతూ ఒక లేఖా ఇచ్చి, అధికారికి అందజేయమని చెప్పి, నగరానికి పంపాడు.

పాపన్న ఉదయమే బయలుదేరి పన్నెండు మైళ్ళు నడిచి నగరం శివార్లు చేరుకుని, దుమ్ముకొట్టుకుని ఉన్న తన దుస్తులు విప్పేసి, సంచీలో నుంచి మంచి దుస్తులు తీసి వేసుకున్నాడు. రాజప్రతినిధి ఇల్లు ఒక మైలు దూరంలో ఉన్నది. కొత్త బట్టలు ధరించి, బాగా ముస్తాబై అక్కడికి వెళుతున్నవాళ్ళు పాపన్నకు కనిపించారు.

చింకి బట్టలు కట్టుకున్న పేదవాడొకడు నలుగురు పిల్లలను వెంటబెట్టుకుని దారి పక్క నిలబడి, దారే పొయ్యేవాళ్ళను ఏదో అర్థిస్తున్నాడు. ఎవరూ అతడి మాటలు వినిపించుకోకుండానే ముందుకు సాగిపోతున్నారు. పాపన్న దగ్గరలోకి రాగానే ఆ పేదవాడు, "అయ్యా బాబూ, ఒక ధోవతీ ఉంటే దయచేయించండి. ప్రభువుగారింటికి భోజనానికి వెళ్ళాలని ఉన్నది. ఈ చినిగిన బట్టలతో రానివ్వరు. ఈ పిల్లల్ని చూడండి. కాస్త పుణ్యంకట్టుకోండి," అని దీనంగా వేడుకున్నాడు.

పేదవాడి వెంట ఉన్నపిల్లలు కట్టుకున్న బట్టలు సుమారుగా ఉన్నాయి.

"నేను పొరుగూరు నుంచి వచ్చేవాణ్ణి. నా దగ్గిర వేరే బట్టలులేవు, ఇవే ఉన్నాయి,"



అంటూ పాపన్న తాను విడిచి సంచీలో పెట్టిన బట్టలు తీసి చూపాడు.

"అవే ఇవ్వండి, స్వామీ," అంటూ పేదవాడు వాటిని సంతోషంతో స్వీకరించాడు. తరవాత వాడు, "అమ్మను కూడా తీసుకుపోదాం," అంటూ పిల్లలను వెంటబెట్టుకుని తన గుడిసె వైపు వెళ్ళాడు.

పాపన్న కొంచెందూరం వెళ్ళాక ఒక దృశ్యం కనబడింది. ఒక గుర్రపు బండి దారి నుంచి పక్కకువెళ్ళి, పొలంలోని అడుసులో లోతుగా కూరుకుపోయి ఉన్నది. ఆ బండిలో ఒక పెద్దమనిషి కూర్చుని ఉన్నాడు. ఆయన వెంట బట్టల మూటలూ, జరీదైన వెండి సామాన్లూ ఎన్నో ఉన్నాయి. బండివాడు కిందికి దిగి చేత్తో గుర్రాన్ని పట్టుకుని, దానిచేత బండిని బురదలో నుంచి దారికి లాగించటానికి ప్రయత్నిస్తున్నాడు. బండిలో ఉన్న పెద్దమనిషి, "ఎవరినన్నా సాయం పిలవరా, వెధవా!" అని బండివాణ్ణి గదమాయించాడు.

బండివాడు దారిలోకివెళ్ళి, "కాస్తబండిని తొయ్యండి, బాబూ," అని అడగసాగాడు.

బండిని తొయ్యాలంటే బురదలోకి దిగాలి. అటుగా వెళ్ళేవాళ్ళంతా మంచి మంచి బట్టలు వేసుకుని రాజప్రతినిధి ఇంటికి పోతూన్నవాళ్ళు కావటంచేత, బురదలోకి దిగి బండిని తొయ్యటం ఎవరికీ ఇష్టంకాలేదు.

ఇంతలో పాపన్న అక్కడికి వచ్చాడు. బండివాడు పాపన్నను కూడా, "కాస్త ఒక చెయ్యివేసి బండిని దారికి పట్టించండి, బాబూ. ఎదురుగా వచ్చిన ఆబోతును చూసి బెదిరి గుర్రం బండిని చేలోకి ఈడ్చింది. బురద కడుక్కోవటానికి పక్కనే కాలవ ఉన్నది," అన్నాడు.

"ఊరికే తోస్తారుట్రా? బేడో, పావలో ఇస్తామని చెప్పరా!" అన్నాడు బండిలో ఉన్న పెద్దమనిషి.



పాపన్న వెంటనే తన చేతి సంచీ కింద పెట్టి, బట్ట ఎగకట్టి, పొలంలోకి దిగి, బండిని నెట్టాడు. బండి ఒకంతట కదలలేదు. అప్పుడు పాపన్న ఒక చక్రాన్ని బురదలో నుంచి పైకెత్తి మరీ తోశాడు. బండివాడు ముందునుంచి గుర్రాన్ని లాగుతుంటే, బండి కదిలి, గట్టెక్కింది.

పాపన్న తన సంచీ తీసుకోవటానికి వెనక్కు తిరిగిన సమయంలో బండిలోని పెద్దమనిషి, "తీసుకోరా!" అంటూ పాపన్న దిక్కుగా ఒక బేడాకాను పారేసి, బండితో పాటు వేగంగా సాగిపొయ్యాడు. ఆయునకు పాపన్న ముఖమైనా కనిపించలేదు.

పాపన్న ఆ బేడా తీసుకుని, మురికి చేతులతోనే తన సంచీ కూడా తీసుకుని కాలవ దాకా నడిచి వెళ్ళాడు. చక్రం పట్టి ఎత్తటంలో అతని బట్టలకు కందెన మరకలూ, బురదమరకలూ కూడా అయాయి. ఆ మరకలను కడగటానికి యత్నిస్తే మరింతమేర మరకలు విస్తరించాయి. చేసేదిలేక పాపన్న కాలవలో కాళ్ళూ చేతులూ కడుక్కుని వెనక్కు తిరిగివచ్చాడు.

పొలంలో నుంచి బండీ రోడ్డు మీదికి వచ్చిన ప్రాంతంలో పాపన్నకొక పెట్టె, గుప్పెట అమిడేటంతది, కనబడింది. అది చిన్నచిన్న నగలు పెట్టుకునే పెట్టె. పాపన్న దాన్ని తెరిచి చూస్తే అందులో ఒక రవ్వాపు టుంగరం ఉన్నది. అది బండిలో నుంచి కిందపడి ఉంటుంది. దాన్ని ఆ బండిలోని పెద్దమనిషికి చేర్చాలంటే, ఆ మనిషిని పాపన్న సరిగా చూడలేదు, బండివాణ్ణి మాత్రమే బాగా చూశాడు. బండిలో ఉండిన పెద్దమనిషికి తలపాగా, మీసాలూ ఉన్నట్టు మాత్రమే పాపన్నకు గుర్తు. ఆ పెద్దమనిషి కనిపించినా, ఉంగరం పోగొట్టుకున్న మనిషి సమాచారం తెలియవచ్చినా దాన్ని ఇచ్చేద్దామనుకుని పాపన్న ఆ ఉంగరం పెట్టెను తన సంచీలో వేసుకున్నాడు.







శంభునాయకుడి ఇంటిముందున్న దర్వాన్ పాపన్న దుస్తులూ, మరకలూ చూసి అటకాయించాడు. అక్కడే ఉన్న ఒక ఉద్యోగి పాపన్నను సమీపించి, "ఎవరయ్యా నువ్వు? ఇటెందుకు, అలా భోజనశాలకు వెళ్ళు," అన్నాడు.

తాను ఫలానా గ్రామాధికారి తరఫున వచ్చాననీ, ఆ గ్రామాధికారికి సుస్తీగా ఉన్నదనీ పాపన్న అధికారితో చెప్పాడు.

"గ్రామాధికారికి జబ్బుగా ఉంటే నీలాటి వాణ్ణా పంపేది? ఈ అవతారంతో వెళ్ళి రాజప్రతినిధిగారిని చూస్తానంటావా? పద పద!" అంటూ ఆ అధికారి, ఇతర అతిథులను మర్యాద చెయ్యటంలో నిమగ్నుడైపోయాడు.

"పోనీ ఈ కానుకలైనా లోపలికి చేర్పండి," అంటూ పాపన్న తన చేతి సంచీ పైకెత్తాడు.

"చంపక, నువ్వవతలికి పో, బాబూ. మనిషి రాకుండా వట్టి కానుకలు వచ్చాయంటే ప్రభువుగారు మండిపడతారు. వాటిని తెచ్చినచోటికే తీసుకుపో, అందరికీ క్షేమం," అన్నాడు అధికారి.

చేసేదిలేక పాపన్న వెళ్ళి వసారాలో కూర్చున్నాడు. తాను వచ్చినపని కాస్తా భ్రష్టమయిపోయినందు కతడికి చాలా కష్టం కలిగింది. ఏ అంగడికైనా వెళ్ళి కొత్త బట్టలు కొని కట్టుకు వద్దామంటే పుణ్యకాలం కాస్తా వెళ్ళిపోతుంది.

పాపన్న ఏంచెయ్యటానికీ పాలుపోని స్థితిలో ఉండగా ఒక పెద్దమనిషి తల వంచుకుని దీర్ఘాలోచన చేస్తూ పాపన్న కేసి వచ్చాడు.

పొలంలో దిగబడిన బండిలో ఉండిన పెద్దమనిషి ఈయనే. ఈయన రాజప్రతినిధి గారి ప్రధానకార్యదర్శి. ఆహ్వానించబడిన వారి కివ్వటానికి కానుకలూ, కుర్రవాడి కొక రవ్వపుటుంగరమూ కొనుక్కుని ఆయన







బండిలో తిరిగి వస్తూండగా బండి పొలాల లోకి దిగటం జరిగింది. దాన్ని గట్టు మీద ఎక్కించి రోడ్డు మీదికి దించేటప్పుడు, ఒక వెండి గిన్నె బోర్లాపడి, అందులో ఉందిన ఉంగరంపెట్టె బండి కంతల్లో నుంచి రోడ్డు పక్కన పడింది. ఇంటికి వచ్చి ఎంత వెతికినా ఆ ఉంగరంపెట్టె కనిపించలేదు.

ఉంగరం పోయిందని చెప్పగానే కార్య దర్శిని శంభునాయకుడు చెడామడా తిట్టాడు. వెయ్యి రూపాయల ఉంగరం! అది తీసుకురాకుండా ముఖం చూపించ వద్దని ఆయన కార్యదర్శిని అవమానిం చాడు. పరాభవంపొంది కార్యదర్శి బయటికి వస్తూనే పాపన్నను చూశాడు. తాను బేదా కాను విసిరింది ఇలాటి మనిషికేనని ఆయనకు తోచి, "ఏమయ్యా, పొలం నుంచి బండిని ఇవతలికి ఈడ్చిన వాడివి నువేకాదూ?" అని అడిగాడు.

"నేనే, నన్నుచూస్తే తెలియటంలేదా ?" అన్నాడు పాపన్న.

"నీకు ఒక ఉంగరంపెట్టెగాని దొరి కిందా ?" అన్నాడు కార్యదర్శి.

"అది మీదేనా ? అయితే మిమ్మల్ని నేను చూడలేదు. అది మీదని నే నెలా నమ్మేది ?" అన్నాడు పాపన్న.

"దాన్నే, పిచ్చిపిచ్చి ప్రశ్నలు వెయ్యక, దాన్ని ఇలా ఇచ్చెయ్యి," అన్నాడు కార్య దర్శి, పోయిన ఉంగరం తేలికగా దొరికిం దన్న ధీమాతో.

"తొందరపడకండి. నేనా పెట్టెను ఎత్తు కోవటం మీరు ఏ చెట్టుచాటు నుంచి అయినా చూశారేమో ? నా కెలాతెలుస్తుంది? ఆ బండిలో వచ్చినది మీరేనని బండివాడి చేత సాక్ష్యం చెప్పించండి," అన్నాడు పాపన్న, తన మీదికి వచ్చిన కార్యదర్శిని అవతలికి నెట్టుతూ.

కార్యదర్శికి చాలా పెద్ద అవమాన మయింది. తనంత వాణ్ణి అసత్యవాది కింద





జమకట్టటమేగాగ, పిడెవడో బండివాడి సాక్ష్యం నమ్ముతానంటాడా? ఎవరన్నా వింటే తన కెంత పరువుతక్కువ! తాను విసిరిన బేడా ఎత్తుకున్న వెధవ తన నింత తేలికచేసి మాట్లాడటమా? అలా అనుకుని కార్యదర్శి పాపన్న మీద చెయ్యి చేసుకో బోయాడు. బలశాలి అయిన పన్న కార్య దర్శిని అంత ఎడంలోనే నిలబెట్టాడు.

నలుగురూ చేరారు. వాళ్ళు కూడా పాపన్న పక్షమే అయి, "అతననేది న్యాయం గానే ఉంది. అతను మిమ్మల్నెరగనంటు న్నాడు. అలాటప్పుడు బండివాణ్ణి పిలిపించ టానికేం?" అన్నారు.

కార్యదర్శి ఒకణ్ణి పంపి బండివాణ్ణి బండితో సహా తెప్పించాడు. బండిలో ఉండి నది కార్యదర్శేనని బండివాడు చెప్పిన మీదట పాపన్న కార్యదర్శి చేత ఉంగరం గుర్తులు కూడా చెప్పించి, ఆ తరవాత ఉంగరం పెట్టెను కార్యదర్శి చేతికిచ్చాడు.

ఈలోపుగా, ఉంగరం ఎవరికో దొరికిం దనీ, ఆ మనిషితో కార్యదర్శి తగాదా పడు తున్నాడనీ శంభునాయకుడికి తెలిసి, ఆయన బయటికి వచ్చాడు. ఆయన అడిగినమీదట పాపన్న జరిగిన సంగతంతా చెప్పాడు. బండి ఎత్తటానికి సహాయపడిన కారణంగా బట్ట లన్నీ మరకలు చేసుకుని పాపన్న లోపలికి రాలేకపోయినందు కాయన చాలా నొచ్చు కుని, పాపన్నతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడి, "నిన్ను గురించి అదివరకు విన్నాను. ఈ విధంగా మనం కలుసు కోవటం జరిగింది. చాలా సంతోషం. లోపలికిరా," అంటూ తన వెంట తీసుకు పోయి, చాలా మర్యాదచేసి, అతను తెచ్చిన కానుకలు తీసుకుని, అతనికీ, అతని గ్రామాధికారికీ కానుకలిచ్చి పంపేశాడు. తన యజమాని చేత అంత మర్యాదపొందిన వాడికి తాను బేడాకాసు పారేసినందుకు కార్యదర్శి సిగ్గుపడి సతమతమయాడు.





# అపవాదు



పాపన్న ఉండే ఊళ్ళో ఒక దంభయ్య ఉండేవాడు. అతను కాపటానికి ఆస్తిపరుడే కాని, తన తాహతుకు మించి జమీందారు బిడ్డ లాగా బతుకుతూ, జూదం వ్యసనం మూలాన డబ్బు చాలా నష్టపోయి, ఎరిగున్న వాళ్ళందరి దగ్గిరా అప్పులు చేశాడు.

దంభయ్యకు రెండువేలకు పైగా అప్పు పెట్టిన ఒక పెద్దమనిషి, తన అప్పు రెండు మూడు రోజులలో చెల్లించవలిసిందనీ, లేకపోతే దంభయ్య ఇల్లు స్వాధీనం చేసుకుంటాననీ ఒత్తిడి చేశాడు.

అంతదాకా దంభయ్య భార్యకు, తన భర్త అప్పులపాలై ఉన్న సంగతే తెలియదు. ఆమె దంభయ్యతో, "ఇల్లు కాపాడుకోవాలి. నా నగలు ఎక్కడున్నా మంచివాడి దగ్గిర కుదవబెట్టి, డబ్బు తెచ్చి, బాకీ తీర్చెయ్యండి. పిల్ల పెళ్ళి లోపుగా ఎలాగో సొమ్మిచ్చి నగలు విడిపించుకోవచ్చు," అన్నది.

తన పుట్టింటి వారిచ్చిన ఆ నగలను దంభయ్య భార్య పెట్టుకోవటం లేదు. ఆమె వాటిని తన కుమార్తె కోసం భద్రంగా ఒక పెట్టెలో దాచి ఉంచింది. వాటిని అమ్మటానికి గాని, తాకట్టు పెట్టటానికి గాని తన భార్య ఒప్పుకోదని దంభయ్యకు తెలుసు. అయినా అతను వాటిని ఏనాడో సొమ్ము చేసేశాడు. ఒకసారి అతను జూదంలో ఒకతనికి చాలా పెద్ద మొత్తం బాకీపడి, బాకీ మరొక విధంగా తీర్చలేక, తన భార్యకు తెలియకుండా ఆమె నగలు తస్కరించి తీసుకుపోయి, జూదంలో గెలిచిన వాడికి ఇచ్చేశాడు. తరవాత ఆ ఇద్దరూ ఒక కంసాలి వద్దకు వెళ్ళి, ఆ నగల లాటివే గిల్టు నగలు చేయించారు. దంభయ్య వాటిని తెచ్చి తన భార్య నగలపెట్టెలో ఉంచేశాడు.

అప్పుడు భార్య తన నగలను తాకట్టు పెట్టి, సొమ్ము తెచ్చి, బాకీ తీర్చి, ఇల్లు







నిలబెట్టమనే సరికి, "సరే, అలాగే చేద్దాం," అని దంభయ్య నగల పెట్టె తీసుకుని బయలుదేరాడు.

ఈ నకిలీ నగలను ఎవరికి సులువుగా అంటగట్టవచ్చునా అని దంభయ్య ఆలోచించగా పాపన్న జ్ఞాపకం వచ్చాడు. పాపన్న అమాయకుడు. అతను డబ్బు వడ్డీ లేకుండా అప్పిస్తాడు. ఇస్తే గాని సాధారణంగా బాకీ అడగడు. మామూలుగా అప్పు లిచ్చేవాళ్ళ లాగా ప్రశ్నలు వెయ్యడు, పరీక్షలు చెయ్యడు.

ఇలా అనుకుని దంభయ్య తన భార్య నగల పెట్టెను పాపన్న వద్దకు తీసుకుపోయి, "పాపన్నా, ఇదివరకే నేను నీ దగ్గర మూడువందలు అప్పు చేసి ఉన్నాను. నీకు గుర్తు లేకపోయినా నేను మరిచేవాణ్ణి కాను. పెద్ద చిక్కు వచ్చిపడింది. నువే నన్ను కాయాలి. మా అమ్మాయికి ఒక సంబంధం వచ్చింది. పెళ్ళి ఖర్చులకు అవసరంగా మూడువేలు కావాలి. నువే నా పిల్ల పెళ్ళి చేశావనుకుంటాను. ఇవిగో నా భార్య నగలు. అందులో ఒక జత మురుగులూ, కాసుల పేరూ, ఒడ్డాణమూ, జడబిళ్ళా ఉన్నాయి. నువే చూడు," అని జేబులు తడువుకుని, "అరెరే, దీని తాళంచెవి ఇంట్లోనే మరిచిపోయివచ్చినట్టున్నానే!" అంటూ విచారం వెలిబుచ్చాడు.

"నీ మాట చాలదా, దంభయ్యా? నేను నగలు చూడాలా ఏమిటి? తాళంచెవి నీ దగ్గిరే ఉండనీ. తిరిగి ఈ పెట్టెను ఇలాగే తీసుకుపోవచ్చు. నీకు డబ్బిస్తాను. పిల్ల పెళ్ళి జరిపించు. శుభస్య శీఘ్రం," అని పాపన్న మూడువేల రూపాయలూ ఎంచి దంభయ్య కిచ్చి, పంపేసి నగల పెట్టెను లోపల దాచిపెట్టాడు.

ఆ డబ్బుతో దంభయ్య తన బాకీ తీర్చి, ఇంటిని కాపాడుకున్నాడు. తన నగలను మరొకరి దగ్గిరా, మరొకరి దగ్గిరా కాకుండా,







పాపన్న దగ్గిర తాకట్టు పెట్టినందుకు దంభయ్య భార్య కూడా సంతోషించింది.

కాలం గడుస్తున్నది. దంభయ్య భార్య తన నగలను తాకట్టు విడిపించమని భర్తను తొందర చేస్తున్నది. "డబ్బు దొరక లేదు. తొందరపడకు," అని దంభయ్య భార్యకు సమాధాన మిస్తున్నాడు. అతను సాధ్యమైనంతవరకు పాపన్న కంట పడ కుండా తిరుగుతున్నాడు. ఒకసారి పాపన్న కనిపించి, "పిల్ల పెళ్ళి వలక్షణంగా జరిగిందా?" అని అడిగితే, "ఆ సంబంధం తప్పిపోయింది. వేరే సంబంధాలు చూస్తున్నాం," అని దంభయ్య అబద్ధం చెప్పి తప్పించుకున్నాడు.

ఇలా రెండేళ్ళు జరిగిన మీదట దంభయ్య కూతురి కొక మంచి సంబంధం నిజంగానే వచ్చింది. వధూవరులు ఒకరిని ఒకరు చూసుకుని ఇష్టపడ్డారు. వరుడి తండ్రి మటుకు సాలంకృత కన్యాదానం జరగాలని పట్టుబట్టాడు. సాలంకృత కన్య అంటే తలకూ, మెడకూ, చేతులకూ, నడుముకూ బంగారు నగ లుండాలి. యథాశక్తి పిల్లకు ఏవో నగలు పెడతానంటే వరుడి తండ్రి ఒప్పుకోలేదు. వరుడే పట్టుబట్ట వద్దని సలహా ఇచ్చినా అతని తండ్రి విన్నాడుకాదు. నిక్షేపం లాటి సంబంధం చెయ్యి దాటి పోయేటట్టు కనబడింది. పెళ్ళికూతురు ఏడవసాగింది. తాకట్టు నగలను విడిపించుకు రమ్మని భార్య దంభయ్యను అడిగింది. దంభయ్య తన భార్యను తిట్టి, ఇంకో సంబంధం చూస్తానని ఇంటి నుంచి బయలుదేరి వెళ్ళాడు.

పాపన్న దయతలిస్తే తప్ప తన కూతురికి పెళ్ళి జరగదనుకుని, దంభయ్య భార్య తన కుమార్తెను వెంటబెట్టుకుని పాపన్న ఇంటికి వెళ్ళింది.

పాపన్న ఇంట లేడు గాని మీనాక్షి ఉన్నది. దంభయ్య భార్య మీనాక్షిని తన







కూతురి పెళ్ళి ఎలాగైనా జరిపించమని వేడుకున్నది.

"నిజమేనమ్మా, బాకీతో ముడిపెట్టి మంచి సంబంధం వదులుకుంటారా? మా ఆయన రాగానే మీ నగలపెట్టె మీకు పంపిస్తాము. మీకు నచ్చిన సంబంధాన్ని పోనివ్వకండి," అన్నది మీనాక్షి.

దంభయ్య భార్య ఇంటికి తిరిగి వెళ్ళి, "రేపు నిశ్చితార్థం చేసుకునేటందుకు రండి. మీ ఇష్టప్రకారమే వివాహం జరుపుతాము," అని పెళ్ళివారికి కబురు చేసింది; భర్త రాగానే అతనితో జరిగినదంతా చెప్పి, పాపన్ననూ, మీనాక్షినీ తెగ పొగడింది.

అదీ ఒకందుకు మంచిదే ననుకున్నాడు దంభయ్య. అన్నట్టుగానే మర్నాడు పాపన్న నగలపెట్టెతో సహా దంభయ్య ఇంటికి వచ్చాడు. నిశ్చితార్థానికి పాపన్నను కూడా ఉండమని దంభయ్య కోరాడు. కొద్దిసేపట్లో వరుడూ, వరుడి తండ్రీ, పురోహితుడూ, సిద్ధాంతీ వచ్చారు.

దంభయ్య నగలపెట్టె వాళ్ళ ముందు పెట్టి, "ఇవి నా భార్య నగలు. వీటితోనే కన్యాదానం చేతామనుకున్నాం. కాని గ్రహచార వశాత్తు వీటిని ఈ పాపన్నగారి వద్ద మూడువేలకు తాకట్టు పెట్టవలసి వచ్చింది. అయినా ఆయన సద్బుద్ధితో, అప్పు నింపాదిగా తీర్చుకోమని ఈ నగలు తెచ్చి ఇస్తున్నాడు. ఆయన దయ వల్లనే ఈ పెళ్ళి జరుగుతుంది," అన్నాడు.

"అదంతా అప్పు డెందుకులే. పెట్టె తెరిచి లాంఛనగా వారికి నగలు చూపించు," అన్నాడు పాపన్న.

దంభయ్య లేచి పెళ్ళి పెట్టె తాళంచెవి తెచ్చాడు. ఆ తాళంచెవి పాపన్న వద్ద ఉండకపోవటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. దంభయ్య తన కిచ్చిన తాళంచెవిని పాపన్న వరుడి తండ్రి కిచ్చాడు. ఆయన పెట్టె తెరిచి, అందులోని నగలను పైకెత్తి,





"ఏమిటీ నగలు? అన్నీ గిల్టు నగలు! అన్నీ కలిసి యాభైరూపాలు చెయ్యవు." అంటూ దంభయ్య కేసి రౌద్రంగా చూశాడు.

దంభయ్య పాపన్న కేసి అంతకన్న భయంకరంగా చూసి, "ఇదేమిటి, పాపన్నా? నమ్మినందుకు భలేపని చేశావే! అసలు నగలు కాజేసి నకిలీ నగలు పెట్టేశావా? గొప్ప పరోపకారినని చెప్పుకు తిరుగుతూ ఇలాటి పని చేసే నీవంటి వాణ్ణి ఏంచేసినా పాపం లేదు!" అని అరిచాడు.

"తాళంచెవి మీ దగ్గిరే ఉందిగా?" అన్నాడు వరుడు.

దంభయ్య భార్య తన భర్త చేసిన మోసం గ్రహించి, "ఇదంతా నా కర్మ! ఇటువంటి దుర్మార్గానికి ఒడిగట్టిన మనిషి చేజేతులా నా పిల్ల గొంతు కోసేస్తాడు. ఎంత ఘోరం వచ్చిపడిందిరా, దేవుడా!" అని వలవలా ఏడ్చింది.

పాపన్న దంభయ్య భార్యను అవతలికి తీసుకుపోయి, "చూడండమ్మా, నా పైన అపనింద వస్తే పోయిందేమీ లేదు. కాని, ఈ పని చేసిం దెవరో మీకు తెలిసిన పక్షంలో పై కేమీ అనకండి. ఈ పెళ్ళి జరిగి తీరుతుంది. మీరు ఏమీ అనకుండా, ధైర్యంగా ఉండండి," అని చెప్పాడు.



అతను ఇవతలికి వచ్చి, "ఇప్పుడే ఒక అరగంటలో వస్తాను. అంత దాకా ఆగి ఉండండి," అని చెప్పి చకచకా ఇంటికి వెళ్ళాడు. అతను మీనాక్షితో, "ఒక పిల్ల జీవితం భ్రష్టు కాకుండా చూడాలి. నీ నగలియ్యి," అన్నాడు.

మీనాక్షి తన నగల పెట్టె తీసుకుని పాపన్న వెంట తాను కూడా బయలుదేరి వచ్చింది.

పాపన్న లేని సమయంలో దంభయ్య, పాపన్న మోసగాడన్నది ప్రచారం చెయ్య యత్నించాడు. కాని ఒక్కరు కూడా పాపన్న మోసం చేశాడని నమ్మలేదు.





పాపన్న కోరినందుకే పెళ్ళివారు వెళ్ళిపో కుండా ఆగారు.

ఇంతలో పాపన్న తిరిగి వచ్చి, మీనాక్షి చేతి నుంచి నగల పెట్టె తీసుకుని, తెరిచి పెళ్ళివారి ముందు పెట్టి, "ఈ నగలు పెళ్ళి కూతురికి పెడతాం. పెళ్ళి నిశ్చయం చేసు కోండి," అన్నాడు.

ఈ లోపల నకిలీ నగలను పరీక్షిస్తున్న వరుడు, "ఈ వడ్డాణం మీద దీన్ని చేసిన వాడి గుర్తున్నది. ఇది వెంకటాచారి అనే కంసాలి గుర్తు," అన్నాడు.

ఈ మాట చెవిని పడగానే దంభయ్య ముఖం వెలవెల పోయింది. పాపన్న చప్పున గిల్టు నగలను పెట్టెలో పెట్టి, పెట్టె మూస్తూ, "ఆ గొడవంతా ఇప్పుడు దేనికి? వీటిని దంభయ్య నా దగ్గిర తాకట్టు పెట్టాడు. అవి నా దగ్గిరే ఉంటాయి," అన్నాడు.

పాపన్న ఉదారబుద్ధి అందరికీ స్పష్ట మయింది. పెళ్ళికొడుకు తండ్రి మీనాక్షి నగలను తీసుకో నిరాకరిస్తూ, పెళ్ళి నిశ్చయం చేశాడు.

ఈ వృత్తాంతం క్షణంలో ఊరంతా పాకింది. ఒక పెద్దమనిషి దంభయ్య ఇంటికి వచ్చి, అక్కడ ఉన్న పెళ్ళిపెద్దతో, "ఇవిగోనండీ మీరు చేసుకోబోయే పిల్ల నగలు. జూదంలో ఓడిపోయి ఈ దంభయ్య నాకీ నగలిచ్చాడు. మే మిద్దరమూ కలిసి నకిలీ నగలు చేయించాం. అసలు నగలను పాపన్నగారు కాజేసి, నకిలీ నగలు పెట్టెలో ఉంచినట్టు అపవాదు పుట్టిందని విని, సహించలేక వీటిని తిరిగి ఇచ్చేస్తున్నాను. జూదంలో గెలుచుకున్నవే గాని, ఈ నగలు నా కష్టార్జితం కావు గనక, అవి పోతే నా కేమీ విచారం లేదు లెండి," అన్నాడు.

దంభయ్య కూతురి పెళ్ళి సలక్షణంగా జరిగింది. కాని అంత దాకా ఎంతో గుంభ నగా బతుకుతున్న దంభయ్య బతుకే బయటపడింది.





# నాట్యప్రదర్శన

ఒక దంభయ్య పాపన్న దగ్గిర గిల్టునగలు కుదవబెట్టి మూడువేల రూపాయలు అప్పు తీసుకున్నాడన్న వార్త కార్చిచ్చు లాగా చుట్టుపక్కల గ్రామాలకు కూడా పాకి, దంభయ్య పరువంతా ఒక్కసారిగా. తుడిచి పెట్టుకుపోయింది.

ఇది జరిగిన కొద్దిరోజులకే ఆ దేశపు రాజుగారు జైత్రయాత్ర నుంచి తిరిగి వస్తూ, ఆ ప్రాంతాలలోనే మజిలీ చేస్తారని తెలియ వచ్చింది. ఆ చుట్టుపక్కల ఉండే పది, పన్నెండు గ్రామాల ప్రముఖు లందరూ చేరి, రాజుగారికి మర్యాదలన్నీ జరిపి, ఆయన గౌరవార్థం విందులూ, వినోదాలూ ఏర్పాటు చెయ్యాలని తీర్మానించారు. ఇలా కార్యభారం మీద వేసుకున్న వారిలో పాపన్న కూడా ఉన్నాడు.

ఆ పది, పన్నెండు గ్రామాలలో ఉండే నటులూ, గాయకులూ, నర్తకులూ, వాద్యగాళ్ళూ ఏకమై, రాజుగారి ముందు వేరు వేరు కళాప్రదర్శన లిచ్చి, తగిన సన్మానం పొంది, ఆ డబ్బుతో కళాభివృద్ధికి సాధనాలూ, స్థలసౌకర్యాలూ ఏర్పాటు చేసుకుందా మనుకున్నారు. అప్పు డున్న స్థితిలో వారికి తగిన దుస్తులూ, ఆభరణాలూ, వాద్యాలూ తగినట్టుగా లేవు. అందుచేత రాజుగారి ముందు ప్రదర్శన లివ్వటానికి ప్రతిదీ ఎక్కడో ఒకచోట అరువు తేవలసి వచ్చింది. అన్నీ దొరికాయి గాని నాట్యగత్తెకు కావలసిన ఆభరణాలు మాత్రం అరువుకు కూడా దొరకలేదు.

ఈ సంగతి వినగానే పాపన్న ఉండే గ్రామాధికారికి పాపన్న వద్ద తాకట్టున్న గిల్టునగలు జ్ఞాపకం వచ్చాయి. ఆయన కళాకారులతో, "మా వూరి పాపన్న వద్ద గిల్టునగ లున్నాయి. అవి మీ నర్తకి చేసే భరతనాట్యానికి పనికొస్తాయి. అవి మీరు







వాడుకుని, రాజుగారు నర్తకికి చేసే సన్మానంలో మూడోవంతు అతనికి ముట్టజెప్పింది. ప్రతిఫలం మాట ముందుగా పాపన్నతో మాత్రం అనకండి. అతనికి అలాటివి పనికిరావు," అన్నాడు.

కళాకారులు గ్రామాధికారిని వెంటబెట్టుకుని పాపన్న ఇంటికి వెళ్ళి, భరతనాట్య ప్రదర్శనానికి గిల్టునగలు అరువియ్యమని కోరారు. "నా దగ్గిర గిల్టునగ లేవీ లేవే?" అన్నాడు పాపన్న.

"అలా అంటావేం, పాపన్నా? మన గ్రామం దంభయ్య నీ దగ్గిర కుదవపెట్టినవి గిల్టు నగలేగా?" అన్నాడు గ్రామాధికారి.

"అవి దంభయ్యవి గద. అదిగాక ఆ పెట్టె తాళంచెవి నా దగ్గిర లేదు. మీకు నగలే కావాలంటే మంచి నగలే ఇస్తాను, తీసుకోండి," అన్నాడు పాపన్న.

"మంచి నగలు కావాలంటే నీ దాకా వస్తామా? వీళ్ళు మంచినగలు తీసుకోరు. నాట్యానికి నకిలీ నగలే కావాలి. అవి దొరక్కనే నీ దాకా రావలిసివచ్చింది," అన్నాడు గ్రామాధికారి.

ఆయన దంభయ్య ఇంటికి - మనిషిని పంపి, దంభయ్యను తాళంచెవితో సహా రప్పించాడు. దంభయ్య వచ్చి, ఏ ఆక్షేపణా చెప్పక, తాళంచెవి ఇచ్చి నకిలీ నగలను నాట్యగత్తెకు అప్పించాడు.

అందరూ అనుకున్నట్టుగానే రాజుగారు ఆ ప్రాంతాల శిబిరం వేశారు. చుట్టుపట్ల గ్రామాల వాళ్ళు ఆయనకు సకల మర్యాదలూ చేసి, విందులూ, వినోద కార్యక్రమాలూ జరిపించారు. రాజుగారు కళా ప్రదర్శనాలన్నిటినీ మెచ్చుకున్నారు. భరతనాట్య ప్రదర్శనం ఆయనకు ప్రత్యేకంగా నచ్చింది. నాట్యగత్తెకు పదివేల రూపాయలు బహుమానం ఇచ్చారు రాజుగారు.

నాట్యగత్తె గ్రామాధికారిని వెంటబెట్టుకుని పాపన్న ఇంటికి వచ్చి, "ఇవిగో,





మీ నగలు. ఇదుగో బహుమానంలో మీ వంతు," అంటూ పాపన్న ముందు గిల్టు నగలూ, మూడువేల మూడువందల చిల్లర రొక్కమూ పెట్టింది.

పాపన్న ఆ డబ్బు చూసి విస్తుపోయి, "ఈ డబ్బేమిటి?" అన్నాడు.

"గిల్టునగలు ఆరువిచ్చిన వారికి బహుమానంలో మూడోవంతు ఇవ్వవలసి ఉంటుందని ముందే నిర్ణయించుకున్నాం. రాజుగారు అనుగ్రహించి పెద్దమొత్తం ఇచ్చారు. అందులో మూడోవంతు నీదే!" అన్నాడు గ్రామాధికారి.

"గిల్టునగలు దంభయ్యవి. ఈ డబ్బు ఆతనికే చెందాలి," అన్నాడు పాపన్న గిల్టు నగలను మాత్రం ఎత్తి పెట్టెలో పెడుతూ.

గ్రామాధికారి ఆ డబ్బును తీసుకుపోయి దంభయ్య ముందు పెట్టి, జరిగిన సంగతి చెప్పి, "గిల్టునగలు నీవే గనక ఈ డబ్బు నీకే చెందాలంటున్నాడు పాపన్న," అన్నాడు.

దంభయ్య గ్రామాధికారితో, "అలాగా? అయితే మీరు కాస్త నా వెంట పాపన్న ఇంటికి రావాలి," అని ఆ డబ్బును తీసుకుని, పాపన్న ఇంటికి వచ్చి, పాపన్నతో, "పాపన్నా, ఇదుగో నీ బాకీ. ఇది తీసుకుని నా నకిలీనగలు నా కిచ్చెయ్యి. నీ చేతి మహత్యం వల్ల ఈ నకిలీనగలకు బంగారం విలువ వచ్చింది. నాకు మంచి పాఠం కూడా వచ్చింది. ఈ విధంగానైనా నన్ను ఋణవిముక్తుణ్ణి చెయ్యి, పాపన్నా," అన్నాడు దీనంగా.

"అలాగే, నీ నగలు నువ్వు తీసుకో," అన్నాడు పాపన్న.

దంభయ్య మూలాన పాపన్న నష్టపోయినప్పుడు గ్రామంలో వాళ్ళు విచారించారు గాని పాపన్న ఏమీ విచారించలేదు. అలాగే అతని డబ్బు తిరిగి వచ్చినందుకు పాపన్న సంతోషించకపోయినా, అతని గ్రామంలో వాళ్ళు ఎంతో సంతోషించారు.





# దారిలోని చిత్రం

ఒకనాడు పాపన్న పని మీద బస్తీ వెళు తూండగా ఒక పల్లె సమీపంలో దారి పక్కన అతని కొక బొమ్మపటం కనిపించింది. ఎవరో కుర్రాడు అట్టమీద లక్ష్మీదేవి బొమ్మ వేశాడు. పాపన్న దాన్ని తీసి, దుమ్ము దులిపి చూశాడు. అది పూజ కోసం వేసి నట్టుగా ఉన్నది. ఆ బొమ్మ వేసిన కుర్రాడు పసుపురంగు కింద పసుపూ, ఎరుపు కింద కుంకమా, నీలం నలుపు రంగుల కింద ఆరంగుల సిరాలూ వాడాడు. అది సిద్ధ హస్తుడు వేసిన బొమ్మ కాకపోయినా చూడ టానికి బాగానే ఉన్నది. అంత శ్రద్ధగా తయారు చేసిన బొమ్మను ఎవరు పారేశారో, ఎంతమంది తొక్కారో అని పాపన్న చాలా నొచ్చుకుని, దాన్ని బస్తీకి తీసుకుపోయి, తన సొంతడబ్బుతో చట్రం వేయించాడు.

బస్తీలో పని పూర్తి అయాక పాపన్న ఇంటి దారిపట్టి వస్తూండగా, దారిలో ఒక చెట్టు కింద ఒక ముసలి అంధుడూ, వాడి ముసలి భార్యా కూచుని కనిపించారు. వాళ్ళక్కడ కూర్చుని దారేపొయ్యే వాళ్ళని యాచిస్తున్నారు.

పాపన్నను చూసి ముసలిది, "ముస లాడు పడి లేచాడు, బాబూ. ఇంత గంజి తాగిస్తాను, ఏమైనా ధర్మం చెయ్యండి," అని అడిగింది.

జేబు తడివి చూసుకుంటే పాపన్నకు దమ్మిడీ కూడా దొరకలేదు. ఉన్న డబ్బులో కొంతపెట్టి చట్రం కట్టించాడు. మిగతాది బీదకూ, బిక్కకీ దానం చేశాడు.

"నా దగ్గిర ఏమీలేదే, నా చేతి ఉంగరం యిస్తే మీ కేమైనా ఉపయోగ పడుతుందా?" అన్నాడు పాపన్న.

ముసలిది వెంటనే అతన్ని గుర్తించి, "నువు పాపన్నవు కాదు, నాయనా? బంగా రపు ఉంగరం మాలాటి వాళ్ళకు దక్కు



తుందా? ఏదైనా తేలిక వస్తువుగా చూసి ఇయ్యి. నీ చేత్తో ఏమిచ్చినా మాకు సుభిక్షమే," అన్నది.

"ఈ లక్ష్మీదేవి బొమ్మ తప్ప నా దగ్గిర ఇంకేమీ లేదు," అన్నాడు పాపన్న.

"అదే ఇవ్వు, బాబూ. ఆ దేవికి పూజ చేసుకుంటూ బిచ్చమెత్తుకుంటాం," అన్నది ముసలిది.

ముసలాడు కూడా ఆ మాటే అన్నాడు. పాపన్న వాళ్ళకా పటం ఇచ్చి ఇంటికి తిరిగి వచ్చేశాడు. అదృష్టవశాన ఆ ముసలి దంపతులకు ఆనాడు బాగా డబ్బులూ, ధాన్యమూ దొరికాయి. వాళ్ళ గుడిసె ఆ దగ్గరలోనే ఉన్నది. రోజూ ముసలిది తన మొగుణ్ణీ, లక్ష్మి పటాన్నీ ఆ చెట్టు కిందే కూర్చోబెట్టి పోతూ వచ్చింది.

లక్ష్మీదేవి వాళ్ళకు అనుగ్రహించినట్టు కనబడింది. అంతకు పూర్వం వాళ్ళకు ఒక పూట కడుపు సగం నిండేది, మరో పూట అదీ ఉండేదికాదు. కాని ఇప్పుడు దారే పొయ్యే వాళ్ళంతా లక్ష్మి పటానికి దణ్ణం పెట్టుకుని, గుడ్డివాడి ముందు తృణమో, పణమో వేసి మరీ వెళుతున్నారు.

రెండు మూడు రోజులిలా గడిచాక ఒక పదిహేనేళ్ళ కుర్రాడు అటుగా వచ్చి, ఆ పటాన్ని చూసి, "ఈ బొమ్మ నీకెలా దొరికింది?" అని గుడ్డివాణ్ణి అడిగాడు.

గుడ్డివాడు భయపడుతూ, "ఎవరు నాయనా, నువ్వు? ఎవరో ధర్మాత్ముడు పెట్టిన భిక్ష ఇది కూడా. అదే మమ్మల్ని కాపాడుతున్నది. నువ్వు కూడా ఇంత ధర్మం చేసిపో, బాబూ, నీకు మంచి లాభం కలుగుతుంది," అన్నాడు.

"ఇది నా బొమ్మే. అనుమానం లేదు. చక్కగా పటం కట్టించారెవరో," అని ఆ కుర్రాడు పైకే అనుకోవటం విని గుడ్డివాడికి మరింత భయం వేసింది. వాడు భార్యను పిలుస్తూ, "ఒకసారి ఇటురావే.

ఎవరో అల్లరి పిల్లాడల్లే ఉంది. పటం కాస్తా ఎత్తుకు పోతాడేమో, చూడూ," అని పెద్ద కేకపెట్టాడు.

ముసలాడింకా మాట పూర్తి చెయ్యక ముందే ఆ కుర్రాడు పటం తీసుకుని, పరుగు లంకించుకున్నాడు. ముసలిది వచ్చి పటం పోయిన సంగతి తెలుసుకున్నది. భార్యాభర్త లిద్దరూ లబోదిబోమన్నారు. కాని ఎవరు వింటారు?

నిజానికి ఆ లక్ష్మిబొమ్మ వేసినది ఆ కుర్రాడే. వాడి పేరు రాములు. బొమ్మ మీద వాడు ఒక మూలగా తన పేరు కూడా రాసుకున్నాడు. వాడికి బొమ్మలు వెయ్యటం ఒక పిచ్చి. చదువూ, చట్టు బండలూ లేకుండా వాడు అస్తమానమూ బొమ్మలు వేసేవాడు. తండ్రికి వ్యాపారం ఉన్నది. రాములు బుద్ధి కనీసం వ్యాపారంలోనన్నా ప్రవేశించలేదు. తన కొడుకు నిజమైన చిత్రకారుడు కావాలంటే కష్టపడి చిత్రకళ అభ్యసించాలి. ఆపైన ఏ రాజుగారి ప్రాపకమో దొరకాలి. అంతేగాని ఇలా పిచ్చి బొమ్మలు గీస్తే రాములు ఎందుకూ పనికి రాకుండా పోతాడు. అందుచేత రాములు తండ్రి తన కొడుకు వేసిన లక్ష్మిబొమ్మనూ, వాడి పరికరాలనూ చూసి మండిపడి, వాటిని దూరంగా పారేశాడు. రాములు తండ్రి





పారేసిన లక్ష్మిబొమ్మ పాపన్నకు దారి పక్కన దొరికింది.

చట్రం వేసిన తన బొమ్మను రాములు ఇంటికి తీసుకుపోయి, తన తండ్రి కంట పడకుండా దాచుదా మనుకున్నాడు, కాని తండ్రి దాన్ని చూడనే చూశాడు. ఆయన కోపంగా, "ఒరే, వెధవా! నేను అవతల పారేసిన ఆ దిక్కుమాలిన బొమ్మకు చట్రం కూడా కట్టించు కొచ్చావా? నీ కంత డబ్బె క్కడిది? నా జేబులో డబ్బులు తగ్గి నట్టుంటే ఏమో అనుకున్నాను, జేబులు కొట్టటం కూడా నేర్చావా?" అంటూ రాములు చెవి పట్టుకున్నాడు.

"లేదు, నాన్నా, డబ్బులు దొంగిలించ లేదు," అని రాములు నాలుక కరుచు కున్నాడు. దాన్ని ఒక గుడ్డి బిచ్చగాడి దగ్గర నుంచి దొంగిలించి తెచ్చినట్టు వాడు తండ్రి కెలా చెబుతాడు? ఆ మాట వింటే తండ్రి మరింత మండి పడతాడు. అందుకని రాములు, "దీన్ని ఎవరో తీసుకుపోయి, చట్రం వేయించుకుని పూజకు పెట్టు కున్నారు. ఈ పటాన్ని పూజిస్తే చాలా లాభం కలుగుతుందిట. అది నేను రాసిన బొమ్మే నని చెప్పేసరికి నా కిచ్చేశారు. మనం ఇంట్లో ఉంచుకుని పూజ చేస్తే మనకే లాభం వస్తుంది, నాన్నా," అన్నాడు.

"అయితే దీనితో ఎంతలాభం చేస్తావో చేసి పట్టుకురా. వట్టి చేతులతో ఇంటి కొచ్చావో నీకు అన్నం పుట్టదు," అంటూ తండ్రి రాముల్ని బయటికి గెంటాడు.

రాములు ఆ పటాన్ని తీసుకుని కాస్త డబ్బున్నవాళ్ళ ఇళ్ళకుపోయి, "బొమ్మ కొంటారా?" అని అడగసాగాడు: ఎవరూ కొనలేదు. కొందరు ఆ బొమ్మను చూస్తూనే, "ఫో అవతలికి," అని వాణ్ణి కసిరారు. కొందరు వాణ్ణి చూసి నవ్వారు. మరి కొందరు ఊరికే ఇచ్చినా ఆ బొమ్మ తమ కక్కర్లే దని చెప్పేశారు.





రాములు ఆ పటాన్ని అమ్మటానికి ప్రయత్నిస్తూ, చివరకు పాపన్న ఇంటికి కూడా వచ్చాడు.

పాపన్న ఆ పటాన్ని చూసి ఆశ్చర్యపోయి, "నీ కిది ఎలా దొరికింది?" అని రాముల్ని అడిగాడు.

"ఈ బొమ్మ నేనే గీశాను. మా నాన్న దాన్ని అవతల పారేశాడు. ఇది ఎలాగో ఒక ముసలి గుడ్డివాడి దగ్గిరికి చేరింది. నాది నా కివ్వమంటే వా డివ్వలేదు. అందుకని దీన్ని ఎత్తుకొచ్చాను. తన జేబులో డబ్బు దొంగిలించి పోయి నేనీ బొమ్మకు చట్రం వేయించాననుకుని మా నాన్న నన్ను ఇంటి నుంచి తరిమేశాడు; డబ్బు లేకుండా ఇంటికి రావద్దన్నాడు," అని రాములు పాపన్నకు సంగతంతా చెప్పాడు.

"బొమ్మ మీద రాములు అని రాసి ఉన్నది, నీ పేరేనా?" అని పాపన్న అడిగాడు.

"అవునండి. నాకు బొమ్మలు గీసే పిచ్చి ఉన్నది. అది మా నాన్నకు చాలా కోపం," అన్నాడు రాములు.

"నీ బొమ్మకు చట్రం వేయించింది నేనే. దీన్ని అయిదు రూపాయలకు నేనే కొంటాను. ఆ డబ్బు తీసుకుపోయి మీ నాన్న కియ్యి," అంటూ పాపన్న బొమ్మ తీసుకుని, రాములు చేతిలో అయిదు రూపాయలు పెట్టాడు.

తరవాత పాపన్న ఆ పటం తీసుకుపోయి ఆ ముసలిదంపతుల కిచ్చి ఇక దాన్ని ఎవరూ ఎత్తుకుపోరని ధైర్యం చెప్పాడు. ఆ తరవాత అతను రాములింటికి వెళ్ళి, రాములు తండ్రితో, "మీ వాడికి చిత్రకళలో మంచి అభిరుచి ఉన్నది. వాణ్ణి నా వెంట పంపండి. రాజుగారి చిత్రకళాశాలలో చేర్పించి చిత్రకళ నేర్పిస్తాను. మంచి చిత్రకారు డవుతాడు," అని చెప్పి, అయనను ఒప్పించాడు.







# పెళ్ళికానుక

చాలా ఏళ్ళ క్రితం పాపన్న సకుటుంబంగా తన అత్తవారింటికి నెల రోజులపాటు వెళ్ళవలసి వచ్చింది. అందుచేత అతను తన ఆవునూ, లేగనూ పొరుగింటి వాళ్ళ పాకలో ఉంచి, తరవి కోడెదూడను, గొడ్లను కాసే సుబ్బడి వద్ద ఉంచాడు. పాపన్న తిరిగి వచ్చేదాకా ఆ దూడ సుబ్బడి ఇంట్లోనే ఉండి, సుబ్బడి కూతురు మల్లికి బాగా మాలిమి అయింది.

తన దూడను తోలుకు పోవటానికి సుబ్బడింటికి వెళ్ళిన పాపన్న, ఆ దూడ మల్లిని రాచుకు రాచుకు తిరగటమూ, దూడను తీసుకుపోతారు గదా అని మల్లి కన్నీరు కార్చటమూ చూసి, "దూడ మీ ఇంటికి బాగా అలవాటైనట్టుందే?" అన్నాడు సుబ్బడితో.

"మరేం లేదండి. మా మల్లికి దూడంటే ప్రాణమైపోయింది. మల్లి ఏం చెప్పినా దానికి అర్థమవుతుంది. మూగజీవమైతే మాత్రమేం, బలే బుద్ధిగల దూడండి," అన్నాడు సుబ్బడు.

"చూడు, సుబ్బడూ. దూడకు మీ ఇల్లే అనువుగా ఉంటుంది. దాన్ని నువే ఉంచుకో," అన్నాడు పాపన్న.

"పేదవాణ్ణి, దూడ ఖరీదిచ్చుకోలేను, బాబూ. ఇచ్చుకోగలిగితే ఉంచుకోవాలనే ఉంది," అన్నాడు సుబ్బడు.

"నిన్ను ఖరీదెవరడిగార్రా? ఊరికే ఇచ్చాను, తీసుకో. ఇక నుంచి ఆ దూడ నీదే—నీది, మల్లిదీనూ! సరేనా?" అని పాపన్న ఇంటికి వెళ్ళిపోయాడు.

రోజులు గడిచాయి. మల్లికి పెళ్ళీడు వచ్చింది. గిత్త కూడా ఏపుగా పెరిగింది. దాన్ని అమ్మజూపితే ఎవరైనా ఎగరేసుకు పోతారు. అందుచేత గిత్తను అమ్మి కూతురికి పెళ్ళిచేయాలని సుబ్బడు ఆలోచన



చేశాడు. ఈ ఆలోచనను సుబ్బుడు పాపన్నకు తెలియజేసి, అతని సలహా అడిగాడు. అలాగే చెయ్యమన్నాడు పాపన్న.

సుబ్బుడు గిత్త నమ్ముతున్నట్టు తెలియగానే సోమయ్య అనేవాడు దాన్ని కొనాలని నిశ్చయించాడు. అతనికి పాపన్న తెలుసు. పాపన్నను అడ్డం పెట్టి బేరం చేస్తే చౌకగా దొరుకుతుం దనుకుని, పాపన్న వద్దకు వచ్చి, "పాపన్నా, నువ్వు సుబ్బుడి కిచ్చావు చూడూ, ఆ గిత్తను సుబ్బుడు అమ్ముతున్నాడని తెలిసింది. కొందా మనుకుంటున్నాను," అన్నాడు సోమయ్య.

"కొనుక్కో. నా అభ్యంతర మేమీ లేదు. అన్ని హక్కులతోనూ నేనా దూడను సుబ్బుడి కిచ్చేశాను," అన్నాడు పాపన్న.

"బేరం చెయ్యటానికి నువ్వు కూడా నావెంట రా. అది నాకూ, సుబ్బుడికి కూడా మంచిది," అన్నాడు సోమయ్య. పాపన్న తన వెంట ఉండి గిత్తను కొనిపిస్తుంటే సుబ్బుడు పూర్తి ధర అడగలేడని సోమయ్య నమ్మకం. ఆ దూడ ఒకప్పుడు పాపన్నదే గద.

పాపన్న సోమయ్య వెంట వెళ్ళటానికి ఒప్పుకున్నాడు. తానే దగ్గిర ఉండి అమ్మిస్తే సుబ్బుడు కూడా తృప్తిపడతాడని పాపన్న అభిప్రాయపడ్డాడు.

ఇద్దరూ కలిసి సుబ్బుడి యింటికి వెళ్ళారు. అంతా విని సుబ్బుడు పాపన్నతో, "మీరు ఎంత కివ్వమన్నా ఇచ్చేస్తాను?" అన్నాడు.

"మధ్య నేను చెప్పటందేనికి, సుబ్బుడూ? ఆ గిత్త నీదే. దాన్ని నువ్వు ఎంత కమ్ముదలి చావో చెప్పెయ్యి. ఇష్టమైతే కొంటారు, లేకపోతే మానేస్తారు," అన్నాడు పాపన్న.

"అలా అయితే, గిత్తను నూరురూపాయలకు అమ్మేస్తానండి. నలుగురినీ అడిగి విచారించాను. అది దానికి న్యాయమైన ధరే. కాదంటారా, మీరే ఏదో ధర చెప్పండి. మారు మాట్లాడకుండా ఇచ్చేస్తాను," అన్నాడు సుబ్బుడు పాపన్నతో.







సోమయ్య పాపన్నను అవతలికి తీసుకు పోయి, "ధర చాలా చెబుతున్నాడు. యాభై రూపాయల కియ్యమని చెప్పు. నువు చెప్పిన ధర కిస్తానంటున్నాడు గదా?" అన్నాడు.

"వాడి గిత్త. వాడు కోరిన ధరకు వాడమ్ముకుంటాడు. ధర జాస్తి అని తోస్తే కొనకు. అంతేగాని, దాన్ని అంత ధరకు అమ్మమని వాడితో నేనెలా అంటాను?" అన్నాడు పాపన్న.

"అయితే నీ వల్ల నాకు ఏం సహాయమైనట్టు?" అన్నాడు సోమయ్య.

"అదేమో నీకే తెలియాలి. నేను రాకపోతే వాడింకా జాస్తి ధర చెప్పేవాడేమో. వాడు చెప్పిన ధర నీకు అన్యాయమని తోస్తే గిత్తను కొనకు," అన్నాడు పాపన్న.

"నువ్వేదో ఒరగబెడతా వనుకున్నాను. చాల్లే!" అంటూ సోమయ్య కోపంగా వెళ్ళిపోయాడు.

పాపన్న సుబ్బడి దగ్గిరికి తిరిగివచ్చి, "సుబ్బడూ, నువ్వడిగిన ధర సోమయ్యకు నచ్చలేదు. ఒక పని చేద్దాం. నీ గిత్తను నూరు రూపాయలకు నాకే అమ్మి, పిల్ల పెళ్ళి చేసెయ్యి," అన్నాడు.

"ఎంతమాట, బాబూ? మీ గిత్తను మీకే అమ్మటమా? కావాలంటే ఊరికేనే తీసుకోండి. పిల్లదానిపెళ్ళి ఏదో విధంగా అవుతుంది. పెళ్ళికింకా తొందరేమీలేదు లెండి. సంబంధమే చూడలేదింకా. డబ్బు చేత పెట్టుకుని సంబంధం చూద్దామనుకున్నాను. మీరిచ్చిన గిత్తమూలానే పెళ్ళి జరుగుతుందని నా నమ్మకం," అన్నాడు సుబ్బడు.

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుండగా రామయ్య అనే అతను అటుగా వచ్చి, "ఏమిటి సంగతి?" అని అడిగాడు. పాపన్న అంతా చెప్పాడు. రామయ్య గిత్తను చూసి, "నూరు రూపాయలు చెయ్యగల గిత్తే. మరొక రెందుకు? దీన్ని నేనే కొంటాను. ఇదుగో, ప్రస్తుతం నా దగ్గిర ఉన్న ఈ పది





రూపాయలూ బయానా కింద ఉంచు. మిగతాది రేపు తెచ్చిఇచ్చి గిత్తను తోలుకుపోతాను," అంటూ సుబ్బడి చేతిలో పది రూపాయలు పెట్టాడు.

సుబ్బడి గిత్తకు బేరం కుదిరిందని సోమయ్యకు తెలియవచ్చింది. మర్నాడు అతను నూరు రూపాయలూ తీసుకుని సుబ్బడి యింటికి వచ్చి, "ఇదుగో, నిన్న మనం అనుకున్న మాట ప్రకారం నూరు రూపాయలూ తీసుకువచ్చాను. గిత్తను ఇచ్చెయ్యి," అన్నాడు.

సుబ్బడు అతనితో, "తమకు ధర నచ్చలేదని నిన్న పాపన్నగారు నాతో అన్నారు. అందుచేత గిత్తను రామయ్యగారికి అమ్మటానికి ఒప్పుకుని పదిరూపాయలు బయానా కూడా పుచ్చుకున్నాను," అన్నాడు.

"అదేంమాట? ఒక చెంప బేరం నలుగుతూండగానే గిత్తను నువు రామయ్యకెలా అమ్మావు? అది పరువైన పనేనా? నువు ధర చెప్పగానే సరేనని నీ దోసిట్లో డబ్బు పోస్తే బేరానికి ఒప్పుకున్నట్టూ, లేకపోతే నేను బేరం మానుకున్నట్టూనా? నాకు నీ గిత్త అక్కర్లేదని నీతో చెప్పానా?" అని సోమయ్య చిందులు తొక్కాడు.

"నాకు మాత్రం ఏం తెలుసు, బాబూ? మీరూ పాపన్నగారూ అవతలికి వెళ్ళి ఏదో





మాట్లాడుతున్నారు. మీరటునుంచి అటే వెళ్ళి పోయారు. పాపన్నగారు తిరిగి వచ్చి, మీకు ధర నచ్చలేదని చెప్పారు. మీకు ధర నచ్చుతుందనీ, కొంటానని మళ్ళీ వస్తారనీ నేను కలగంటానా? మీరే చెప్పండి?" అన్నాడు సుబ్బడు.

"ఏదీ, ఆ పాపన్న?" అని సోమయ్య అంటుండగానే రామయ్య పాపన్నను వెంట బెట్టుకుని రానే వచ్చాడు.

"నేను గిత్త బేరం వదులుకున్నట్టు సుబ్బడితో చెప్పావుట? అదుగో, సొమ్ము తెచ్చాను. గిత్తను నాకు ఇప్పించు," అన్నాడు సోమయ్య పాపన్నతో.

"నన్ను తిట్టి వెళ్ళి పోయావు. ఆలోచిస్తున్నట్టు మాట మాత్రం చెప్పలేదు. బేరం నలుగుతున్నదని నేనెలా అనుకోను? కొనే వాడి లాగా ప్రవర్తించినవాడు రామయ్య; గిత్తను చూశాడు, ధర తెలుసుకున్నాడు. దగ్గిర ఉన్నది బయానా ఇచ్చాడు. అటు వంటి వాడి కోసం పది రోజు లాగమన్నా అర్థం ఉంది. నీ బేరమంటిది నేనెక్కడా చూడలేదు. ధర జాస్తి అన్నవాడివి మరొక మాట చెప్పకపోతివి. ఆ ధరకే తీసుకోవటానికి అవాళ సిద్ధమైన వాడివి, మళ్ళీ వస్తానని నిన్న మాట మాత్రం అనకపోతివి," అన్నాడు పాపన్న.

"సరే, అది నా తప్పే. బేరం ఇంకా పూర్తికాలేదుగా. ఇంకో పది రూపాయలు జాస్తి ఇస్తాను. గిత్తను నాకే ఖరారు చేయించు," అన్నాడు సోమయ్య పాపన్నతో.

రామయ్య మండిపడ్డాడు. అతను పాపన్నతో, "పాపన్నా, ఇదా నువ్వాడే నాటకం? మా ఇద్దరికీ మధ్య పోటపెట్టి ఇద్దరినీ క్షవరం చేస్తావా?" అన్నాడు.

"ఇదా సంగతి?" అన్నాడు సోమయ్య.

"బాబూ, నా గిత్తను మీలో ఎవరికీ అమ్మను. రామయ్య బాబుగారూ? నిష్కారణంగా పాపన్నగారి మీద నింద ఎందుకు

వేస్తారు? మీరిచ్చిన పది రూపాయలూ మీరు పుచ్చుకుని, మీదారిన మీరు వెళ్ళండి," అంటూ ఇంట్లో నుంచి పది రూపాయలూ తెచ్చి రామయ్య కిచ్చేశాడు.

సోమయ్యా, రామయ్యా పాపన్నను కొర కొరా చూసి వెళ్ళి పోయారు.

అంతలోనే మల్లి అడావుడిగా వచ్చి, "నాన్నా, నాన్నా! ఎవరో అబ్బాయి పరిగెత్తుకుంటూ వచ్చి మన గొడ్ల పాకలో దూరాడు. ఎవరైనా వచ్చి అడిగితే చెప్ప వద్దని బతిమాలాడు," అన్నది.

మరుక్షణమే ఒక మనిషి వచ్చి, పాపన్నను చూసి, "ఏమండీ, ఇటుగా మావాడుగాని వచ్చాడా? మీరేమన్నా చూశారా?" అని అడిగాడు.

"వాడేం చేశాడు? ఎందుకు పారి పోయాడు?" అన్నాడు పాపన్న.

"నా కొడుకండీ. వట్టిచవట. ఇంటినుంచి ఎవరికీ తెలియకుండా డబ్బు తీసుకుని బయలుదేరాడు. వాణ్ణి తరుముకుంటూ వస్తున్నాను," అన్నాడా మనిషి.

ఇంతలోనే సుబ్బుడు గొడ్లపాకలోకి పోయి, ఒక కుర్రాణ్ణి చెయ్యిపట్టుకుని తీసుకొచ్చాడు.

వాడి పేరు మారన్న. వాడి తండ్రి కూలి చేసుకుని బతికే మనిషి. మారన్న ఏ పనీ



చెయ్యక జులాయిగా తిరుగుతాడు. దమ్మిడీ సంపాదించలేని వెధవకు పెళ్ళిమీద మనసు పోయింది. పెళ్ళి చేసినా, తన పొట్టే పోసుకోలేని వాడు పెళ్ళాన్ని కూడా ఎలా పోషిస్తాడు? అందుకని తండ్రి వాణ్ణి నానా తిట్లూ తిట్టి, అవమానించాడు. వాడికి అభిమానం వచ్చి, "నేనూ సంపాదించగలను డబ్బు. ఈ నాటినుంచీ నన్ను నువ్వేమీ పోషించనవసరం లేదు," అని తండ్రి దగ్గిర బీరాలు పలికి, ఇంట్లో దాచి ఉంచుకున్న కొద్ది డబ్బూ దొంగిలించి, ఇంటి నుంచి పారిపోయి వచ్చాడు.

పాపన్న మారన్నను పరీక్షగా చూశాడు. కుర్రాడు బాగానే వున్నాడు. పౌరుషం గలవాడే. వరువుగా బతికే అవకాశం దొరికితే బాగుపడవచ్చు.

పాపన్న సుబ్బణ్ణి అవతలికి తీసుకుపోయి, "వీడికి నీ కూతుర్ని ఇచ్చి చేస్తే ఎలా ఉంటుందంటావు?" అన్నాడు.

"వాడు పెళ్ళాన్ని ఎలా పోషిస్తాడండీ?" అన్నాడు సుబ్బడు.

"దానికో ఉపాయం చేద్దాం. పెళ్ళి కానుకగా నే నొక ఒంటెద్దు బండి చేయించి ఇస్తాను. గిత్త ఉండనే ఉన్నది. బండి తోలుకుని వాడు నాలుగు డబ్బులు స్వతంత్రంగా సంపాదించుకుంటాడు. అదే వాడికి నువ్విచ్చే వరదక్షిణ అనుకో. పెళ్ళికి పైఖర్చు కింద వదో, వరకో కావాలంటే నేనే సర్దుతాను," అన్నాడు పాపన్న.

సుబ్బడికి ఈ ఆలోచన చాలా బాగున్నట్టు తోచింది. మారన్న తండ్రికి కూడా, తన కొడుకు ఒక్డెక్కటాని కింతకన్న మంచి మార్గం ఉండ దనిపించింది. మారన్నకూ, మల్లికి పెళ్ళి జరిగింది. పాపన్న వధువుకు బండి చదివించాడు. మారన్న బండి తోలటం నేర్చుకున్నాడు.

తాను పెంచి పెద్దచేసిన గిత్త తన వెంటే ఉన్నందుకు మల్లి మహాసంతోషించింది.





# పుత్రుడి కర్తవ్యం

ఒకసారి పాపన్న తన యింటికి సున్నం కొట్టించటానికి పాత సామానులన్నీ సర్దుతూండగా, ఒక పెట్టె అడుగున ఒక కాగితం మడత కనబడింది. దాన్ని విప్పి చూస్తే, అలా రాసి ఉన్నది: "గుఱ్ఱంపల్లి వెంకటసుబ్బయ్యకు నేను ఇవ్వవలసిన నా ప్రాణం వెల నూరురూపాయలూ, నా చికిత్సకుగాను మందు మాకుల కింద ఇవ్వవలసినది పదిహేను రూపాయలూ, వెరశి నూట పదిహేను రూపాయలు."

ఆ కాగితంలోని దస్తూరి పాపన్న తండ్రి అయిన సోమయ్యది. తన తండ్రి ఎవరో వెంకటసుబ్బయ్య అనే గుఱ్ఱంపల్లి కాపురస్థుడికి నూట పదిహేను రూపాయలు బాకీ పడ్డాడన్నంతవరకే పాపన్నకు అర్థమయింది గాని, ఆ బాకీ తాలూకు వివరాలు ఏమీ అర్థం కాలేదు. అందుచేత అతను ఆ కాగితంలో రాసి ఉన్నమాటలు తన తల్లికి వినిపించి, "ఈ వెంకటసుబ్బయ్య ఎవరో, ఈ బాకీ ఏ బాపతో నీకేమైనా తెలుసునా, అమ్మా?" అని అడిగాడు.

తల్లి కాస్సేపు ఆలోచించి, "ఆఁ! కొంచెం కొంచెం జ్ఞాపకం వస్తున్నదిరా. అయితే ఆ బాకీ తీరనే లేదన్నమాట! నాకేం తెలుస్తుంది? నాతో ఏమీ చెప్పేవారూ చేసేవారూ కారాయె. ఎప్పుడో ముప్ఫై ఏళ్ళ క్రితం, నువు మూడేళ్ళ వాడవుగా ఉన్నప్పటి సంగతి," అంటూ ఈ దిగువ సంఘటన గురించి చెప్పింది.

పాపన్న తండ్రి సోమయ్య చాలా బీదగా జీవితం గడిపాడు. కొద్దిపాటి పొలం ఉండేది. అందుచేత ఎక్కడన్నా భోజనమూ, దక్షిణ డబ్బులూ దొరుకుతాయంటే, సోమయ్య ఎంతదూరమైనా వెళ్ళేవాడు.

ఆలాగే ఒకసారి సోమయ్య, రాజధానిలో ఒక రాజోద్యోగి ఇంట పెళ్ళి అయితే







వెళ్ళారు. అక్కడ భోజనం చేసి, దక్షిణ పుచ్చుకుని తిరిగి వచ్చేటప్పు డాయనకు వెంకటసుబ్బయ్య అనే ఆయన తోడుదొరి కాడు. ఆ వెంకటసుబ్బయ్యది గుర్రంపల్లి అనే గ్రామం. ఆయన కూడా పెళ్ళికి వచ్చినవాడే. ఇద్దరిదీ ఒకేదారి గనక, కబుర్లు చెప్పుకుంటూ, ప్రయాణం చేశారు.

వాళ్ళు గుర్రంపల్లిని చేర వస్తుండగానే బాగా చీకటి పడింది. ఆ సమయంలో ఏ చెట్టు చాటునుంచో ఒక దొంగ వాళ్ళ ముందుకు వచ్చి, చేతికర్రతో ఇద్దరి కాళ్ళ మీదా బలంగా కొట్టాడు. అయితే దెబ్బ సోమయ్యకే బలంగా తగిలింది. ఆయన పడి పోయాడు. తరవాత దొంగ ఆ ఇద్దరినీ చెరొక చెట్టుకూ కట్టి, ఇద్దరి దగ్గిర ఉన్న డబ్బూ లాగేసుకుని, "మీలో ఎవడు వెళ్ళి వందరూపాయలు తెచ్చి ఇచ్చినా రెండోవాణ్ణి కూడా విడిచి పెడతాను. చెప్పండి. ఎవడు వెళ్ళి డబ్బు తెస్తాడు? డబ్బు తేబోయిన వాడు తెల్లారేలోగా డబ్బు తేకపోయినా, వెంట ఎవరినన్నా తోడు తెచ్చినా, ఇక్కడ ఉండేవాణ్ణి పొడిచి చంపేస్తాను," అన్నాడు.

ఇద్దరు మనుషులు కలిసి దొరికారు గనక దొంగ ఈ ఎత్తు వేశాడు. అదే ఒంటరి ప్రయాణికుడై ఉంటే దగ్గిర ఉన్నది కాజేసి, దొంగ తృప్తిపడేవాడే. కాని ఇద్దరుగా దొరికారు గనక వాడి ఎత్తు పారింది. ఎవరో ఒకరు వెళ్ళి, నూరురూపాయలూ తెచ్చి, ఆ దొంగ మొహాన కొట్టి రెండోవాణ్ణి విడిపించాలి. సోమయ్య ఉండే గ్రామం చాలా దూరం. అక్కడికి వెళ్ళటానికే ఒక రోజు పట్టుతుంది. తెల్లవారేలోపుగా తిరిగి రావటం అసంభవం. ఒకవేళ తిరిగి వచ్చినా సోమయ్య ఇంట చిల్లి గవ్వలేదు; నూరు రూపాయలు ఎలా తెస్తాడు?

"మా గ్రామం దగ్గిరలోనే ఉన్నది. నన్ను వదిలిపెట్టు. నేను డబ్బు పట్టుకొస్తాను," అన్నాడు వెంకటసుబ్బయ్య దొంగతో.







దొంగ వెంకటసుబ్బయ్య కట్లు విప్పి, వెళ్ళి పోనిచ్చాడు. అలా దొంగవారి నుంచి తప్పించుకుని బయటపడిన వెంకట సుబ్బయ్య తనను విడిపించటానికి నూరు రూపాయలతో తిరిగి వస్తాడని సోమయ్య కలలో కూడా అనుకోలేదు. అతనన్నా తప్పించుకు పోయాడు గదా అని సంతో షిస్తూ, తెల్లవారే లోపల తన చావు ఖాయం చేసుకున్నాడు సోమయ్య. ఆయనకు దైవ ధ్యానం చేస్తూ చావుకోసం ఎదురు చూడటం తప్ప ఇంకేమీ మిగలలేదు.

కాని తెల్లవారక ముందే వెంకటసుబ్బయ్య తిరిగి వచ్చాడు; "ఇదుగోనయ్యా, నూరు రూపాయలు! ఆయనను వదిలిపెట్టి డబ్బు తీసుకో!" అన్నాడు. దొంగవాడు డబ్బు తీసుకుని ఎటో మాయమయాడు.

దారిలో కలిసిన స్నేహాన్ని పాటించి, నూరురూపాయలూ తెచ్చి దొంగకు సమ ర్పించి, తన ప్రాణం కాపాడిన ఆ వెంకట సుబ్బయ్యకు తన కృతజ్ఞత ఎలా తెలపాలో సోమయ్యకు తెలియలేదు. అంతటితో ఆగక, వెంకటసుబ్బయ్య సోమయ్య బరు వంతా తన మీద వేసుకుని, నడిపించు కుంటూ తన ఇంటికి తీసుకుపోయి, నాలుగు రోజులపాటు తన ఇంటనే ఉంచుకుని, ఆయనకు చికిత్స చేయించి, దెబ్బతిన్న కాళ్ళు నయం చేయించాడు.

చిత్రమేమిటంటే, వెంకటసుబ్బయ్యది పేదసంసారమే. అతను నూరురూపాయలూ ఆ రాత్రికి రాత్రి ఎలా పుట్టించాడో సోమయ్యకు అర్థం కాలేదు. ఆ నూరు రూపాయలూ, తన చికిత్సకయిన ఖర్చు పదిహేను రూపాయలూ వెంకటసుబ్బ య్యకు ఎలా తిరిగి ఇవ్వాలో కూడా సోమయ్య ఊహించలేక పోయాడు. ఆయన తన గ్రామానికి బయలుదేరుతూ, సాధ్య మైనంత త్వరలో నూటపదిహేను రూపా యల బాకీ తీర్చేస్తానని మాట ఇచ్చి,







వెంకటసుబ్బయ్య దగ్గిర సెలవు తీసుకున్నాడు. సోమయ్య ఇంటికి వచ్చి జరిగినదంతా తన భార్యకు చెప్పాడు. తాను వెంకటసుబ్బయ్య ఇంట తన చెంబు మరచి వచ్చిన సంగతి భార్య అడిగిన దాకా సోమయ్యకు గుర్తు రాలేదు.

ఈ సంఘటన జరిగిన తరవాత సోమయ్య రెండేళ్ళు మాత్రమే జీవించాడు. ఆ వెంకటసుబ్బయ్య బాకీ తీరిందో లేదో పాపన్న తల్లి ఎరగదు. సోమయ్య ఇంటి పట్టున ఉండిన మనిషి కాదు. అస్తమానమూ ఎటో వెళ్ళేవాడు. ఇల్లు దాటి వెళితే నాలుగైదు రోజుల దాకా తిరిగి ఇంటి ముఖం చూసేవాడు కాదు. అదీగాక, ఆ రోజుల్లో మగవాళ్ళు డబ్బు గురించిన విషయాలు ఆడవాళ్ళతో చర్చించేవాళ్ళు కారు. ఆఖరి సారి జబ్బుపడినప్పుడు కూడా సోమయ్యకు నోరు పడిపోయింది. అందుచేత భార్యతో ఆయన ఏమీ చెప్పే అవకాశం లేక పోయింది.

ఈ సంగతులన్నీ విని పాపన్న చాలా బాధపడ్డాడు. తన తండ్రి ఋణం ఇంత కాలంగా తీరకుండా ఉన్నదా? తండ్రి ఋణాలు తీర్చటం పుత్రుడి కర్తవ్యం. తన తండ్రి ఋణం తాను తీరిస్తేనే గాని ఆయనకు ఆత్మశాంతి ఉండదు.

పాపన్న లెక్కకట్టాడు. తన తండ్రి ఇవ్వవలసిన బాకీ వడ్డీతో సహా అయిదు వందలు దాటుతుంది. అందుచేత పాపన్న వెంటనే కొంత పొలం అమ్మి, డబ్బు చేత పట్టుకుని, దారి వెతుక్కుంటూ గుర్రంపల్లి చేరుకున్నాడు. అది పెద్దగ్రామమే. అక్కడ పాపన్న వెంకటసుబ్బయ్య గురించి అడిగితే, ఒక మనిషి, "వెంకటసుబ్బయ్యగారంటే గ్రామాధికారిగా ఉండినాయన కాదుటండీ? ఆయన ఇప్పుడున్నట్టు లేదే!" అన్నాడు.

పాపన్న గ్రామాధికారి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళాడు. ప్రస్తుతం శీనయ్య అనేవాడు గ్రామాధికారిగా ఉంటున్నాడు.








అతను పాపన్న పేరు ఆదివరకే విని ఉండటం చేత, మర్యాద చేసి, పాపన్న వచ్చిన పని అడిగాడు.

పాపన్న తన తండ్రి రుణం గురించీ, వెంకటసుబ్బయ్య గురించి చెప్పి, "మా తండ్రిగారు మీ తండ్రిగారికి 115 రూపాయలు బాకీ ఉన్నట్టు నాకింత కాలమూ తెలియనే తెలియదు. గడిచిన ముప్పైఏళ్ళ చిల్లరకూ వడ్డీకట్టి పైకం తెచ్చాను. పుచ్చుకోండి," అన్నాడు.

శీనయ్య డబ్బు తీసుకోవటానికి వెనకాడుతూ, "వద్దు లెండి. మీ నాన్నగారికి మా నాన్నగారిచ్చినది అప్పుగా భావించవవసరం లేదు. మీ తండ్రిగారి ప్రాణాన్ని కాపాడటమే ఒక గొప్ప సంగతి. కాని మీ పుత్రధర్మం మటుకు ఎంతో మెచ్చుకోతగ్గది," అన్నాడు.

"మీ తండ్రిగారు ఏమనుకుని సహాయపడ్డారో తెలియదుగాని, మా తండ్రిగారు మాత్రం దాన్ని రుణంగానే భావించారు. ఆ సంగతి తెలిసేకద నేని డబ్బు తెచ్చాను," అన్నాడు పాపన్న.

శీనయ్య, బలవంతంమీద పాపన్న యిచ్చిన డబ్బు తీసుకుంటూ, "సరే, మీరంతగా కాదు, కూడదంటున్నారు గనక ఈ డబ్బు తీసుకుని ఏ ధర్మకార్యానికైనా వినియోగిస్తాను," అని, డబ్బుకు రశీదు ఇచ్చేశాడు.

పాపన్న శీనయ్య వద్ద శలవు పుచ్చుకుంటూ, "అన్నట్టు, మా తండ్రిగారు మీ ఇంట ఒక చెంబు వదిలి పెట్టారట. అది ఉన్నదేమో చెప్పగలరా?" అన్నాడు.

శీనయ్య ఆశ్చర్యపోయి, "చెంబా! పాత సామానులో చూసి చెబుతాను, ఉండండి," అని లోపలికి పోయి, బాగా కిలుమెక్కి ఉన్న చిన్న రాగిచెంబొకటి తెచ్చి, "ఇదే నండీ మీ తండ్రిగారి చెంబూ," అంటూ పాపన్న కిచ్చాడు.







పాపన్న దాన్ని భక్తితో స్వీకరించి తన ఊరికి తిరుగు ప్రయాణమయాడు. అతను ఊరుదాటి అడవి మార్గాన కొంతదూరం నడిచేసరికి ఒక చెట్టుకింద ముసలిసన్యాసి కూర్చుని కనిపించాడు. ఈ సన్యాసిని పాపన్న వచ్చేటప్పుడు కూడా చూశాడు. అయితే, ఇప్పుడా సన్యాసి ముందు ఇద్దరు పిల్లలూ, ఒక ఈడు వచ్చినవాడూ చింకి పాతలు కట్టుకుని నిలబడి ఉన్నారు. పెద్ద వాడు ఏడుపు గొంతుతో, "ఒక్కసారి ఇంటికి వచ్చి అమ్మను చూడు, నాన్నా," అని బతిమాలు తున్నారు. వాడి వెంట ఉన్న చిన్న పిల్లలు, "ఇంటికిరా, తాతా," అని ఏడుస్తున్నారు. సన్యాసి వాళ్ళ మొర వినిపించుకున్నట్టు కనబడలేదు.

పాపన్న అక్కడ ఆగి, వాళ్ళను ప్రశ్నించి, వాళ్ళ గొడవంతా తెలుసుకున్నాడు. ఇంతకూ ఈ ముసలిసన్యాసే తన తండ్రిని ఆనాడు కాపాడిన వెంకటసుబ్బయ్య! ముప్పైఏళ్ళ క్రితం కుగ్రామంగా ఉండిన గుర్రంపల్లికి ఈయనే గ్రామాధికారీ, కరణమూ, అన్నీనూ. వాళ్ళది నిజంగా బీదకుటుంబమే. దివాణానికి కట్టవలసిన శిస్తు పైకం వంద రూపాయలు ఇంట్లో ఉంటే అది తీసుకుపోయి దొంగకిచ్చి, సోమయ్య ప్రాణం దక్కించాడు. కాని ఆ డబ్బు మళ్ళీ పూడ్చటం ఆయనతరం కాలేదు. సోమయ్య అయినా ఆ డబ్బు పుట్టించి ఆయనకు ఇవ్వలేక పోయాడు.

శిస్తు కట్టవలసిన రోజు దగ్గిర పడుతున్న కొద్దీ వెంకటసుబ్బయ్య ఊళ్ళో అందరినీ అప్పు అడగసాగాడు. శీనయ్య తండ్రికి వెంకటసుబ్బయ్య అంటే పడదు. వెంకటసుబ్బయ్య పరిస్థితి ఊహించి, ఆ దుర్మార్గుడు, వెంకటసుబ్బయ్య శిస్తుసొమ్ము అపహరించాడని దివాణానికి కబురు చేశాడు. అధికార్లు వచ్చి వెంకటసుబ్బయ్యను విచారణ జరిపారు. దివాణానికి కట్టవలసిన



సొమ్ము దొంగ కిచ్చానని చెప్పటం వెంకట సుబ్బయ్యకు సాధ్యం కాలేదు. అధికార్లు అతన్ని ఉద్యోగం నుంచి తొలగించి, అతని ఆస్తి జప్తు చేసి, అతన్ని గ్రామం నుంచి బహిష్కరించారు. శీనయ్య తండ్రి గ్రామాధికారి అయాడు.

జరిగిన దానికి వెంకటసుబ్బయ్య వైరాగ్యం చెంది, అడవిలో ఆశ్రమం వేసుకుని, సన్యాసిజీవితం గడపసాగాడు.

ఇప్పుడు వెంకటసుబ్బయ్య భార్య మంచంపట్టి, ఇవాళో రేపో అన్న స్థితిలో ఉండి, భర్తను ఒకసారి చూడాలని తపించి పోతున్నది. అందుకే కొడుకూ, మనమలూ వచ్చి, వెంకటసుబ్బయ్యను ఇంటికి రమ్మని ప్రాధేయపడుతున్నారు.

అంతా విని పాపన్న నిర్ఘాంతపోయాడు.

"మా నాన్న మీ ఇంట చెంబు ఒకటి వదిలిపెట్టాడా?" అని అతను వాళ్ళను అడిగాడు.

"అవునండీ, చెంబు మా ఇంట ఉన్నది. మా కష్టాలన్నిటికీ మూలకారకుడైన ఆ పెద్ద మనిషి చెంబును మరవవచ్చునా? ఆ చెంబే తీసుకుని వారింటికే ఇవ్వానికి వెళ్ళమని మా అమ్మ ఎన్ని సార్లో అన్నది. కాళ్ళూ చేతులూ పడిపోయాక అలాగే వెళతానని ఆవిడకు సమాధానం చెప్పాను," అన్నాడు వెంకటసుబ్బయ్య కొడుకు.

పాపన్న తన సంగతంతా వాళ్ళకు చెప్పాడు. అతను సన్యాసితో, "అయ్యా, మీరు సన్యాసిగానే ఉండి పోతారో, తిరిగి గృహస్థు అవుతారో అది మీ ఇష్టం. కాని నేనుమటుకు మీ అబ్బాయిని తిరిగి గ్రామాధికారి చేస్తే తప్ప నా తండ్రి ఆత్మకు శాంతి ఉండదు," అన్నాడు.

అతను వెంకటసుబ్బయ్య కొడుకునూ, మనమలనూ వెంట బెట్టుకుని, వారుంటున్న గుడిసెకు వెళ్ళాడు. వెంకటసుబ్బయ్య భార్య పాపన్న చెప్పినదంతా విని చాలా

ఉత్సాహం తెచ్చుకుని, తన జబ్బు సగం నయమైనట్టే తలపోసింది. అక్కడ పాపన్న తన తండ్రి చెంబు తీసుకుని వెంకట సుబ్బయ్య కొడుకును వెంట పెట్టుకుని శీనయ్య ఇంటికి వెళ్ళాడు.

శీనయ్య పదిమందితో కూర్చుని ఏవో వ్యవహారాలు మాట్లాడుతున్నాడు. పాపన్న అతన్ని చూసి, "శీనయ్యగారూ, నేను పొరపాటు పడితే మీరు నన్ను సరిదిద్దలేదు. వెంకటసుబ్బయ్యగారు మీ తండ్రిగారు కాదు. మా తండ్రి ఋణపడింది మీ తండ్రిగారికి కాదు. మీరిచ్చిన చెంబు మా తండ్రిది కాదు. ఇదుగో మా తండ్రిగారి చెంబు. దీనిమీద 'సోమయ్య' అని మా తండ్రిగారి పేరు కూడా ఉన్నది. ఈ అబ్బాయి వెంకటసుబ్బయ్యగారి అబ్బాయి. నేను మీ కిచ్చిన డబ్బు ఈ అబ్బాయికి చేరాలి. అందుచేత ఆ డబ్బు నాకు తిరిగి ఇచ్చెయ్యండి. ఇదుగో మీరిచ్చిన రశీదు," అన్నాడు.

శీనయ్య వెలాతెలా పోయాడు. "ఏమిటి? ఏమిటి?" అని అందరూ అడిగారు. శీనయ్య ఏమని చెబుతాడు? మారు మాటాడకుండా పాపన్న డబ్బు పాపన్న కిచ్చేశాడు.

పాపన్న ఆ డబ్బు తెచ్చి వెంకటసుబ్బయ్య భార్యదగ్గిరపెట్టి, "ఇది మీడబ్బే. జబ్బుకు మంచి వైద్యం చేయించుకోండి. అవసరమైన ఖర్చులన్నీ ధారాళంగా చేసుకోండి. నేను మళ్ళీ వస్తాను," అని చెప్పి, బయలుదేరి దివాణానికి వెళ్ళాడు.

వెంకటసుబ్బయ్య సంగతంతా పాపన్న చెప్పిన మీదట అధికార్లు పాతరికార్డులన్నీ తిరగదోడి, ముప్ఫైఏళ్ళ తరవాత మళ్ళీ వెంకటసుబ్బయ్య కుటుంబానికి గ్రామాధికారం ఇప్పించారు. వెంకటసుబ్బయ్య కొడుకు గ్రామాధికారి కాబోతున్నాడని ముందుగానే పసి కట్టి శీనయ్య తన పదవికి రాజీనామా పెట్టేసి, విచారణనుంచి తప్పించుకున్నాడు.





# ఆవు దొంగతనం

ఒకసారి పాపన్న ఒక దూర గ్రామానికి బయలుదేరాడు. ఆ గ్రామానికి కరణంగా ఉండే శేషయ్యగారింట మర్నాడు ఏదో అక్కర. దానికి రావలిసిందిగా కరణం శేషయ్య, రెండురోజుల క్రితమే పాపన్నకు కబురు చేశాడు. అందుచేత కాస్త పొద్దు వాలగానే పాపన్న తన ఇంటి నుంచి బయలుదేరాడు.

కరణం శేషయ్యగారి ఊరు ఇంకా కొంత దూరం ఉన్నదనగా పాపన్నకు ఒక దృశ్యం కనబడింది.

ఒక నల్లఆవు దూకుతూ పరిగెత్తుకుని పాపన్న కేసి వస్తున్నది. దాని పలుపు పట్టుకుని ఒక మనిషి వస్తున్నాడు. ఆవును ఆపటానికి వాడు చేసే ప్రయత్నం ఏమీ పనికిరావటం లేదు. ఆవు వాణ్ణి ఈడ్చుకుంటూ వస్తున్నది. ముళ్ళూ, రాళ్ళూ తగిలి వాడు బాగా గాయపడినట్టు కనిపిస్తున్నాడు. అయినా వాడు మొండికెత్తి పలుపుతాడు మాత్రం వదలలేదు.

వాడు పాపన్నను చూసి, "బాబూ, ఆవును కాస్త మళ్ళెయ్యండి," అన్నాడు.

పాపన్న ఆవు కెదురు వెళ్ళి, చేతులెత్తి ఆడిస్తూ, "హే! హే!" అన్నాడు. అంత ఉద్రేకంలోనూ ఉన్న ఆవు పాపన్న గొంతు విని నిలిచిపోయింది. అది అకస్మాత్తుగా ఆగటంలో దాని మెడ తాడు పట్టుకున్న మనిషి నేల పైన పడిపోయాడు.

పాపన్న ఆ తాడును తీసుకుని సమీపంలో ఉండే చెట్టుకు చుట్టి, ఆ మనిషిని లేపి కూర్చోబెట్టి, "బాగా దెబ్బలు తగిలాయే! ఏం చేశావు? ఆవు ఎందుకిలా పరిగెత్తింది?" అని అడిగాడు.

"ఎందుకు పరిగెత్తిందంటే ఏం చెప్పను? కొవ్వెక్కి పరిగెత్తింది. మొన్ననే బోలెడంత డబ్బు పోసి కొన్నాను. కొన్నప్పటి నుంచీ

మొండితనం చేస్తూ మొరాయిస్తూనే ఉంది. ఇవాళ కొత్త మేపుదామని ఇలా బయటికి తెచ్చాను. దయ్యం పట్టినట్టు పరుగు లంకించుకుంది," అన్నాడు ఆ మనిషి.

ఆ మనిషి లేచి, "నా కర్ర కూడా ఎక్కడో పడి పోయింది. ఇవాళ దీని ప్రాణాలు తీసి తీర్తాను. ఇంత పొగరా?" అంటూ చెట్టు కొమ్మ విరిచి ఆవును కొట్ట బోయాడు. ఆవు కళ్ళు పెద్దవిచేసి, బుస కొట్టుతూ ఆ మనిషిని కొమ్ములతో కుమ్మ బోయింది.

పాపన్న దాని ముఖం నిమిరాడు. ఆవు ఉద్రేకం దిగిపోయింది.

"ఆ కర్ర అవతల పారెయ్యి. ఇటువంటి పనులు చేసి దానికి ఆగ్రహం తెప్పించి ఉంటావు. అది పొట్లగొడ్డయితే నన్ను పొడవదేం? పశువుల్ని ఎంత ప్రేమగా చూసుకోవాలి!" అన్నాడు పాపన్న.

"అదంతా నాకు తెలుసు. కాని ఇప్పుడేం చేసేట్టు? నన్ను నేల మీద ఈడ్చి హైరానం చేసేసింది. ఆ కొండమలుపు అవతల ఉంది మా గ్రామం. నేనే నడవలేనే, ఇది మంచిగా నా వెంట వచ్చేటట్టు చెయ్యగలనా? ఎవరు సహాయం వస్తారబ్బా?" అంటూ ఆ మనిషి దిక్కులు చూశాడు.



"సహాయం కావాలంటే నేను వస్తాను పద," అంటూ ఆవుతాడు చేతబట్టుకుని ఆ మనిషి వెంట, అతడి గ్రామానికి బయలుదేరాడు పాపన్న.

దారిలో ఆ మనిషి, "మీ రెవరు? మీ దేవూరు?" అని అడిగాడు.

పాపన్న తన ఊరూ, పేరూ చెప్పి, "రేపు కరణం శేషయ్యగారింట అక్కర. దాని కోసం బయలుదేరి వస్తున్నా," అన్నాడు. పాపన్న ఆ మనిషి ఇంటి దాకా పోయి, దొడ్లో ఆవును కట్టేసి, దానికి మేతా, నీరూ పెట్టించి, చీకటిపడే వేళకు కరణం శేషయ్యగారిల్లు చేరాడు.







కరణం శేషయ్య పాపన్నను కుశల ప్రశ్నలు వేశాక, "చూడు, పాపన్నా, నేను రెండేళ్ళ క్రితం నీ దగ్గిర కొన్న ఆవుకు ఇవాళ ఆకస్మాత్తుగా ఏదో రోగం పుట్టుకొచ్చిందని మా కమతగా డన్నాడు. పొద్దున కూడా నిక్షేపం లాగుంది. ఈ పూట ఏం ముంచుకొచ్చిందో, నడవలేకుండా ఉన్న దట. నలుగురు మనుషులను పంపించాను. ఆవును మోసుకు రమ్మని," అన్నాడు.

ఈ మాట విని పాపన్న చాలా బాధ పడ్డాడు. ఇంతలోనే మనుషులు ఆవును తెచ్చి ఇంటి ముందు ఆవరణలో ఒక పక్కగా పడుకోబెట్టారు. పశువుల వైద్యుడి కోసం మనిషి వెళ్ళాడు. పశువుల వైద్యుడు వచ్చి, ఆవును చూసి, "ఇది రెండు మూడు రోజుల క్రితం ఈనినట్టు కనబడుతుంది. పెద్ద రోగమేమీ లేదు. వైద్యం చేస్తే నయమవుతుంది," అన్నాడు.

కరణం శేషయ్య ఆశ్చర్యపడి, "రెండు మూడు రోజుల క్రితం ఈనట మేమిటి? మా ఆవుకు రెండునెల్ల దూడ ఉంటేనూ!" అంటూ దగ్గిరికి వచ్చి ఆవును పరీక్షగా చూసి, ఆశ్చర్యపడుతూ, "ఇది మా ఆవు కాదు," అన్నాడు.

ఆ మాట నిజమే. దూడ కూడా దాని దగ్గిరికి పోలేదు.

అయితే కరణం శేషయ్యగారి నల్లావు ఏమయినట్టు?

పాపన్నకు వెంటనే సందేహం కలిగింది. తాను అడ్డగించి, అవి, ఆ మనిషి ఇంట కట్టివచ్చిన నల్లావు కరణం శేషయ్యగారిదై వుంటుందా? ఆ ఆవును రెండురోజుల క్రితమే కొన్నట్టు ఆ మనిషి చెప్పాడే!

ఎవరిని గురించి తొందరపడి చెడ్డగా ఆలోచించే స్వభావం పాపన్నకు లేదు. మరొకసారి ఆ మనిషి ఇంటికి వెళ్ళి, సరిగా ఆరా తీసి, నిజం తెలుసుకున్న దాకా అతను కరణం శేషయ్యతో ఏమీ అనదలచలేదు.





శేషయ్య మటుకు కమతగాణ్ణి పిలిచి, "అది మన ఆవు కాదురా! మన ఆవు మారి పోయింది. రేపు విచారించు. దాన్ని ఇంకెవరి ఇంటికి తోలావో పొరపాటున," అన్నారు.

కమతగాడి ప్రయత్నం ఏమీ అవసరం లేకుండానే, జాము పొద్దెక్కే సరికల్లా శేషయ్యగారి ఆవు దానంతట అదే పరిగెత్తుకుంటూ వచ్చి, తన దూడ దగ్గిర నిలబడి, దానికి పాలిచ్చింది. పాపన్నతో సహా అందరూ పరమానందం చెందారు.

"సంగతి తేలిపోయింది. ఎవడో దుర్మార్గుడు జబ్బుపడిన తన నల్లావును మన మందలోకి చల్లగా తోలి, మన ఆవును తోలుకుపోయి వుంటాడు. ఈ రోగిష్టి ఆవుకు చికిత్స కూడా దేనికి? చావనీ!" అన్నారు కరణం శేషయ్యగారు కసిగా.

"దొంగను శిక్షించాలి గాని, ఆవు నెందుకు చావనివ్వటం? చికిత్స చేయించండి. దొంగ దొరక్కపోతే మనకు మరొక ఆవు దక్కుతుంది గదా!" అన్నారు పాపన్న. కరణంగారు ఆ మాటతో కాస్త శాంతించారు.



పాపన్న అప్పుడే వస్తానని చెప్పి కొండ మలుపులో ఉన్న గ్రామానికి వెళ్ళి, ఆవు దొంగను చూశాడు. ఆ మనిషి మరి కొన్ని కొత్తగాయాలతో మంచాన పడి ఉన్నాడు. ఆ ఉదయమే కరణంగారి ఆవు కట్టుతాడు తెంచుకుని, అడ్డం వచ్చిన దొంగను డొక్కలో కుమ్మి మరీ వెళ్ళిపోయింది.

"అది ఆవు కాదండీ, నా పాలిటి మృత్యుదేవత!" అన్నాడు దొంగ, పళ్ళుకొరికి పెద్దగా మూలుగుతూ.

"మృత్యువును కోరి తెచ్చుకున్నావు? కరణం శేషయ్యగారి దగ్గిరేనా దాన్ని కొన్నావు?" అని పాపన్న అడిగారు.

"అయ్యబాబో, అది కరణం శేషయ్యగారి ఆవా?" అన్నాడు దొంగ, తన దొంగతనం బయట పెట్టుకుంటూ. కరణంగారు





చాలా నిక్కచ్చి మనిషి. తన ఆవును ఎవరైనా దొంగతనం చేసినట్టు తెలిస్తే బతకనివ్వడు. ఆ సంగతి దొంగకు తెలుసు.

అతను పాపన్నను బతిమాలుతూ, "బాబూ, నేనా ఆవును దొంగిలించినట్టు కరణంగారికి తెలియనివ్వకండి. చేసిన పనికి శిక్ష బాగానే అయింది," అంటూ తాను చేసిన పని పాపన్నకు చెప్పేశాడు.

దొంగకున్న నల్ల ఆవు ఈనింది. అది ఆహారమూ, నీరూ ముట్టక పడుకుని ఉండటం చూసి, అది బతకదని భయపడ్డాడు. పాలులేక దూడ కాస్తా చచ్చింది. కొండ ప్రాంతానికి పశువులమందలు మేతకోసం వస్తాయి. దొంగ తెల్లారకముందే లేచి, బలవంతాన తన ఆవును నడిపించుకుంటూ మేతస్థలానికి తీసుకుపోయి, పొదల చాటున పడుకోబెట్టాడు. జాము పొద్దెక్కేసరికి ఆవుల మందలు మేతకు వచ్చాయి. కమతగాళ్ళు ఎండవేళ ఏ చెట్టు నీడనో కునుకుతున్న సమయంలో, దొంగ తన ఆవులాంటి దాన్నే ఒకదాన్ని పిదుకుని, దాన్ని దువ్వి మాలిమి చేసుకుంటూ, మెడకు తాడు తగిలించి, తీసుకుపోసాగాడు.

తన ఇంటి కేసి పోవటం లేదని తెలియగానే ఆవు మొరాయించి తన ఇంటి దారిపట్టి పరిగెత్త సాగింది. ఆ సమయంలోనే పాపన్న ఎదురు వచ్చి, దొంగకు సహాయపడి, ఆవును దొంగ ఇంటికి చేర్చాడు.

పాపన్న దొంగకు మరొక రూపంలో కూడా సహాయం చెయ్య నిశ్చయించాడు. అతను కరణం శేషయ్య ఇంటికి వెళ్ళి, జరిగినదంతా చెప్పి, దొంగ చాలా శిక్ష అనుభవించాడనీ, అతన్ని మరి శిక్షించవద్దనీ అన్నాడు. పాపన్న మాట తీసెయ్యలేక కరణంగారు సరేనన్నాడు.

త్వరలోనే దొంగ ఆవుకు రోగం నయమయింది. దొంగ వచ్చి దాన్ని తన ఇంటికి తోలుకుపోయాడు.






# మితిమీరిన వంచన

ఒకనాడు సుబ్బయ్య అనేవాడు పాపన్న ఇంటికి తన భార్యనూ, అయిదుగురు పిల్లలనూ వెంటబెట్టుకుని వచ్చి, "అయ్యా, పాపన్నగారూ, మాకు మీరు తప్ప ఇంకెవరూ సహాయం చేసేవాళ్ళు లేరు. నేను ఈ గ్రామంలో పుట్టి పెరిగినవాణ్ణే. పట్టణానికి పోయి, పన్నెండేళ్ళుగా అక్కడే వ్యాపారం చేసి, నష్టపడి, అంతా పోగొట్టుకుని అప్పులపాలై, మళ్ళీ గ్రామానికి తిరిగి వచ్చేశాను. మీరు కాస్త సహాయపడినట్టయితే ఇక ఇక్కడే ఉండిపోతాను," అని ప్రాధేయపడ్డాడు.

"నా నుంచి ఏం సహాయం కావాలో చెప్పు. సాధ్యమైతే తప్పక చేస్తాను," అన్నాడు పాపన్న.

ఒకప్పుడు సుబ్బయ్యకు ఆ గ్రామంలో ఒక ఇల్లూ, కొంత పొలమూ ఉండేది. అతని ఇల్లు ఊరి బయట విసిరివేసినట్టుగా ఉండేది. అదిగాక చాలా పాత ఇల్లు. పన్నెండేళ్ళ క్రితం సుబ్బయ్య పట్టణానికి పోతూ తన పొలంతోబాటు ఆ ఇల్లు కూడా అమ్మాలని చూశాడు. కాని దాన్ని ఎవరూ కొనలేదు. ఇప్పుడా ఇల్లు పూర్తిగా కూలిపోయి, నేలమట్టమయింది. ఇంటి స్థలం దిబ్బ వేసిపోయింది. దాని నిండా జిల్లేడు మొక్కలూ, నాగుజెముళ్ళూ, ఇతర మొక్కలూ మొలిచాయి.

పొలం అమ్మిన డబ్బుతో సుబ్బయ్య పట్నం చేరి, కల్తీవ్యాపారాలూ, దగావ్యాపారాలూ సాగించి డబ్బు గడించాడు. అతను కొత్తిగా సోమరి కావటం చేత బస్తీజీవితం బాగా నచ్చింది. బస్తీ సుఖాలు బాగా మరిగాడు. పనికిమాలిన స్నేహితాలు చేసి, జిహ్వాచాపల్యం పెంచుకుని, పేకాటలు మరిగి, అన్యాయంగా సంపాదించిన డబ్బును ఎడాపెడా తగలెయ్యసాగాడు.

పరోపకారి పాపన్న కథ





వేడుకలకూ, వినోదాలకూ దుర్వ్యయం చెయ్యటంలో అతని భార్య అతని కేమీ తీసిపోయేది కాదు. చివరకు ఉన్నదంతా పోగొట్టుకుని, అప్పులపాలై, వ్యాపారం దివాలా ఎత్తి, సుబ్బయ్య తన గ్రామానికి సకుటుంబంగా తిరిగి వచ్చాడు.

పూర్వం తన ఇల్లుండిన స్థలం ఎవరి కన్నా రెండువందల రూపాయలకు అమ్మి, ఆ డబ్బుతో ఊరి మధ్య ఒక చిన్న పూరి కొంప వేసుకుని, వీలయితే రెండు ఆవులను కొనుక్కుని, పాలవ్యాపారం చేస్తూ కాలక్షేపం చెయ్యాలని సుబ్బయ్య ఉద్దేశం. కాని, ఊరి బయట దిబ్బవేసిన ఆ స్థలాన్ని రెండువందలు పోసి ఎవరు కొంటారు? కొని ఏం చేసుకుంటారు?

ఎవరో సుబ్బయ్యతో, "నీకు సహాయం చెయ్యగలవాడు ఈ ఊళ్ళో పాపన్న ఒక్కడే ఉన్నాడు. మిగిలినవాళ్ళు ఆ స్థలాన్ని ఊరికే ఇచ్చినా తీసుకోరు. అందుచేత పాపన్న దగ్గిరికి వెళ్ళి, నీ స్థలాన్ని రెండువందలకు కొనుక్కుని సహాయపడమని వేడుకుంటే పని జరగ వచ్చు," అని చెప్పి సలహా ఇచ్చారు. అందుకనే సుబ్బయ్య సకుటుంబంగా వచ్చి పాపన్న దర్శనం చేసుకుని, తన కష్టం చెప్పుకున్నాడు.

అయిదుగురు బిడ్డలతో నిరాధారంగా నిల బడి ఉన్న సుబ్బయ్యను చూస్తే పాపన్నకు జాలి పుట్టింది. అతని దగ్గిర సమయానికి రెండు వందలు లేవు. అయినా మినాక్షి నగలు తాకట్టు పెట్టి రెండువందలు భర్తీ చేసి, క్రయపత్రం రాయించి, సుబ్బయ్య స్థలం కొన్నాడు. సుబ్బయ్య ఇల్లు ఏర్పాటు చేసుకునేటందుకు రెండు మూడు రోజులు పట్టింది. అంతదాకా పాపన్నే సుబ్బయ్య కుటుంబాన్ని పోషించాడు కూడా.

ఇల్లు ఏర్పాటు చేసుకోగా సుబ్బయ్య చేతిలో కొంత డబ్బు మిగిలింది. దానితో





ఆవును కొనుక్కునే ప్రయత్నం చెయ్యటానికి మారుగా, సుఖం మరిగిన ప్రాణులు కావటం చేత, సుబ్బయ్యా, అతని భార్యా సుఖంగా పిండివంటలు చేసుకుతిని, పదిహేను రోజుల లోపలే ఉన్నదంతా ఖర్చు చేసేశారు. సంసారం గడిచే సమస్య అలాగే ఉండిపోయింది.

సుబ్బయ్య మళ్ళీ పాపన్న వద్దకు వచ్చి, "ఒక వందరూపాయలు బదులిచ్చారంటే, రెండావులను కొని పాలవ్యాపారం చేసుకుంటాను," అన్నాడు.

"నా దగ్గిర చిల్లిగవ్వ లేదు. నీ దగ్గిర కొన్న స్థలం బాగుచేసి చిలగడదుంప నాటుదామనుకుంటున్నాను. కూలిపని నువే చేసి కూలి డబ్బులు పుచ్చుకో. పంట వచ్చాక గాని నా దగ్గిరికి డబ్బురాదు. అంతదాకా ఈ కూలి డబ్బులతో నీకు కాలక్షేపం అవుతుంది," అన్నాడు పాపన్న.

"ఇంతకాలం పట్నవాసం చేసినవాణ్ణి, పొలంపని నా వల్ల అవుతుందా? పార పట్టుకోవటం కూడా నాకు చాతకాదు. సరే, మీ పంట రానివ్వండి. అంతదాకా ఎలాగో గడుపుకుంటాం," అన్నాడు సుబ్బయ్య.

అతను ఆ గ్రామంలోనే ఒక వర్తకుడి కొట్టులో లెక్కలు రాయటానికి కుదిరి,



మోసం చెయ్యటంలో ఆరితేరినవాడు గనక, ఇంటికి అంతో ఇంతో రహస్యంగా చేర్చుకుంటూ వచ్చాడు.

పాపన్న తాను కొన్న స్థలాన్ని తానే స్వయంగా బాగు చేసుకోవటానికి పూనుకుని, కొడవలీ, పలుగూ, పారా తీసుకుని బయలుదేరాడు. ఆ దిబ్బ మీద పెరిగిన పిచ్చిమొక్కలన్నిటినీ కొట్టేసి, పలుగుతో తవ్వనారంభించాడు. అలా తవ్వుతుండగా ఒక చోట చక్కని నాగశిల దొరికింది. దాన్ని ఎక్కడైనా మంచిచోట ప్రతిష్ఠ చేయింతామని అతను పైకి తీసి ఒకచోట పెట్టేటప్పుడు, ఆ శిల కిందనే గుంటలో ఒక



చిన్న కుండ దొరికింది. ఆ కుండకు మూత బిగించి ఉన్నది. కుండను ఆడిస్తే, లోపల డబ్బు ఉన్నట్టుగా గలగలా శబ్దమయింది.

"సుబ్బయ్య అదృష్టం! సమయానికి డబ్బు దొరికింది," అనుకుంటూ పాపన్న ఆ కుండను అలాగే తీసుకుపోయి సుబ్బయ్య కిచ్చి, "ఇదుగో, సుబ్బయ్యా, మీ పూర్వీకు లెవరో మీ స్థలంలో పాతి పెట్టుకున్న డబ్బు. ఎంత ఉన్నదో ఎంచి చూసుకుని, ఆవులను కొనుక్కో," అన్నాడు.

పాపన్న సద్బుద్ధికి సుబ్బయ్య ఆశ్చర్య పోయి, పాపన్న ఎదటే కుండ మూత తీసి చూశాడు. అందులో నూరు వెండి రూపాయి నాణాలున్నాయి. సుబ్బయ్య పాపన్నకు తన కృతజ్ఞత చెప్పుకుని, అతన్ని పంపేశాడు.

ఆ డబ్బుతో సుబ్బయ్య రెండు మంచి జాతి ఆవులను కొని, పాలవ్యాపారం సాగించాడు. బస్తీలో పాలకు మంచి గిరాకీ గనక, సుబ్బయ్య పెద్ద కొడుకు బస్తీకిపోయి, పాలు అమ్మి, డబ్బు తెస్తూ ఉండేవాడు. కొంత పాలూ, పెరుగూ గ్రామంలోనే అమ్ముడయేవి. సుబ్బయ్య కల్తీ వ్యాపారంలో ఘటికుడు గనక పాలవ్యాపారం బాగా లాభసాటిగానే సాగింది. ఆవులకు మేత ఖర్చు కూడా లేదు, అవి అడవిలో మేసి వచ్చేవి.

పాపన్న తనకు దొరికిన నాగశిలను, ఒక రావిచెట్టు కింద అరుగు కట్టించి, దానిపైన ప్రతిష్ఠ చేయించేశాడు. గ్రామస్థులు దాన్ని పూజిస్తూ, దానికి మొక్కులు చెల్లిస్తూ, దాని చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూ, అప్పుడప్పుడూ పాలతో దానికి అభిషేకాలు కూడా చేసే వారు; అందుకు కావలిసిన పాలు సుబ్బయ్య దగ్గిరే కొనేవాళ్ళు.

ఒక నాగులచవితికి పాపన్న తన భార్యనూ, కొడుకునూ వెంటబెట్టుకుని నాగ నైవేద్యానికి బయలుదేరాడు. మీనాక్షి చలిమిడి ఉండలూ, అప్పాలూ తీసుకున్నది. పాపన్న కొడుకు లోటాలో పాలు తీసు



కున్నాడు. అయితే దారిలో ఆ కుర్రవాడికి ఎదురుదెబ్బ తగిలి పడిపోవటంలో లోటాలో ఉన్న పాలన్నీ నేలపాలయాయి.

దారిలోనే సుబ్బయ్య ఉండే ఇల్లు. పాపన్న అక్కడ ఆగి, సుబ్బయ్య క్షేమ సమాచారాలు విచారించి, "చూడు, సుబ్బయ్యా. నాగాభిషేకానికి ఇంటి నుంచి తెచ్చుకున్న పాలు కాస్తా ఒలికి పోయాయి. కాసిని పాలు ఇయ్యి," అన్నాడు.

"పాలు ఇంటి నుంచి మోసుకురావాలా, పాపన్నగారూ? ఇక్కడ పాలవ్యాపారం చేస్తూ నే నుంటినిగా? నాగాభిషేకానికి అందరూ నా దగ్గిరే పాలు కొనుక్కుపోతారు. మీబోటి వాళ్ళు కొంటేనే గదా నా వ్యాపారం నడిచేది?" అన్నాడు.

సుబ్బయ్య భార్య కాసిని పాలు తెచ్చి లోటాలో పోసింది. అభిషేకం ముగించి ఇంటికి తిరిగి పోయేటప్పుడు మీనాక్షి సుబ్బయ్య భార్యకు ఇన్ని చలిమిడి ఉండలూ, అప్పాలూ ప్రసాదంగా ఇచ్చింది.

ఇది జరిగిన మర్నాడే సుబ్బయ్య ఇంట ఒక ఉపద్రవం జరిగింది. సుబ్బయ్య భార్య రెండావులనూ పాలు తీసి పెద్ద పాత్రలో పోసేస్తూండగా ఆ పాత్రలో నుంచి బుస్సుమంటూ పాము బయటికి వచ్చి,



ఎటో వెళ్ళిపోయింది. సుబ్బయ్య భార్య హడలిపోయి చాపకేక పెట్టింది. పిల్లలు దడుచుకున్నారు. సుబ్బయ్య దిగాలు పడ్డాడు. ఆ పూట పాలు అవతల పార బోయవలసి వచ్చింది.

ఆ సాయంకాలం తిరిగి ఇదే విధంగా జరిగింది. పాము వచ్చి ఆ పాలు పోసే పాత్రలో ఎందుకు పడుకుంటున్నదో ఎవరికీ అర్థం కాలేదు. ఈ సంగతి మాత్రం ఊరంతా పాక్కిపోయింది.

అందరూ తలా ఒక రకంగానూ అను కున్నారు. సుబ్బయ్య పాలలో దారుణంగా నీరు కలపటం చేత దేవుడిలా బుద్ధి చెబు







తున్నాడని కొందరన్నారు. ఇంతకాలమూ ఇలా కాకపోవటానికి కారణ మేమిటని మరికొందరు ఆక్షేపించారు.

"నాగాభిషేకానికి అమ్మే పాలు మరీ అన్యాయం. బొత్తిగా నీళ్ళలో పాలు కలుపుతాడు. అందుకే ఇలా అయింది," అని మరికొందరన్నారు.

సుబ్బయ్య భార్యమటుకు తన భర్తతో, "మీరు పాపన్నగారికి పాలు ఇచ్చి డబ్బు పుచ్చుకున్నందున ఇలా జరిగి ఉంటుంది. వెంటనే ఆ డబ్బు ఆయనకు తిరిగి ఇచ్చెయ్యండి," అన్నది.

సుబ్బయ్య అలాగే చేశాడు. కాని మర్నాడు కూడా పాలపాత్రలో పాము కనిపించింది. ఏ పూట కాపూట చేతులారా పితికిన పాలు పారబొయ్యటం జరుగుతున్నది.

ఈ సంగతి పాపన్న దాకా వెళ్ళింది. దీని సంగతేమిటో తెలుసుకోవాలని పాపన్న పెద్ద ఎత్తున నాగోత్సవం జరిపి, నాగపూజ చేయించాడు. పూజ చేసే వాడికి మధ్యలో పూనకం వచ్చింది. ఆ పూనకంలో వాడు, "ఒరే, పాపిష్ఠి సుబ్బయ్యా! నిన్ను నాశనం చేసేస్తాను. నువ్వు లోకులకు నీళ్ళు కలిపిన పాలు అమ్మేది చాలక, నా అభిషేకానికి అటువంటి పాలే అమ్ముతున్నావు. నీ ఇల్లు నిలబెట్టిన పాపన్నకు—నన్ను స్వయంగా ప్రతిష్ఠ చేసినవాడికి కూడా—అటువంటి పాలే అమ్మావు. ఇన్నాళ్ళు క్షమించను!" అని కేకలు పెట్టాడు.

"బుద్ధి గడ్డి తిని అపచారం చేశాం. క్షమించు, నాగదేవతా! కాపాడు!" అని సుబ్బయ్యా, భార్యా పొర్లుదణ్ణాలు పెట్టారు. తరవాత పూజ చేసేవాడికి పూనకం దిగిపోయింది.

అటు తరవాత సుబ్బయ్యను పాములు బాధించలేదు. అతను కూడా న్యాయంగా పాలవ్యాపారం చేసుకుంటూ ఊరివాళ్ళ గౌరవం సంపాదించుకున్నాడు.





# తప్పిపోయిన ఖైదీ

ఒకనాడు పాపన్న భార్య మీనాక్షి, మరి కొందరు స్త్రీలూ పొరుగూరులో జరిగిన సంతకు వెళ్ళి తిరిగి వస్తూండగా, దారిలో కాలవ ఒడ్డున, ఒక చెట్టు కింద ప్రసవ వేదనపడుతున్న ఒక పడుచు పేదరాలు కనిపించింది.

మీనాక్షి అడిగిన మీదట ఆ మనిషి, తన పేరు శారద అనీ, తానొక బిచ్చగత్తెననీ, బిచ్చమెత్తుతూ ఒక ఊరి నుంచి మరొక ఊరికి పోతుంటే దారిలో నెప్పు లారంభమయాయనీ, తనకు దేవుడు తప్ప మరెవరూ దిక్కు లేరనీ చెప్పింది.

తన వెంట ఉన్న స్త్రీల సహాయంతో మీనాక్షి శారదను తన యింటికి చేర్చి, ఒక గది ఖాళీచేసి, శారదను అందులో పడుకో బెట్టి, మంత్రసానిని పిలిపించి, పురిటి సన్నాహాలు చేసింది. త్వరలోనే శారదకు ప్రసవం అయింది.

కాస్త చీకటిపడి ఇంటికి వచ్చిన పాపన్న, లోపలికి అడుగుపెడుతూనే చంటి బిడ్డ ఏడుపు విని ఆశ్చర్యపోయాడు. మీనాక్షి అతని ఆశ్చర్యానికి నవ్వుతూ జరిగిన సంగతి చెప్పింది. తన భార్య చేసినపనికి పాపన్న సంతోషించాడు.

శారదను చూస్తున్నకొద్దీ, ఆమె బిచ్చగత్తె అని మీనాక్షికి నమ్మకం కలగలేదు. శారద మాటతీరు చూస్తే బాగా బతికిన మనిషిలాగే ఉన్నది. ఆమె మెడలో బంగారు పుస్తె లున్నాయి. అంతేగాక ఆమె తన గుడ్డల మూట నుంచి రెండు బంగారు గాజులు తీసి మీనాక్షికిస్తూ, "నా దగ్గిర ఉన్నదంతా ఇదే. మీరు నాకు చేసిన ఉపకారానికి ఏమిచ్చినా ఋణం తీరదు. వీటిని తీసు కోండి. ఇటువంటి కష్టానికి అక్కరకు వస్తాయనే వీటిని యిన్నాళ్ళూ దాచి ఉంచుకున్నాను," అన్నది.







మీనాక్షి వాటిని తీసుకోక, "మా ఋణం నువేమీ తీర్చవద్దులే. వీటిని నువే ఉంచుకో, మరొకప్పుడు ఉపయోగపడతాయి. నిన్ను చూస్తే బాగా బతికిన దానివిగా కనిపిస్తావు. ఇటువంటి స్థితి కెలా వచ్చావు?" అని అడిగింది.

"అవునమ్మా. నాకు తల్లిదండ్రులు లేరు గాని, బంధువులున్నారు. అయితే నేను ఒక కటిక దరిద్రుణ్ణి రహస్యంగా పెళ్ళాడి వాళ్ళకు ఆగ్రహం తెప్పించాను. నేను గర్భవతిని కాగానే వాళ్ళు నిజం తెలుసుకుని నన్ను వెళ్ళగొట్టారు. చేసేదిలేక నేనూ, నా భర్తా ఊళ్ళవెంట బిచ్చమెత్తుతూ తిరుగుతున్నాం. ఇద్దరమూ కలిసి బిచ్చమెత్తితే మమ్మల్ని చూసి జాలిపడరు. అందుకని విడివిడిగా తిరుగుతూ సాయంకాలం వేళ ఒక చోటికి చేరుతున్నాం. నాకు నొప్పులు వచ్చిన చోట మేమిద్దరమూ కలుసుకుందామనుకున్నాం. కాని అది పడలేదు," అన్నది శారద.

అదికూడా మీనాక్షి పాపన్నలకు వింతగానే ఉన్నది. శారద వంటి మనిషి ఒక కటిక దరిద్రుణ్ణి ప్రేమించి పెళ్ళాడి, బంధువులను పోగొట్టుకుని, బిచ్చమెత్తుతూ చెట్టు లేని పిట్టగా జీవిస్తున్నదంటే వాళ్ళకు నమ్మ శక్యంగాలేదు.

శారద పదోరోజున స్నానంచేసింది. ఆమె కోసం ఆమె భర్త రాలేదు. వస్తాడని శారద ఎదురు చూడనూ లేదు. ఇదికూడా పాపన్నకూ మీనాక్షికీ అనుమానంగానే కనబడింది. మరి రెండు రోజులకు పాపన్న ఇంటికి రాజభటులు వచ్చి, "ఈ ఇంట్లో శారద అనే మనిషి ఉన్నదా?" అని అడిగారు.

"ఎవరా శారద? ఆమె కోసం మీరెందుకు వెతుకుతున్నారు?" అని పాపన్న రక్షకభటుల నడిగాడు.

"ఆ శారద మొగుడు పరమేశం హంతకుడు. రాజాధికారి అయిన సుబేదారును





చంపి, పట్టుబడి, విచారణ జరిగేలోపలే నిర్బంధం నుంచి తప్పించుకు పారి పోయాడు. ఆరు నెలలుగా అతన్ని పట్టు కోవటానికి పడరాని పాట్లన్నీ పడుతున్నాం. పరమేశం దొరక్కపోతే పరమేశం భార్య నైనా పట్టుకోమని రాజాజ్ఞ అయింది. ఆమెకు భర్త ఆచూకీ తెలిసే ఉండాలి. అనేకమందిని విచారించగా శారద నిండు చూలాలుగా మీ ఇంటికి చేరి, అక్కడ ప్రసవ మైనట్టు తెలిసింది," అన్నారు రాజభటులు.

"ప్రసవమైన స్త్రీని పట్టుకుపోవట మేమిటి? ఇంత అక్రమం నేనెక్కడా విన లేదు," అన్నాడు పాపన్న.

"రాజాజ్ఞకు క్రమమూ అక్రమమూ అంటూ ఉంటాయా?" అన్నారు భటులు.

"రాజుగారు ఆజ్ఞ ఇచ్చేటప్పుడు ఆమె బాలింతరాలుగా ఉంటుందని కలగన్నారా? బాలింతరాలని తెలిస్తే అలాటి ఉత్తరువు ఆయన ఒక్కనాటికి ఇవ్వరు, నాకు తెలుసు," అన్నాడు పాపన్న.

రాజభటుల వెంట వచ్చిన సర్దారు చిరాకుగా, "ఇవన్నీ మాతో ఎందుకు చెబు తారండీ? మేము పరమేశాన్ని పట్టుకోవటం కోసం అతని భార్యను పట్టుకుపోతున్నాం. అది రాజాజ్ఞ. మా విధి మేము నిర్వర్తించి తీరాలిసిందే!" అన్నాడు.





"నేనే పరమేశాన్ని. నన్ను పట్టుకు పొండి," అన్నాడు పాపన్న.

రాజభటులు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. వాళ్ళ సర్దారు మటుకు బేడీలు తీసి పాపన్న చేతులకు తగిలించి, "ఇక పదండి!" అన్నాడు తనవాళ్ళతో.

ఇదంతా జరిగేటప్పుడు మీనాక్షి అక్కడే నిలబడి ఉన్నది. ఆమె ఏమీ అనలేదు. కాని శారద పెద్దపెట్టున ఏడుస్తూ బయటికివచ్చి, "అయ్యోయ్యో, ఆయనను పట్టుకుపోకండి. ఆయన నా భర్తగారు. నాభర్త హంతకుడూ కాదు. అంతా అయోమయంగా తయారయింది," అన్నది.



"నువ్వూరుకో, అమ్మా. నాకేమీ ప్రమాదం లేదు," అన్నాడు పాపన్న.

మీనాక్షి శారదను పొదివిపట్టుకుని, "ఊరుకో! ఏడవకు! అన్యాయం ఏమీ జరగదు. అయోమయమంతా సరి అవుతుందిలే," అన్నది.

రాజభటులు పాపన్నకు బేడీలు వేసి తీసుకుపోతుంటే గ్రామంలో కొందరు నిర్ఘాంతపోయారు. గిట్టనివాళ్ళు, "ఈ పాపన్న సామాన్యుడా? రహస్యంగా ఎవతెనో చేరదీశాడు. అది గర్భిణీ అయి పాపన్న ఇంటి మీద వచ్చిపడి తిష్ఠవేసింది. పాపం బద్ధలయేసరికి, రాజభటులు పాపన్నను పట్టుకుపోతున్నారు," అన్నారు.

రాజభటులు పాపన్నను నగరానికి తీసుకుపోయి, కొత్వాలు ఎదటపెట్టారు.

"తప్పించుకు పారిపోయిన హంతకుడు పరమేశమే దొరికాడు. పట్టుకువచ్చాం!" అన్నాడు సర్దారు.

కొత్వాలు పాపన్ననూ, భటులనూ తీసుకుని సుబేదారు కచ్చేరికి వెళ్ళాడు. కొత్త సుబేదారు పాపన్నను చూసి గుర్తుపట్టి, "మీకేమైనా మతులు పోయాయా? ఈయన హంతకుడేమిటి? పరమేశం ఏమిటి? ముందా బేడీలు ఊడదియ్యండి," అని కేక







వేశాడు. ఇంతలో ఒక మనిషి అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "వారిని ఖైదులో పెట్టకండి. ఆయన ధర్మరాజు. పరమేశాన్ని నేను!" అన్నాడు.

పాపన్న ఆ మనిషి కేసి ఆశ్చర్యంగా చూశాడు. ఆ మనిషి గడ్డాలూ, మీసాలూ పెరిగి, జబ్బుపడి లేచినవాడులాగా ఉన్నాడు. బట్టలన్నీ చిరిగి, మట్టికొట్టుకుని ఉన్నాయి.

సుబేదారు ఆ మనిషి కేసి ఆశ్చర్యంగా చూసి, "నువా పరమేశానివి? నిన్ను పట్టుకోవటానికి బ్రహ్మప్రళయమైపోయినే. అట్లా కూర్చో, నీ కోసం ఎందుకు వెతుకుతున్నామో చెబుతాను," అన్నాడు.

తరవాత సుబేదారు పాపన్నకు అసలు కథంతా చెప్పాడు.

పాత సుబేదారును హత్య చేసినది పరమేశం కాదు, మరొక దుర్మార్గుడు. వాడు హత్య చేసిన కత్తిని పరమేశం పుస్తకాలలో పెట్టాడు. పరమేశం సుబేదారు కచ్చేరీలో పనిచేసేవాడే. అనుమానం బలంగా ఉండటంచేత పరమేశాన్ని పట్టుకున్నారు. తనకు ఉరి శిక్ష పడుతుందన్న భయంతోనే ఏమో, పరమేశం నిర్బంధం నుంచి తొందరపడి తప్పించుకుని పారిపోయాడు. అప్పట్లో పరమేశాన్ని పారిపోయిన హంతకుడుగానే భావించి పట్టుకోవటానికి ప్రయత్నించారు.



కాని కొద్దిమాసాలక్రితం అసలు హంతకుడు ఏదో దెబ్బలాటలో చావు దెబ్బలు తిని, తానే పాత సుబేదారును చంపినట్టు వాఙ్మూలం ఇచ్చి మరీ చచ్చాడు. పరమేశం మీద ఉన్న నేరం తొలగిపోయింది. పరమేశాన్ని తిరిగి ఉద్యోగంలో వేసుకోమనీ, అక్రమంగా పట్టుకుని నిర్బంధంలో ఉంచినందుకు పరిహారం ఇవ్వవలసిందనీ రాజుగారు ఉత్తరు విచ్చారు. అదిమొదలు పరమేశం కోసం రాజభటులు వెతుకుతున్నది అతన్ని విచారణ చేసి ఉరితీయటానికి కాదు. అయితే ఈ సంగతి రాజభటులకూ తెలియదు, పరమేశానికీ తెలియదు. అతను రాజభటులకు అందకుండా తిరుగుతున్నాడు.

పరమేశం ఎంతకాలానికీ దొరక్క పొయ్యేసరికి, 'కనీసం అతని భార్యనైనా పిలిపించి, ఆమెకు పరిహారం చెల్లించమని రాజాజ్ఞ అయింది. దాన్ని కొత్వాలూ, రాజభటులూ ఈ విధంగా అమలు జరిపారు.

సుబేదారు జరిగిన పొరబాటుకు పాపన్నకు క్షమాపణ చెప్పుకున్నాడు.

"చాలా సంతోషం. ఈ శుభవార్త వినటానికి నాలుగురోజులు ఖైదులో కూర్చోవలసి వచ్చినా నేను విచారించను. అయితే, ఈ పరమేశాన్ని నా వెంట తీసుకుపోయి ఆయన బిడ్డకు బారసాలా, నామకరణమూ వగైరాలు జరిపించటానికి అనుమతి ఇవ్వండి," అన్నాడు పాపన్న.

"నిరభ్యంతరంగా తీసుకుపోండి. అతనిపై ఏ ఆరోపణా లేదు," అంటూ సుబేదారు ఖజానాదారును పిలిచి, పరమేశానికి పరిహారం తాలూకు డబ్బూ, పాపన్నకు ఖర్చులూ ఇప్పించాడు.

పాపన్నను రాజభటులు పట్టుకుపోయినప్పుడు దుఃఖంతో కన్నీరు కార్చిన శారద అతను తన భర్తను వెంటపెట్టుకుని ఇంటికి తిరిగి రాగానే ఆనందబాష్పాలు రాల్చింది.





# ధర్మసత్రం

ఒకసారి పాపన్న రాజధానికి పోవలసి వచ్చింది. అక్కడ పని చూసుకుని వచ్చేటప్పుడు దారిలో తన దగ్గర ఉన్న డబ్బంతా కష్టాలలో ఉన్న వారికి ధర్మం చెయ్యటమే కాక, పాపన్న దారి తప్పి చిక్కులో పడ్డాడు. గాలివాన వచ్చింది. పాపన్న ఒక చోట జారి పడ్డాడు. బట్టలన్నీ బురద అయాయి. అతను ఆకలితో కోపపడుతూ ఒక అపరిచిత గ్రామం చేరి, అక్కడ కనిపించిన మనిషిని, "ఇక్కడ భోజనసత్రం ఏదైనా ఉన్నదా?" అని అడిగాడు.

"ఇప్పుడు లేదు గాని, త్వరలోనే ఇక్కడి ప్రభువుగారొక ధర్మసత్రం కట్టబోతున్నారు. భోజనం కావాలంటే ప్రభువువారి దేవిడీకి పోతే అక్కడ నిత్యమూ అన్నదానం జరుగుతూ ఉంటుంది," అన్నాడా మనిషి.

పాపన్న దేవిడీకి మార్గం తెలుసుకుని వెళ్ళి, చేతులూ, కాళ్ళూ కడుక్కుని పేదసాదలకు అన్నం పెట్టే చోట తాను కూడా వెళ్ళి కూర్చున్నాడు. అక్కడి వాళ్ళు చెప్పుకునే మాటల ద్వారా అతను కొన్ని విషయాలు తెలుసుకున్నాడు.

అక్కడి ప్రభువుకు చాలాకాలం పిల్లలు లేకపోతే, సత్రమూ, బావీ, చెరువూలాంటివి ఏర్పాటు చేయిస్తే పిల్లలు పుట్టుతారని ఎవరో చెప్పారు. అలాగే చేయిస్తానని ఆయన నిశ్చయించుకున్న కొద్ది కాలానికే ఆయనకు మగపిల్లవాడు కలిగాడట. సత్రమూ, బావీ, చెరువూ ఏర్పాటు చెయ్యటానికి పదివేలు ఖర్చవుతుందని అంచనా వేశారు. అందులో మూడువంతులు ప్రభువు వేసుకునేటట్టూ, ఒక వంతు రైతుల నుంచి వసూలు చేసేటట్టూ ఏర్పాటయింది. చెరువు ఏర్పడితే రైతుల పొలాలకు నీరందుతుంది, వాళ్ళూ లాభం పొందుతారు గనక, వాళ్ళు చందాలు వేసుకోవటం భావ్యమే. ప్రభువుగారు ఖర్చు

చేయదలిచిన ధనాన్ని నేడో రేపో శివాలయానికి తీసుకుపోయి, దేవుడికి నివేదన చేసి, ఆ తరవాత దానితో పని ప్రారంభించబోతున్నారు కూడా. ఈ సంగతులన్నీ వింటూ పాపన్న భోజనం ముగించాడు.

భోజనాలు చేసిన వాళ్ళు బయటికి వెళ్ళిపోవటానికి ఒక దారి ఏర్పాటు చేశారు. అది హాజారానికి పోతుంది. అక్కడ ప్రభువుగారు ఒక ఆసనం మీద కూర్చుని ఉంటాడు. అన్నదానం పొందిన వాళ్ళందరూ ఆయన దగ్గిర ఆగి, "అన్నదాతా, సుఖీభవ! తమ ఉపకారం మరవలేను. దేవుడు మీకు మేలు చేయాలి," అని, ఒక నౌకరిచ్చే పావలా దక్షిణతోబాటు తాంబూలం పుచ్చుకుని, తన పేరు చెప్పి వెళ్ళిపోవాలి. పాపన్న కూడా అలాగే చేశాడు.

పాపన్న తన పేరు చెప్పుతుని పావలా దక్షిణ తాంబూలం పుచ్చుకుంటూండగా విని, ప్రభువు ఉలిక్కిపడ్డట్టయి, అతన్ని వెనక్కు పిలిచి, వివరాలు అడిగి, అతనే పరోపకారిగా ప్రసిద్ధికెక్కిన పాపన్న అని తెలుసుకున్నాడు. ఆయన పాపన్న పేరు విని ఉండటమే కాదు, అతనంటే చాలా అసూయగా కూడా ఉన్నాడు. ఆ పాపన్న చాలా సామాన్యుడు. దానధర్మాలలో



అయినా తన వంటి వాడితో ఏ మాత్రమూ పోటీ చెయ్యలేడు. కాని అతనికున్న ఖ్యాతిలో తనకు పదో వంతు లేదు. అంత పేరు ప్రఖ్యాతులు గల పాపన్నను హీనంగా చూడటానికి, హీనుడని నలుగురికి చూపటానికి ప్రభువు మంచి ఆలోచన చేశాడు.

పాపన్న తాను తిండికి మాడేస్థితి ఎలా సంభవించినదీ చెప్పాక ప్రభువు, "చూడు, పాపన్నా! నువు ఇతరులకు సహాయం చేసేవాడివి. అలాటి వాడికి నేనివాళ ప్రాణం నిలబెట్టాను. నీ వంటి వాడు మాటలతో కృతజ్ఞత చెప్పటం నీకూ తృప్తిగా ఉండదు, నాకూ ఉండదు. అందుచేత నాకు ఏదో







విధంగా ప్రత్యుపకారం చెయ్యటం ఉచితం," అన్నాడు.

"నా నుంచి ఎలాటి ప్రత్యుపకారం కోరుతారో సెలవివ్వండి," అన్నాడు పాపన్న.

"ప్రస్తుతం ధర్మసత్రం పని ఒత్తిడి చాలా హెచ్చుగా ఉన్నది. నాలుగు రోజులపాటు నాకు అదనపు నౌకర్లు కావాలి. నాకు నౌకరుగా ఉండమని నేను నిన్నడగను. అది భావ్యం కాదు. కాని నీ అంతట నువే నా దగ్గిర నాలుగు రోజులపాటు నౌకరుగా ఉండి ఋణం తీర్చుకుంటానన్న పక్షాన నాకు అది తగిన ప్రత్యుపకారం అవుతుంది," అన్నాడు ప్రభువు.

"అయ్యా, నా కీపూట అన్నం పెట్టి నా ప్రాణం కాపాడారు గనక దానికి ప్రత్యుపకారంగా నన్ను మీ సేవకుడుగా ఉపయోగించుకోండి," అన్నాడు పాపన్న.

ప్రభువు గొప్ప విజయం సాధించిన వాడిలాగా అందరి కేసీ చూశాడు. పాపన్న అన్న మాటలు అక్కడున్న వారందరూ విన్నారు. ప్రభువుకు తృప్తి అయింది, "సరే, పాపన్నా, నీ యిష్టప్రకారమే కానీ, నువు నాలుగు రోజులపాటు నాకు సేవకుడుగా పని చెయ్యి," అన్నాడు.

నిజానికి పాపన్న చేత చేయించుకోదగిన సేవ ఏదీ లేదు. 'కాని పదిమంది ఉన్నప్పుడు ప్రభువు వాళ్ళకు పాపన్నను పరిచయం చేసి, అతని కేదో పని చెప్పి పంపేవాడు. ఇందువల్ల తన కీర్తి పెరుగుతున్నదని ఆయన నమ్మకం.

ప్రభువుగారి ధనాన్ని దేవుడికి సమర్పించి, సత్రానికి శంకుస్థాపన చేసే ముహూర్తం రోజు వచ్చింది. నూరేసి రూపాయలను ఒక్కొక్క పసుపుగుడ్డలో కట్టి, అలాటి చిన్న మూటలు అయిదేసి కలిపి ఒక్కొక్క పెద్ద మూటగా కట్టి మొత్తం పదిహేను పెద్ద మూటలు చేసి, పదిహేనుమంది పట్టుకుని, మిగిలిన పరివారాన్ని వెంట బెట్టుకుని







ఆలయానికి బయలుదేరారు. ధనంమూట ఒకటి ప్రభువుగారే స్వయంగా పట్టు కున్నాడు. మిగిలిన పధ్నాలుగు మందిలో పాపన్న కూడా ఉన్నాడు.

అందరూ కలిసి సన్నని దారి వెంట నడుస్తూండగా ప్రభువుగారు తూలాడు. ఆయన చేతిలో ఉన్న డబ్బుమూట కిందపడి దొర్లి, దారి పక్కన ఉన్న బురదగుంటలో పడి పోయింది. వెంటనే కొందరు బురదలో దిగి వెతికారు. పెద్దమూట కింద పడినప్పుడు ఊడి పోయినట్టున్నది. అందులో ఉన్న చిన్న మూటలు, వెతికే వాళ్ళకు విడివిడిగా దొరికాయి. ఆ దొరకటం కూడా నాలుగే దొరికాయి. అయిదోది ఒకంతట దొరకలేదు.

"నూరురూపాయలే కద? ఇంటి నుంచి తెప్పిస్తాం. ఒక నూరు భూదేవికి అర్పించామనుకుంటాం," అంటూ ప్రభువు తన ఇంటి కొక నౌకరును డబ్బు తెచ్చేందుకు పంపి, తాను మిగిలిన వాళ్ళతో సహా ఆలయానికి సాగిపోయాడు.

పాపన్న మటుకు ఆ బురదగుంటను మరింత లోతుగా కుళ్ళగించి, చాలాసేపు ప్రయాస పడ్డ మీదట అయిదో నూరు రూపాయల మూటను సంపాదించాడు. అప్పటికి రాత్రి ఝాము పొద్దు పోయింది. ఈ లోపల ధనాన్ని దేవుడికి నివేదన చెయ్యటమూ, ధర్మ సత్రానికి శంకుస్థాపనా అయిపోయింది.

పాపన్న ప్రభువుగారింటికి వెళ్ళి స్నానం చేసి, రూపాయల మూటకు పట్టిన మురికి పోయినంత వరకు కడిగి, దాన్ని తీసుకు పోయి ప్రభువు ఎదట పెట్టి, "ఇదుగోనండి, బురదలో పడిపోయిన నూరురూపాయల మూట," అన్నాడు.

ప్రభువు సందిగ్ధంలో పడ్డాడు. సత్రానికి కేటాయించిన డబ్బు ఈశ్వరార్పితం అయింది. ఇప్పుడీ నూరూ అందులోది కాదు. దాన్ని పాపన్న దగ్గిర తీసుకుంటే





అది తన సొంతానికి తీసుకోవటమే అవుతుంది. అందుచేత ప్రభువు, "దాన్ని నేను అప్పుడే వదిలేశాను. అందుచేత నువే ఉంచుకో. నాలుగు రోజులుగా సేవ చేశావు కద. అన్నట్టు నీ గడువు పూర్తి అయింది. రేపు నువు వెళ్ళిపోవచ్చు," అన్నాడు.

పాపన్న మర్నాడు ఆ నూరురూపాయల మూటతో తన ఊరికి బయలుదేరాడు. అతను ఆ జమీందారీ శివార్లు చేరే సరికి అమితంగా దాహం వేసింది. అతను ఒక రైతు ఇంటి దగ్గిర ఆగి మంచినీరడిగాడు.

"తాగు, నాయనా. ఈ నీళ్ళతో రేపు మాకూ రుణం తీరుతున్నదిలే," అన్నాడు రైతు నిస్పృహగా.

సంగతేమిటని రైతు నడిగాడు పాపన్న. ప్రభువుగారు కట్టించే ధర్మసత్రం వగైరాల కింద ఆ రైతు వంతు నూరురూపాయలిచ్చుకోవలిసి వచ్చిందట. ఎంత ప్రయత్నించినా రైతు ఒక్క దమ్మిడీ పోగు చెయ్యలేక పోయాడు. రెండునెలలు గడువియ్యమని కోరితే ప్రభువుగారి ఉద్యోగులు, గడువులోపల కట్టకపోతే జమీందారీ నుంచి గెంటేస్తామన్నారుట.

పాపన్న రైతుకు తన వద్ద ఉన్న నూరు రూపాయల పసుపుగుడ్డ మూట ఇచ్చి, "దీన్ని తీసుకుపోయి కట్టు. నిజానికిది వారి డబ్బే. ప్రస్తుతం నా డబ్బు. నేను దీన్ని నీ కిస్తున్నాను," అన్నాడు.

రైతు దాన్ని మర్నాడే తీసుకుపోయి దివాణంలో కట్టాడు. మట్టి మరకలుగల పసుపు గుడ్డలో నూరురూపాయలు చూసి, "ఇది మన డబ్బులాగే ఉందే?" అన్నారు ఉద్యోగులు ప్రభువుతో. ప్రభువు రైతును, "ఇది నీ కెలా వచ్చింది?" అని అడిగితే పాపన్నే ఇచ్చినట్టు తెలిసింది.

పాపన్న తన డబ్బును తనకే చేర్చినందుకు ప్రభువు ఆశ్చర్యపోవటమే గాక, సిగ్గుపడిపోయాడు కూడా.

